# నాటకశిల్పం

క్రొత్తవ్యాసాలుచేర్చి
కృష్ణాపత్రికనుండి పునర్ముద్రితము



రచన:
రోహిణి

ప్రచురణ:
శ్రీమతి వల్లూరి కమల



సోల్ డిస్ట్రిబ్యూటర్సు:
కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు,
పబ్లిషర్సు అండ్ బుక్‌సెల్లర్సు,
రాజమండ్రి.
1960

# అంకితపత్రం



నాటక కళాప్రపూర్ణ కీ॥ శే॥ మంజులూరి కృష్ణరాయా!
స్వర్గనరకాలే అంటూవుంటే! వాటిల్లో ఎందులో వున్నావో,
పునర్జన్మ అంటూవుంటే! చిలకరూపంలోనే వున్నావో
నెమలిరూపంలోనే వున్నావో,
ఇవేవీ కాక అనంతంలోనే లీనమైపోయినావో.

నువ్వు నాటకం రిహార్సల్సులో పుస్తకంపుచ్చుకుని ఓమూల ఒదిగి కూర్చుని ఆనందభాష్పాలు రాలుస్తూంటే, నీచుట్టూ మేమంతా కూర్చుని నీ ఛలోక్తులు వింటూ ఆనందాన్ని పంచుకున్న దృశ్యాలు "చిరంజీవి ఆంజనేయులు వృద్ధ

మూసినీ రూపంలో రామాయణకథాపారాయణ ఎక్కడ జరిగినా హాజరవుతా''డనే నా నుడిని, నిజం అనిపించేవి.

నీవిప్పుడు ఏమైపోయినా, ఎక్కడవున్నా, నువ్వే నాటకం—నాటకమే నువ్వు. అనే మిత్రవాక్యం సమసిపోలేదు. క్రొత్తనాటకం ప్రారంభిస్తుంటే నువ్వు జ్ఞాపకంవస్తావు. నువ్వు చచ్చిపోయావు, లేవు, అంటే ఎలానమ్మటం ?

రంగంమీదకు పోతూ నటరాజును తల్చుకుంటుంటే నీమూర్తియే కనిపిస్తుంది కాదామరి! నీవు నటరాజువు.

ఈ పుస్తకం నీకంకితమివ్వబోవటం సాహసమే. ఇందులో ఏమీలేకపోవచ్చు. అయినా శక్తికొలదీ కూర్చుకు వచ్చాను.

కన్నప్ప అర్పించిన మత్స్యమాంసాల్ని అతివాత్సల్యంతో స్వీకరించిన ఆ శంకరుని నటరాజరూప మీ పుస్తకాన్నికూడా అంతవాత్సల్యంతోనూ స్వీకరిస్తుందని నమ్ముతూ అర్పిస్తున్నాను.

స్వీకరించి ధన్యుణ్ణిచెయ్యి,

రోహిణి.

# మనవి

ఈ రచన చేసేందుకు నాకున్న అర్హతల్లా, ఆంధ్ర నాటకరంగంతో ప్రత్యక్షంగానైతేనేమి పరోక్షంగానైతేనేమి నాకున్న పరిచయమూ, అప్పుడప్పుడు పెద్దలనోటివెంట విన్న విషయాలు వారివల్ల చూచి నేర్చుకున్న అనుభవములున్నూ.

ఈ పుస్తకం నటులకు ఏమాత్రమైనా వుపయోగ పడవచ్చుననే ఆశతో వ్రాసాను. అనేకమంది మిత్రులు అమూల్యమైన అనేక సలహాలనిచ్చారు. వారందరికీ కృతజ్ఞుణ్ణి.

నాటకశిల్పంమీద ఈపుస్తకం అసమగ్రమేకావచ్చు, అయినప్పటికీ తెలుగులో నీ పోకడలో పుస్తకాలు లేనిలోటు తను యిది కొంతవరకూ తీర్చివచ్చుననే ఆశతో సాహసమైన నీ పనికి పూనుకున్నాను. ఆశించినదానికంటె ఎక్కువగా ఆంధ్రమహాజనుల ఆదరం లభించింది.

ఈ పుస్తకాన్నిగురించి తమ అమూల్యాభిప్రాయం ఇచ్చిన 'ప్రముఖనటులు' 'కళాతపస్వి' శ్రీ సింగరాజు నాగభూషణరావుగారు సెలవిచ్చినట్లు:— "........అను భవముగల నటులు, ఇట్టి వారి యనుభవములగూర్చి ఆచరణ యోగ్యమగు సలహాలనొసంగుటను, .........నిర్మాణాస్థ

కముగా పుస్తకములు వ్రాయుట నటలోకమున కెంతయునూ మేలొనగూర్చినవారగుదరు”

తథాస్తు.

ఇదే కోరికతో నేనీ రచన చేసాను. ఏమాత్రం ఫలించినా అపరిమితంగా సంతోషిస్తాను.

నటరాజులకు జై.
ఆంధ్రనాటకరంగం చిరస్థాయిగా వర్ధిలుగాక.

భవదీయ
రోహిణి.

# కృతజ్ఞత



నా నేర్చినకొలది అనుభవంతో సాహసించి రచించిన ఈ వ్యాసాలను, స్థలాభావాన్ని కూడ పాటించక ధారావాహికంగా తమ పత్రికలో ప్రచురించి వీటిని వెలికి తెచ్చిన కృష్ణా పత్రికాధిపతులకూ, అత్యంతాదరంతో వీటిని స్వీకరించిన పాఠక మహాశయులకూ, వీటి గురించి తమ అమూల్యాభిప్రాయము లొసంగిన నాటకకళావేత్తలకూ, అభిమానులకూ;

వీటిని పుస్తకరూపంలో ప్రచురించు నందుకుగాను రెండు వందల ఏబదిరూప్యముల కానుక (గ్రాంటు) నొసంగిన ఆంధ్ర ప్రదేశ సంగీత నాటక ఎకాడమీ సంస్థకు,

ముద్రణవగైరా పనులలో సహకరించి వీటిని పుస్తక రూపంలో ఆంధ్రమహాజనులు ఆదరించే భాగ్యం కలిగించిన మిత్రులు చిరంజీవి "కొండపల్లి భాస్కరరావుకు, వారి భాగస్వాములైన మెస్సర్సు కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు వారికి,

చిన్ననాటి మధురస్మృతులు జ్ఞాపకం చేస్తూ పరిచయ వాక్యాలు వ్రాసి యిచ్చిన నా గంగాధరరావుకీ హృదయ పూర్వక కృతజ్ఞతాభివందనలు, లోకనాటకకర్త, సూత్రధారుడు, నటరాజు సదా వీరిని రక్షించుచుగాక.

రోహిణి

# పరిచయవాక్యము

—o—

"శ్రీ రోహిణి"ని నేను చిన్నప్పట్నించీ ఎరుగుదును. ఇద్దరం కూడా చిన్నప్పుడు అరుగులమీద వసారాల్లోనూ దుప్పట్లు తెరలుగట్టి నాటకాలాడిన వారమే. అవ్వీ ఏం నాటకాలు !! పోర్షనులు అక్కరలేదు. రంగులు, కిరీటాలు అప్పటి కప్పుడు తయారు చేసుకోవటం; ఎవరి కిష్టం వచ్చిన పాత్ర వారు ధరించటం.

తర్వాత నాటక రచయితగా రూపించాడు 'రోహిణి' "అజేయచైనా" అనీ, "వందేమాతరం" అనీ, "స్వర్గాని కెళ్ళినా ఏడాకులు తప్పవు" అనీ చక్కని నాటకాలు నేను ఏలూరులో వుండగా ప్రదర్శించాం. తర్వాత నాటకాలాట్టే వ్రాయక పోయినా; ప్రదర్శించటం - విమర్శించటం - తరిఫీదు ఇవ్వటం మొదలైన పనులన్నీ పొడుగునా నిర్వహిస్తూనే వున్నాడు. పిల్లల నాటకాలు కూడ వ్రాయించిన ఈ మధ్య తెలుగు భాషాసమితివారి బహుమానం పుచ్చుకున్నది - అజ్ఞాతంగా - రోహిణి.

ఇతర కారణాలవల్ల మరింతకృషి, కళాసేవ, నాటకరంగానికి, చేయలేక పోయినా, ఈ పుస్తకం వ్రాయటంలో కళాసేవచేస్తూ చాలమంది కంటె మించిపోయాడు రోహిణి.

అందుకు నాకే కన్నెర్రగా వుంది. అందులో ఈ పుస్తకంలో ప్రతివాక్యం అనుభవ పురస్కారంగా వ్రాయబడింది, ప్రతి వాక్యం వెనుకా కష్టనిష్ఠూరాల కథలు చాలా వున్నాయి.

పోష్టర్లంటించటం దగ్గరనుంచీ, తెరకట్టడం దగ్గర్నించీ రిహార్సల్సు చేయించటం దగ్గర్నించీ, నాటకాంతాన కుర్చీలు సర్దుకొని యింటిని వెళ్ళేవరకూ, అన్ని పనులలోనూ మెలిగిన చేయి అవటం మూలాన రోహిణి చేతిలో ఈ పుస్తకం తయారవగలిగింది. కనక నవలగా కాక ప్రతివాక్యం జాగ్రత్తగా చదివి ఆచరణలో జ్ఞాపకం వుంచుకోవాల్సిన పుస్తకం ఇది.

ఇటువంటి పుస్తకాలు కొన్ని తెలుగులోకి వచ్చాయి కాని అవి ఎక్కువ అనుభవం వున్నవారు వ్రాసినవి కావు. ఎక్కువభాగం అవి ఇంగ్లీషు రచయితల అనుభవాలు. వారు వ్రాసినవి మనరంగ స్థలానికి అంతగా ఉపయోగకరంగా కనపడటం లేదు. మన పరిస్థితులు వేరు. మనరంగస్థలం వేరు. మన గ్రీన్ రూంలో సరిగ్గా ఒక కుర్చీకూడా దొరకదు. ఇక స్పిరిట్ గమ్ బాటిల్సు Foot ball లాగా ఎగిరిపోవటంలో ఆశ్చర్యం లేదు. కనుక ఇటువంటి పరిస్థితుల్లో యిటువంటి సంగ్రహమైన పుస్తకం అవసరం ఎంతో వుంది.

నేడు సరదాగా నాటకాలు వేయడానికి అన్ని వృత్తుల్లోవారూ సంసిద్ధు లవుతున్నారు. చాలామంది ఔత్సాహికులు ఏ ఆఫీసులో చూసినా ఏ కాలేజీలో చూసినా కను

పిస్తారు. ఉత్సాహంతో నొకసారి నాటకం వేసినా తర్వాత వీరిలోనే మళ్ళీ జన్మలో పాత్రధారణ చేయనివారు చాలమంది కనుపిస్తారు. వీరికి అనుభవం కావాలంటె కొన్ని నాటకాలు వేయాల్సి వుంటుంది. ఆ శ్రమ అక్కర్లేకుండా ఈ పుస్తకం చాలా మటుకు సహాయపడ్తుంది.

చాలాసార్లు నాటకాలు వేసి అనుభవ ముందని అనుకుంటూ అనుభవంవల్ల సరిదిద్దుకునే సావకాశంలేని వారికి కూడ ఈ పుస్తకం బాగా వుపయోగ పడ్తుంది.

వృత్తిగా నాటకంవేస్తూ సమాజం నిర్వహించక పోతే మానె రంగుపూసు కోవడం కూడా చేతకాకుండా కాలం గడుపుతూ వున్న వృత్తి నటకులకు కూడా యిది బాగా వుపయోగ పడ్తుంది.

ఇటువంటి సాధకబాధ కాలన్నీ పడ్తున్న నాకు కూడా యిది వుపయోగపడిందని సవినయంగా చెప్తూకుంటున్నాను.

ఇప్పుడు నాటకశాఖలేని సంస్థలేదు. క్లబ్‌గాని కాలేజీగాని రైల్వేలలోగాని ఇంజనీర్లలోగాని నన్ని చోట్లా పదిమంది తెలుగువా ళ్ళెక్కడకూడితే అక్కడొక నాటక శాఖ వెలుస్తున్నది. అన్నిచోట్లా అనుభవజ్ఞులు వుండరు. ఈ పుస్తకం దగ్గరవుంటే వారు అనుభవజ్ఞానాన్ని ఎక్కడ నుంచీ దిగుమతి చేసుకో నక్కరలేదు.

నాగార్జునసాగరం నాపరాళ్ళ మధ్యలో నాటకరంగాన్ని వెలయించిన తపస్వి రోహిణి. ఈ పుస్తకం దగ్గర వుంటే రోహిణి దగ్గర వున్నట్టే.

నాటకాన్ని గూర్చి చెప్పటంటే మన పడకకుర్చీ ఉపన్యాసకు లందరికీ భరతముని శ్లోకాలు కొన్నింటిని వల్లెవేసి వుంచిన వాట్ని ఏ కరువు పెట్టడం మరో సంస్కృత కవిని గూర్చి "ఓహోఓహో" అనటం, ప్రస్తుతపు నాటకాలగూర్చి చప్పరించటం అలవాటై పోయింది ఇందువల్ల ఏం అభివృద్ధి సాధిస్తారో తెలియదు. అసలు చిక్కు ఏమిటంటే వీళ్ళకసలు అభివృద్ధి అంటే ఏమిటో తెలియదు. పెద్దవాళ్ళు కనుక వీర్ని పిలిచి వుపన్యాసా లివ్వమంటారు. పెద్దవాళ్ళు కనుక చెప్పిన దాన్ని విని వూరుకుంటారు. ఈ లెక్కన శాసన సభాధ్యక్షుడి దగ్గర్నుంచీ, గ్రామ మునసబుదాకా అందరూ "నెరసిన తల మరుగున" తప్పించుకు పోతున్నారు.

ఇటువంటి పుస్తకాలు బహు వ్యాప్తమైతే అందరూ ఈ అనుభవాన్ని ఆకళింపు చేసుకుంటే కొత్తదోవల వెతికితే అభివృద్ధి వస్తుందిగాని భోజరాజు కాలంలో బంగారపు రంగస్థలంవుందనీ, బళ్ళారిరాఘవకాలంలో కలెక్షన్లు లేవనీ ఏడుస్తూ కూర్చుంటే అభివృద్ధి రాదు.

వృత్తినాటకాలు క్రమంగా నశిస్తున్నాయి. ఇహకొత్త నాటకాలూ, నటవర్గం నేడు అభివృద్ధిలోకి రావాల్సి వుంది.

7వ సంవత్సరాల క్రింద తెలుగునాటక రంగం ఔత్సాహకుల్తోనే ప్రారంభించిది. క్రమంగా నాశనమైనది. తిరిగి మళ్ళీ ఔత్సాహికులు తలెత్తి సరిఅయిన నాటకరంగాన్ని తెలుగు నాట నిలబెట్టాల్సి వుంది. కాలమే అవసరాలను బట్టి కావాల్సిన వాటిని సాధిస్తుంది అంటారు.

ఈ పుస్తకం ఇప్పుడు వెలువడటం చాలాసమయానుకూలంగా వుంది.

రోహిణి యీ పుస్తకాన్నే గాక మరింత మంచి పుస్తకాలను గూడా తెలుగు నటాళి కందివ్వ గలదని ఆశిస్తున్నాను.

గంగాధరరావు

---

## ఈ పుస్తకంగురించి

## సుప్రసిద్ధనటులు, కళాతపస్వి

## శ్రీ సింగరాజు నాగభూషణరావుగారి అభిప్రాయం.

ఈమధ్య శ్రీ "రోహిణి" వ్రాసిన నాట్యకళమీద వ్యాసములు చదివితిని. చాలా శ్రద్ధతీసుకుని వారీవ్యాసములు వ్రాసియున్నారు నాటకసఘములేర్పాటుచేయుట మొదలు కొని నాటకముల నెన్నుకొనుట ప్రదర్శించుటవరకూ తీసికొన వలసిన జాగ్రత్త వారు విపులముగా వ్రాసినారు. నాటక లక్షణములు, అభినయము, వాచికము. ఆహార్యములను గూర్చి ప్రస్తుతము పేరుమోగిన నటులుకూడ చదివి నేర్చు కొనవలసినవి చాలాగలవు. చాలామంది నటకులు ప్రేక్షక లోకమునే పరిగణింపక తమ వాచకముల నప్పగింతురు. ప్రేక్షకులకు అర్థమైనా కాకున్నా వారి బాధ్యతలేనట్లు మరి కొందరు రంగముమీది పాత్రలనే లెక్కచేయక ప్రేక్షకులతో మాట్లాడుదురు. ఇట్టివి లక్షణములలోని ఆంతర్యము సహేతు కముగా విమర్శించి వ్రాసియున్నారు. ఈ వ్యాసములు అంద రకూ అందుబాటులోగల భాషలో వ్రాయబడియుంటచేతను చాలా విపులముగా సాకల్యముగా వ్రాసియుంటచేతను నాట్య కళాభ్యాసనమునకు పాఠ్యపుస్తకముగా నుండదగినవి యని

నా వినయపూర్వకమైనమనవి. అనుభవముగల నటు లెల్ల వారియనుభవములగూర్చి ఆచరణయోగ్యమగు సలహాల నొసంగుచు. పరస్పర దూషణాదుల కాలము వృథాపుచ్చక నిర్మాణాత్మకముగా పుస్తకములు వ్రాయుట నటలోకమున కెంతయూ మేలొనగూర్చినవారగుదురు.

(సం.) సింగరాజు నాగభూషణరావు.
30—10—57 బాపట్ల.



# నటరాజస్తవం

జై, నటరాజ, నమో!
సకలభువనములు ఆఙ్గికంబుగా
సర్వవాఙ్మయము వాచకంబుగా
తారాచన్ద్రులు ఆహార్యముగా
సాత్వికమీవే నమోశంకరా!
జటాజూటమున గంగానిర్ఝరి
ఝుంఝుంఝుమ్మని చిందులేయగా
ఢమరుకంబదీ ఢమఢమ మ్రోయగ
తధిమిధిమ్మనీ తాండవమాడెడు
తాధిమిధిమ్మని నాట్యమాడెడు
నాట్యవేదమున కాదిగురుండా
నటీనటులలో నావహించి మా
నమోవాకముల నందుకోవయా
జై నటరాజనమో, జై నటరాజనమో
జై నటరాజా, జై నటరాజా, జై నటరాజా
జై. జై. జై. జై. జై.

ఈ ప్రార్థనగేయాన్ని ప్రతి నాటకసమాజంవారూ ఉపయోగించుకోవచ్చు. వేరే అనుమతి అడగక్కర్లేదు.

రోహిణి.

# నాటకశిల్పం

## విషయానుక్రమణిక

# నాటకశిల్పం



## నాటకరంగం



ఆఙ్గికం భువనం యశ్య
వాచికం సర్వవాఙ్మయమ్
ఆహార్యంచద్రంతారాదితం
వందే సాత్వికం శివమ్.

జగన్నాటకసూత్రంమీాదఆధారపడిందే నాటకరంగం. నాటకం ప్రకృతికి ప్రతిబింబం. అంతేగాని ప్రకృతిమటుకు కాదు.

"అబ్బే అసలది నాటకంలాలేదు. నిజంగా జరుగుతున్న కథ చూస్తున్నట్టేవుంది" అంటే — జరుగుతున్న కథేచూడ లేదు అనేభావం. ఈ తరహా నాటకాలు చూచినవారు వెల్ల డించిన అభిప్రాయంలోనూ వ్యక్తమవుతుంది. అద్దంలో ముఖం చూచుకుంటాం. అద్దంమంచిదైతే అది మన ముఖానికి మల్లేనే వుంటుంది (కుడి ఎడమలమార్పుతో) అయితే అది మనముఖం మటుకు కాదు. ప్రతిబింబంమాత్రమే. అద్దంమంచిది కాకపోతే

మన ముఖం కాకుండా, మరో వికృతముఖం కనబడుతుంది. చక్కని నాటక ప్రదర్శన మంచిఅద్దం—చెడ్డప్రదర్శన చెడ్డఅద్దం.

వివిధ దేశాల్లోని రంగస్థలాలూ వాటివాటి నియమాలూ వేరువేరుగా వున్నాయి ఏ విషయాలు వేరైనప్పటికీ మూల సూత్రాలుమటుకు ఒకటే. వాటిల్లో ఆట్టే మార్పులేదు. ప్రదర్శకులమీద కొన్ని వేల కళ్ళు కేంద్రీకరింపబడి వుండటం యేదేశంలోనైనా ఒకటే. పాత్ర తెరవెనుక (పక్క) నుంచి రావటం, తనపని ముగియగానే తిరిగి తెరలవెనుకను వెళ్ళి పోవటం ఇత్యాదులు ఒక్కటే. ఇకపోతే రంగాలంకరణలో అనేకమంది అనేక మూత్నపోకడలుపోతారు. అవి ప్రేక్షకుల అభిరుచుల్ని బట్టి, సామాజికుల 'రిసోర్సెస్' ని బట్టీ రాణి స్తూంటాయి.

నీలితెరలముందు చేసిన ప్రదర్శన 'రివాల్వింగ్' స్టేజి మీద అద్భుతరంగపరికరాలతో చేసిన ప్రదర్శనకన్నా తీసి పోయిందని అనుకోడానికి వీలులేదు. ఆమాటకువస్తే ప్రతి ప్రదర్శనకూ రివాల్వింగ్ స్టేజి అనవసరంకూడాను.

భరతనాటక సంప్రదాయంలో వాచికంమూలంగానే చాలామటుకు రంగస్థలాలంకరణ (వర్ణనద్వారా) వగైరా జరిగిపోతుంది. రంగస్థలంమీాద ప్రదర్శించకూడనివి అంటూ కొన్ని నిషేధాలు కూడా వున్నాయి. స్నానం, భోజనం, చుంబనం, శయ్యా, మరణం, యుద్ధం వగైరావగైరా. అయితే యిప్పుడీ నిషేధాల్ని యెవరూ పాటించటంలేదు. అవన్నీ కాల

గర్భంలో కృసిపోయాయి! ఆ నిషేధాలు పాటించడంలేదని ఇప్పుడు ఖరం [illegible]వాల్సిన పనికూడా అంతగా లేదు.

ఈ నిషేధాలు కొన్ని కారణాలవల్ల వచ్చాయి. అవి తెల్సుకు వాట్ని అధిగమిస్తే “హత్తేరీ ఇదినిషేధం” అని ఏ ప్రేక్షకులనూ అననక్కరలేదు. వారికి శాస్త్రవిషయాలూ, ఆఖరికి నిషేధాలైనా తెలియవని ఆడిపోసుకోనక్కరను!

ఉదా: యుద్ధం యెందుకు నిషేధం అన్నారు?

కత్రకత్తులతో ~~[illegible]~~రాన్నించి సాము చెయ్యటమూ రంగస్థలానికి ఆచివర ఒకరూ యీచివర ఒకరూ నుంచుని వేసే బాణాలు మధ్యలోనే పడిపోవడమూ లాంటి అపభ్రంశాలు చేసి యుద్ధం కలిగించాల్సిన భీభత్సరసంబదులు హాస్యరసం ప్రసాదించే ప్రదర్శకులకు ‘యుద్ధం’ రంగంమీద నిషిద్ధం! చక్కగా ప్రదర్శించగలవారుంటే నిషిద్ధంకాదు. ఇలాగే మరణంకూడాను. చచ్చిపోయినవ్యక్తి రంగంమీద ఆట్టేసేపు కదలకుండా వుండలేదు. అంచాత మరణం నిషిద్ధం అన్నారు. అన్నారుకదా అని కత్తిగుండెల్లోపెట్టుకు తెరలోకి పారిపోనక్కర్లేదు! తగు ప్రాక్టీసుతో రసభంగం కలుగకుండా మరణం కూడా ప్రదర్శించవచ్చు.

ఈనిషేధాలలో ముఖ్యంగా యీనాటికీ అందరికీ తెలిసింది ఒకటుంది. రంగస్థలంమీది పాత్ర ప్రేక్షకులకు వెన్ను భాగాన్ని చూపకూడదని. ఇదినటులకు పచ్చివెలక్కాయ

గొంతున పడేలాచేసే నిషేధం. ఈ నిషేధ్యాన్కారణం తెలిసినవారూ తెలియనివారూ సంవర్భాసదర్భాలు ఆలో చించకుండా దీన్ని క్రొత్తనటులమీద ప్రయోగించి వారు నడిచే పీతనడకనుచూచి సంతోషిస్తున్నారు!

వెనక, చమ్కీకోట్ల కాలంలో చెమ్కీకోట్ల శరీరపు ముందు భాగానికిమాత్రమే సరిపోయేలా కుట్టించి వెనుక భాగం ఖాళీగా వదిలేసేవారు. పాత్రధారి వెనక్కు తిరిగితే నగ్నంగావున్న అతని వెన్ను ప్రేక్షకులకు అసహ్యంగా కని పించవచ్చని యిట్లా నిషేధం పెట్టారు. ఫుల్ సూటులో దుస్తులు ధరించే యీరోజుల్లో ఆ నిషేధం అనవసరం. అయితే అలా వెనక్కి తిరగినప్పుడు ఆపాత్రకు వాచికం ఏమీ వుండకూడదు. ఉంటే ప్రేక్షకులకు వెన్నుచూపి చెప్పేవాచికం వినిపించదు.

నాకు తెలిసినంతవరకూ యీ నిషేధాన్ని యెదిరించిన వారు(ఆంధ్రనాటక రంగంలో)సురభి కంపెనీవారు. వారు వారి "స్త్రీ సామ్రాజ్యం" నాటకంలో బట్లరు వెన్నుభాగాన్ని ప్రేక్షకులవేపు తిప్పారు. మొదటిక్షణంలో బట్లరు పాత్రధారి పొరపాటుపడ్డాడనుకుని ప్రేక్షకులు నవ్వారు. కానీ ఆని పాత్ర తరుచు వెన్నుభాగాన్ని ప్రదర్శించడంతో "అతహా బాగా అనుభవంవున్న నటుడేననీ, అది చెయ్యాలనే చేస్తు న్నాడనీ" తెలుసుకున్న ప్రేక్షకులు వూరుకున్నారు. [illegible] రయాచర్య యెబ్బెట్టుగాకూడా లేకుండాస్వాభావికంగావుండేది మూలాన దాన్ని గురించి తర్కవితర్కాలు జరిగి వెన

భాగాన్ని ప్రేక్షకులవేపు తిప్పటం యేమంత తప్పుకాదనీ, సీత నడక నడిచేకన్నా యిదే బాగుందనీ ఓమూదిరినిర్ణయంకూడా జరిగిపోయింది.

పైన చెప్పినలాటి నిషేధాలు ఆయా దేశాచారాల్ని బట్టి యితర దేశ నాటకరంగాలమీదకూడా వుండవచ్చు, లేక వుండకనూపోవచ్చు. నిషేధాలమాట యెలావున్నా ప్రదర్శకులు తాముచెప్పే ప్రతిమాటా చేసే ప్రతిచేష్టా ప్రతి ప్రేక్షకుడికీ తెలియచేయాలనేది యేరంగంమీదనైనా విధి. ఈ అనువాయితీ విస్మరించరానిది.

సరస్వతీదేవి వ్రాసిన "లక్ష్మీస్వయంవరము"ను నాటకమును భరతాచార్యులు దేవసభలో ప్రయోగించినారట. లక్ష్మీపాత్ర ధరించిన ఊర్వశి పొరబాటున "పురుషోత్తముని" అనుటకు బదులు 'పురూరవుని' అన్నదట ఒక సందర్భంలో. అప్పుడా భరతాచార్యులు కోపించి ఊర్వశిని భూలోకవాసిని కమ్మని శపించినారట.

మనకు (భూలోకవాసులకు) నాటకరంగం ఊర్వశి రాకతో వచ్చిందా లేక మరే గ్రీకుదేవతరాకవల్లో వచ్చిందా అని కొట్టుకోడం ఆపేసి యిప్పుడున్న నాటకరంగతీరును గమనించి దీన్ని యథాశక్తి వృద్ధిలోకి తేవడానికి తగు ప్రయత్నాలు చేయటం ప్రతినటుడి విధీ, ప్రతి నాటకసమాజపు విధీ, అయివున్నది. నాటకరంగ చరిత్ర లోతుపాతులు రీసెర్చి చేసి చెప్పేందుకు అంతా బయల్దేరటం అనవసరం అనే ఉద్దేశ్యంతో చరిత్ర లోతులకు వెళ్ళదల్చ లేదిక్కడ.

ఆంధ్ర దేశంలో భామకలాపమూ, గొల్లకలాపమూ, వీధినాటకాలూ ప్రదర్శింపబడే విధానానికీ ధార్వాడపార్సీ కంపెనీలు ప్రదర్శించిన విధానానికీ చాలా తేడావుంది. ఈ కంపెనీల అడుగుజాడల్లో గొప్ప గొప్ప నాటకకంపెనీలు ఆంధ్ర దేశంలో తలెత్తి పెద్దపెద్ద నటులను బైటికితెచ్చాయి. నాటకప్రయోగంలో అనేక పరిణామాలు వచ్చాయి.

విగ్రహపుష్టిగల మనుషులతో, సీనరీ, సెట్టింగు, వైరవర్ణాల ఆర్భాటంతో - నటకుని ప్రాధాన్యం, నాటకప్రయోజనం యిసుమంతైనా గమనించక, ఏనుగుగున్నను రంగస్థలం మీదికితెచ్చిన "కురుక్షేత్రాది" నాటకాలనూ ప్రజలు ఎగబడి చూచారు. అంతకన్నా ఒకేపాత్రకు ముగ్గురూ నలుగురూ నటులసెట్లతో పద్యరాగాల్ని మొగ్గలేయిస్తూ, ఉయ్యాల లూగిస్తూ పాడుతూఉన్న నాటకాల్ని విరగబడిచూచారు; చక్కని వచన నాటకాల్ని (రంగస్థలహంగులున్నా లేక పోయినా) చూస్తున్నారు.

సినీమాల ప్రభావంవల్ల మ్యాటనీ నాటకాలు ఆచరణ లోకి వచ్చాయి. ఇదంత చెప్పుకు గర్వించతగ్గ మార్పుకాదు. రసానుభూతి ప్రేక్షకులకూ అది అందించిన తృప్తి నటకులకూ కూడా ఉండటంలేదీతరహా మ్యాటనీ నాటకప్రదర్శనలలో. కానీ యేంచేస్తాం! తప్పనిసరిగా యీ మ్యాటనీప్రదర్శనలు వేయాల్సిన పరిస్థితులు యేర్పడ్డాయి. నాటకాలు రాత్రిపూట ఆడించుకునేందుకు శాలలు లభ్యం కావటం లేనందున.

నాటకప్రదర్శనలకోసం ప్రత్యేకం శాలలు నిర్మించాలని చాలావూళ్ళలో ప్రయత్నాలు జరుగుతున్నాయి. ప్రస్తుతానికి ఆరుబయలుప్రదర్శనశాలలు చాలావూళ్ళలో యేర్పాటవుతున్నాయి. ఇవి ఔత్సాహిక నాటకసమాజాలకు మంచివే కాని వృత్తిసమాజాలకు అంతగా యుపయోగించవు.

అసమానులైన నటులుండీ యుపయోగించుకోడానికి అనేక హంగులుండీకూడా యీనాటికీ మన ఆంధ్రనాటక రంగం గుంటపూలు పూస్తోంది

మన ఆంధ్రుల ప్రతిభా ఉపజ్ఞా ఊ పొగిడేసుకోవాలని నా అభిమతంకాదు గాని లలితకళలలో మనది యావద్భారతంలోనూ అందెవేసినచెయ్యి. సినీమా రంగంలో మనం చాలా వున్నతస్థాయిలో వున్నాం. మన చిత్రాలు అఖిల భారతచలన చిత్రస్థాయిలో మంచిపేరునే సంపాదించుకుంటున్నాయి. అయితే మనకున్న భావదాస్యం కొంతవరకూ మనల్నింకా వదలలేదు. అలాగని పొరుగువారి మంచిని గ్రహించవద్దని కాదుగాని అలాగ్రహించేటప్పుడు మనలోని మంచిని గర్హించ పాడిగాదని నాచెప్పికోలు.

రాజాశ్రితమైన యీనాటకకళ వ్యాపారదృష్టితో ఒకప్పుడు సాధించబడినప్పటికీ ముందుకు సాగలేదు. రాజులూ జమీందారులూలేని యీరోజుల్లోకూడా యిది కొంత మంది ముఖ్యవ్యక్తులకు ప్రదక్షిణాలు చెయ్యటం మానుకోలేదు. వృత్తినాటకాలకు డబ్బు వచ్చేదీ, రానిదీ ఆఖరు

క్షణంవరకూ యెవరికీ తెలియటంలేదు. ప్రోత్సాహికనాట కాలు కేవలం కాన్వాసింగుమీద ఆధారపడివుంటున్నాయి. "ఫలానాచోట ఫలానా నాటకం ఆడుతున్నారు. మనం త్వరపడకపోతే ప్రవేశం దొరకక ప్రదర్శనచూచే భాగ్యం లభించదు"అని యే ప్రేక్షకుడు అనుకోవటంలేదు. అఖండఖ్యాతి కలదని యెలుగెత్తి చాటుకుంటున్న యీ నాటకకళ మన దేశంలో క్రొత్తరీతుల్ని అనుసరించలేక యింకా "భిక్షాం దేహి" (నాటక కళను ప్రోత్సహించండి) అనే స్థితిలోనే వుంది. ఇప్పటి పరిస్థితుల్నిబట్టి చూస్తే మరో శతాబ్దాని క్కూడా యిది యిలాగేవుండిపోతుందని తోస్తోంది. (ఈలోగా నామరూపాలు అసలే నశించకుండావుంటే).

మనతాతలు చాలా గొప్పవారే. కాదని ఎవరన్నా రంటేగా! వారి గొప్పతనాన్ని చాటడానికి ఏడాదికోసారి వారి పటానికి పూలదండవేసి దణ్ణం పెట్టేస్తే సరిపోదు.

అమరజ్యోతి ఆరిపోతూ దానిస్థానే మరోజ్యోతిని వెలిగిస్తుంది. ఈవెలిగేజ్యోతిని వదిలి ఆరిపోయినదానికోసం యేడాదికోమారు కడివెడుకన్నీళ్ళు (సంస్మరణశ్లోకాలు) ప్రోగుజేసి ఆజ్యోతిమీద దిమ్మరిస్తే ఆజ్యోతి సంతోషించదు. తన అంశప్రకాశిస్తున్నా జీవితజ్యోతి నలుగురికి వెలుగుచూపించటమే అమరజ్యోతి ఆశయం.

పెద్దల సంస్మరణోత్సవాలను నిరసిస్తున్నానని అపోహ పొందవద్దు. సంస్మరణోత్సవాలుచేసేకంటే (ప్రస్తుతంచేస్తున్న

తరహాలో), వారు వారి జీవితంలో సాధించిన దానిని ప్రజలందరికీ, ముఖ్యంగా అభిమానులకి అప్పుడప్పుడు రుచి చూపిస్తూండాలి. కీర్తిశేషులైన ఒక ప్రముఖనటుని వర్ధంత్యుత్సవంలో వారి అభిమానపాత్రకు పోటీ యేర్పాటుచేసి, అనేక యువనటులు యాపాత్రను యెలా ప్రదర్శిస్తున్నారో చూసి ప్రోత్సహించడం ఉభయతారకం కాదూ? ఈసందర్భంలో రామకృష్ణ మఠంవారూ విశాలాంధ్ర ప్రచురణలవారూ ఆయా రంగాలలో ఆదర్శప్రాయులు. వర్ధంత్యుత్సవాలతో సరిపుచ్చుకోక యుగపురుషుల ఆశయాల ప్రచారం నిర్విరామంగా చేస్తున్నారు. ఇలాటివారినిచూచి నాటకరంగపురోహితుల మనుకునేవారు నేర్చుకోవలసింది యెంతైనా వుంది.

అఖిలభారత సంగీత నాటక ఎకాడమీతోపాటు వివిధ రాష్ట్రాలలో దానికి అనుబంధశాఖలు యేర్పాటయినాయి. ఆంధ్రప్రదేశ అవతరణానంతరం ఆంధ్రప్రదేశసంగీత నాటక ఎకాడమీ ఏర్పాటయింది. ఆంధ్రనాటకరంగ పురోభివృద్ధికి తగువిధంగా సేవచెయ్యటం యిందు ప్రవేశ మివ్వబడిన సభ్యుల విధి.

ఆంధ్రదేశంలో ముఖ్యంగా నాటకశాలలులేనంత కాగా పిట్ని నిర్మించడానికి ప్రతిమున్సిపాలిటీ కొన్ని లక్షలుకర్చుపెట్టాలని తీర్మానాలు చేసేస్తే సరిపోదు. ఆచరణయోగ్యమైన విషయాలను ఆలోచించడం యెందుకైనామంచిది. ఎస్టిమేటు

మొత్తం తగ్గించుకని .మనేక చిన్న శాలలు గట్టించి ఒకే నాట కాన్ని వారాలతరబడి ప్రదర్శిస్తూ నాటకరంగాన్ని అభివృద్ధి లోకి తీసుకురాగల పథకం ఆంధ్రాయూనివర్శిటీ రిజిష్ట్రారు శ్రీ కూర్మా వేణుగోపాలస్వామిగారు సూత్రప్రాయంగా సెలవిచ్చారు ఇదిఆచరణయోగ్యమైన పథకంలా కనిపిస్తోంది. ఈ పథకం త్వరలో కార్యరూపంలోకి వస్తుందని ఆశిస్తు న్నాను.

ఆంధ్రనాటక కళాపరిషత్, ఆంధ్రనాటక సంఘ సమాఖ్య థియేటర్ సెంటరువంటి కేంద్రసంస్థలు యికముందు కూడా ద్విగుణీకృతోత్సాహంతో కృషి చేసి మన సంగీత నాటక ఎకాడమీకి తగు సలహా సహకారముల నిస్తాయనీ అవియిచ్చిన మంచిసలహాలను పాక్షికత్వం లేకుండా ఎకాడమీ స్వీకరిస్తుందనీ ఆశిస్తున్నాను.

వివిధనగరాల్లో వివిధసంస్థలు నాటకోత్సవాల నేర్పరచి నాటికా నాటకాలలో పోటీలుజరిపి విజేతలకు బహుమతులు పంచిపెడ్తున్నారు. ఉత్సాహవంతులైన వారు అనేకవ్యయ ప్రయాసలకోర్చి యీపోటీలలోపాల్గొంటున్నారు. ఈపోటీలు వగైరాలు మంచివేకాని వీటికయే వ్యయప్రయాసలతోపోల్చి చూస్తే ఫలితాలు అంతగా చెప్పుకోతగ్గవిగా లేవు. వీటిమీద కూడా మోహం మొత్తేలాగా యీపోటీలను నడిపే తీరు తెన్నులను సమన్వయం చేసుకుంటూ యివి నిర్వహిస్తున్న వివిధసంస్థలూ ఒక ధోరణకు రావడం వాంఛనీయం.

# నాటకశిల్పం

ఆంధ్రనాటక రంగపురోభివృద్ధి నాకాంక్షిస్తూ
మంది కళాకారులూ అభిమానులూకూడా తహతహల
న్నారు. వీరంతా తమతమ ఊహల్ని (ఆచరణీయమై
కలబోసుకొని పథకాలేర్పర్చుకొని తగుకృషిచేస్తే నాట
గంలో వీరాధివీరులున్న మన తెలుగుదేశం యీకళ
యెవరికీ తీసిపోదని అనతికాలంలోనే నిరూపించుకుంటుంది

మన నాటకరంగం పురోభివృద్ధికోరి అనేకవ
తమకు తోచినరీతి సేవచేస్తున్నారు. ఆంధ్రనాటకస
సమాఖ్యవారు పాఠశాలలు నిర్వహిస్తున్నారు. థియే
సెంటరువారు త్రైమాసిక పత్రిక 'నాట్యకళ' ను ప్రచు
న్నారు. తెలుగు పత్రికలన్నీ నాటక కళాభివృద్ధికి యితో
ప్రోత్సాహమిస్తున్నాయి. అభిమానులు ఔత్సాహిక ప్ర
నలను ప్రోత్సహిస్తున్నారు. కొన్ని చెడుశక్తులు యెక్క
వుంటాయి. ఇవి వెనక్కి లాగుతూంటాయి. వీట్ని ప్ర
టించి కార్యక్రమాన్ని జయప్రదంగా ముందుకు సాగిం-
పోతూ ఆంధ్రనాటకరంగ స్వర్ణయుగానికి పునాదుల
వేద్దాం.

---

# నాటక శిల్పం

## II నటుడు

జీవితనాటకంలో ప్రతివ్యక్తీ నటుడే. నీవు నాటకంలో నటించడానికి పనికిరావని అనుకోవద్దు. తప్పక పనికివస్తావు! అయితే అద్దంలో ముఖంచూచుకుంటున్నప్పుడు నీవు కొన్ని చిలిపిచేష్టలు చేస్తావు; కళ్ళుచికిలిస్తావు, నాలికబైట పెడ్తావు. ఆ కనుబొమక్రిందికీ, యీ బొమపైకీ, మారుస్తావు. అద్దంలో చూస్తున్నాననుకుంటున్న జ్ఞానం నీలో యిలాంటి వికృతచేష్టల్ని రేకెత్తిస్తుంది.

అలాగే రంగస్థలంమీదికి పోగానే అదేదో అలాచేస్తేగానీ బాగుండదని కొన్ని వికారమైన అంగవిన్యాసాలూ తడబడే మాటలూ అనవసరంగా అర్థంలేని మాడ్యులేషనుతో కొన్ని వాక్యాలూ నీకు తెలిసో తెలియకో బైటపడ్తాయి. ఇవి కట్టడిచేసుకుంటే నీవూ మంచి నటుడివికాగలవు

క్రొత్తగా సేనలో చేరిన 'రిక్రూట్' కవాతులో కుడికాలూ, కుడిచెయ్యీ ఒకేమారు ముందుకుచాపుతాడు! కవాతుమీద యిదివరకే అతడికో అభిప్రాయం యేర్పడిపోయి అతడిలాచేస్తాడు. కానీ నిజానికి కవాతులోకూడా మామూలుగా మనం నడుస్తున్నమాదిరే కుడికాలూ దానితోపాటు

యెడమచెయ్యి ముందుకు వూపాలి. అయితే యీ ఊపటం అనేది కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. ఇది క్రొత్తరిక్రూటుకు మరో విధమైన (అపోహ) వూహకలిగించి తప్పుడు అడుగు వేయిస్తుంది.

రంగస్థలనటనకూడా ఇంతే.

నటుడు కూడా జీవితంలో చేసినట్టుగానే నటిస్తాడు రంగస్థలంమీదకూడా. అయితే జీవితనటన మరొకరికి ప్రదర్శించాలని చేసేదికాదు. కాగా నాటకనటన మరొకళ్ళకి ప్రదర్శించాలని చేసేది. అంచేత అందులో కొంత 'మార్క్‌డ్ నెస్' వుంటుంది. దానికి అపోహపడిన క్రొత్తనటుడు వికృతమైన అంగవిన్యాసాలు వగైరా చేస్తాడు. అవికూడదు. నీవు నటుడవటానికి యిది మూలసూత్రం మూలసూత్రాలు తెలుసుకున్నంతమాత్రాన నీవు నటుడవు కాలేవు. (పద్యాలల్లే నిబంధనలు తెలుసుకున్నంతమాత్రాన కవివి కాలేనట్లే) నీవో నటుడుగా చలామణీ అవటానికి నీలో ముందు దృఢమైనకోరిక వుండాలి చాల కృషి కావాలి. ఇంచుమించు తపస్సు చేయాలి.

సుప్రసిద్ధ నటుడు శ్రీ యస్. వి. రంగారావు తన పూర్వానుభవాల్ని మననం చేసుకుంటూ యీవిధంగా చెప్పారు.

"నాజీవితంలో ప్రథమంగా 15వ యేట రంగస్థలం ప్రవేశించాను. నేనుకూడా మరువరాని నానాడు ఏదో చైతన్యాన్ని

నాలో వెలిగించి నేను మీాముందు నన్నొక నటునిగా నిల బెట్టింది. ఆనాటి సన్నివేశమే!"

ఏమిటాసన్నివేశం?—

"మావాళ్ళకు తెలియకుండా స్టేజీ యెక్కాను. అది కూడా ఒక మాంత్రికుని అసిస్టెంటుగా-ఇదే నాజీవితంలో నా ప్రథమానుభూతి. నా నటన చూచి నన్ను నలుగురూ మెచ్చు కున్నారు.

మా హెడ్మాష్టారు "శెభాష్" అని వెన్నుతట్టారు. ఆ దెబ్బతో ఆరాత్రి నాకు నిద్రపట్టితే ఒట్టు. తియ్యనికలలు యెన్నోవచ్చి-మధ్యమధ్య తేలిపోతూవుండేవి లేచికూచున్నా. ఒక్కసారి నా నటనాన్నైపుణ్యాన్ని సింహావలోకన చేసుకున్నా, అన్నీ తప్పులే అనిపించింది. అన్నితప్పులుండీకూడా అంత మంది మెచ్చుకున్నప్పుడు యేతప్పులూ లేకుండానటించగలిగితే నాజీవితం యెంతధన్యత చెందేదో అని యనుకునేసరికి నాలో ఒక ఆత్మవిశ్వాసం ఒక తొలకరిమెరుపులా మెరిసింది "అంతే- ఆరోజునే నిశ్చయించుకొన్నాను-నాజీవితంలో యేనాటికైనా ఒక ఉత్తమనటుడ ననిపించుకోవాలని." ఇదీ తపస్సంకల్పమ్. తపస్సంటే నిష్ఠతో నటులకు కావలసిన శిక్షణపొంది తను తీసు కున్న పాత్రలను ఆమూలాగ్రంగా పరిశీలించి సాధనచేయటం.

ప్రతి వ్యక్తీ నటుడు అవగలడా?

ఉత్సాహంవుండి తగు కృషిచేస్తే తప్పక అవుతాడు. అతను (లేక ఆమె) పరిస్థితులను సరిగా అర్థంచేసుకోవాలి.

తనకు తగుపాత్రలనే యెన్నుకోవాలి. తనకు అనుభవం లేనప్పుడు అనుభవజ్ఞులు చెప్పినవిధంగా ఒప్పుకోవాలి.

ఐదడుగులలోపువుండి, గాలికి ఎగిరిపోయే అంగసౌష్ఠవంతో, కీచుగొంతుగల ఆసామీ "హిడింబికళ్యాణం!" నాటకంలో కథానాయకుడుకదా అని "భీమ పాత్రకు" సిద్ధం అవకూడదు. తనకుతగ్గ పాత్ర లేకపోతే తప్పుకోవాలి. పలుకుబడి వుందికదాయని లేనిపోనివి, తలకుమించినపాత్రలు నెత్తివేసుకోకూడదు. తీసుకున్న పాత్రను క్షుణ్ణంగా అర్థంచేసుకోవాలి. జీవితంలో మనం నాటకంలో ధరించబోయే పాత్రలాటి వ్యక్తులున్నప్పుడు, వాళ్ళని చాలా జాగ్రత్తగా గమనించాలి. వారి వేషభాషలు ప్రత్యేకతలు తట్టుబట్టాలి. ఇప్పుడు మన నాటకరంగచరిత్రలో (సినిమాకూడా కలుపుకుని) జరుగుతున్న ముఖ్యతప్పిదం పాత్రలకు సరిపడని వ్యక్తులఎన్నికే! అదేమంటే స్టార్ వాల్యూ!

ఇక నటులు—"ఒప్పించామా? లేదా? అంటారు."

కొన్నికొన్ని విపరీత సందర్భాలవల్ల పాత్రకు సరిపోకపోయిన ఆయాపాత్రలు ధరించి ఒకరకం ప్రేక్షకుల మన్ననలకు పాత్రులౌతున్నారు. అంతమాత్రంచేత అదంతా 'మన ప్రతిభే' అనుకునిపొంగి తేలాభం లేదు. ఆపాత్రకు అన్నివిధాలా సరిపోయి మీకన్నా మరోమోతాదు ఎక్కువ భావప్రకటన చేయగల మరోవ్యక్తి ఆపాత్రకు కుదురుకుంటే మీరు సోది

లోకి వుండరు. (ఈనాటి పత్యేర పరిస్థితి ఔత్సాహిక నటులకన్నా వృత్తినటులకు మరీ గొడ్డలిపెట్టు!)

వృత్తి నటునికన్నా ఔత్సాహిక నటునకు చాలా వీళ్ళున్నాయి. వృత్తినటుడు తన పాత్ర సరిగా నటించకపోతే కూటికీగుడ్డకూ లేకుండా అఘోరించాలి! కాగా ఔత్సాహిక నటునకు యీబాధ లేదు. అతడికి కూడూగుడ్డా సంపాదించి పెట్టేవృత్తి వేరేవుంటుంది. అతనికి నటన కేవలం అభిమాన వృత్తిమాత్రమే! అయితే మంచివృత్తినటుడు తన పాత్రమీద కేంద్రీకరించినట్లు ఔత్సాహిక నటుడు చెయ్యలేడు. అలాగని మంచివృత్తి నటుడికి మంచిఔత్సాహిక నటుడు తీసిపోతాడని కాదు. కాని వారివారి తేడా రంగస్థలంమీద చెప్పకనే చెబుతుంది.

"ఇంకేం తగుపాత్రలు లభ్యమైతే నాటకాలు వెయ్యటానికి అందరికీ హక్కున్నదనేకదా మీారనేది?" అని తొందరపడకండి "ఏం యెందుకుండకూడదూ?" అనే విషయం అలావుంచండి!

మొదట్లో నే మనవి చేసినట్లు నాటకీయ నటనస్వాభావిక అస్వాభావి కాలకలయిక అవి తగుమోతాదులో కలవాలి. కలిసినట్లు దొరికిపోకూడదు. వీటన్నింటికంటె ముఖ్యమైంది "స్టేజిఫియరు". ఇది ప్రతిఔత్సాహిక నటునకూ భూతంలాంటిది. చాలా ప్రదర్శనలిచ్చివున్న నటునినుకూడా యీభూతం అప్పుడప్పుడు బాధించటం మానుకోదు. ఈభూతాన్ని చాలా వరకు మనోనిబ్బరంతో యెదుర్కోవాలి.

అసలీ స్టేజి ఫియరు ఎందుకు పట్టుకుంటుంది? కొంతవరకూ తను ఇంతమందియెదుట నిలబడగలిగి ఏం చెయ్యగలనా అనే Inferiority Complex ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సువల్ల స్టేజి ఫియరు ప్రారంభం అవుతుంది. దీనికితోడు ఏదో కారణంచేత ప్రేక్షకులలో కలిగిన గగ్గోలుకంపస్వోవాల్నెక్కువచేసి ఒక్కొక్కప్పుడు రంగస్థలంమీాన్నించి పంపించేటంత పనిచేస్తుంది. రంగంమధ్యలో తెరదింపాల్సిన పరిస్థితులు కూడా అప్పుడప్పుడు తటస్థపడ్తాయి.

పెద్ద పెద్ద నటులప్రక్కన నటించేటప్పుడు కూడా యీా స్టేజి ఫియరు బాధించడం కద్దు. అంచాత ఆత్మవిశ్వాసం అనేది ఒకటి ప్రతినటుడూ ముందుగా అలవర్చుకోవాలి. సాధన చేసేంతవరకే అదేమిటీ యిదేమిటీ అనే జిజ్ఞాస, భయము, భక్తి, ప్రదర్శన సమయంలో యిక యీా సందిగ్ధాలకు తావీయకూడదు. తప్పో, ఒప్పో తను చేసేవి బ్రహ్మాండంగా వుందన్న ధైర్యం కలవార్ని స్టేజిఫియరు యేమిాా చేయ్యలేదు.

"ఒక వ్యక్తి యిద్దరుముగ్గురున్నప్పుడు యేమాత్రమూా భయం లేకుండా నటిస్తాడు. తీరా రిహార్సల్సు అనంగానే భయపడి లేనిపోని వికృతాలు చేస్తాడు. మరోడు రిహార్సల్సు వరకూ బాగానే చేస్తాడు, కానీ ప్రదర్శనలో జారిపోతాడు. దీని కేం కారణం?" అని కొందరు విద్యార్థులు నన్ను ప్రశ్నించారు. పైచెప్పినదే కారణం. పదిమందీ తనుచేసేది

అసహ్యంగా వుందని యెద్దేవ చేస్తారేమోననే భయం ముందు గానే పీడిస్తోందన్నమాట. ఇది పోవాలంటే తను అత్యద్భుతంగానటిస్తున్నాననే ధైర్యం అతనికి కలిగేలా మిత్రులంతా కృషి చేయాలి. ఎంతకృషి చేసినా అతనలాగే ప్రవర్తిస్తుంటే యిక వదలి వేయాలి.

సాధారణంగా స్టేజిఫియరుండనుకునేవాళ్ళు మొదట మొదట చిన్న పాత్రలు (అసలు సంభాషణ లేనివైతే మరీ మంచిది) యెన్నుకోవాలి. రంగస్థలంమీద నటించేటప్పుడు, ముఖ్యంగా సంభాషణలు చెప్పేటప్పుడు ప్రేక్షకులను చూడకపోవటం తను తన పాత్రను జాగ్రత్తగా, జనరంజకంగా నిర్వహిస్తున్నాననే మనోధైర్యము కూడా కొంతవరకూ స్టేజిఫియరు పోగొట్టడానికి ఉపయోగపడతాయి.

ఇన్ని చేసినా యీ స్టేజిఫియరు పోనివారు యిక నటనావకాశాన్ని వదులుకోవలసిందే. కొందరికి రంగస్థలం ప్రవేశించేదాకా భయం వుంటుంది. ప్రవేశించాక పీడపరిహారం చేస్తారు. మరికొందరు తెరవెనుక రిహార్సల్సు వగైరాలలో అత్యద్భుతంగా నటిస్తారు. రంగస్థలం మీద కాళ్ళూ కళ్ళూ తేలేస్తారు. మావాడొకడికి రంగువెయ్యంగానే కంఠంపోయేది. దీనికి మందేమిటా అని తెగ ఆలోచించాం మెడ భాగానికి రేకు వేసుకోకుండా పౌడరుమటుకు వేసుకోమని సలహా యిచ్చాను. కానీ అదికూడా అంతగా ఫలించినట్టు కనపడలేదు. ఆఖరికి విపరీతంగా మంచినీళ్ళు త్రాగమన్నాను.

అది ఫలితం ఇచ్చింది. రంగువెయ్యంగానే గొంతుకాస్త పోవడం ప్రారంభించేదన్నమాట. కంగారులో ఇది గ్రహించాడు కాదు. ఏదో సందర్భంలో నాకూ ఇలాంటిదే తటస్థపడి మంచినీళ్ళు త్రాగగా సర్దుకుంది ప్రదర్శన సమయంలో సుభ్రమైన చల్లని మంచినీళ్ళు ధారాళంగా త్రాగటం మంచిది.

నటుడు కాతగ్గవాడికి ముఖ్యంగా కావలసిన లక్షణాలు కొన్ని వున్నాయి. ఇవి నాట్యశాస్త్రం, అభినయ దర్పణాది ఉద్గ్రంథాలలో విపులంగా ప్రాపంచబద్ధాయి. కాగా "ఈడుపుగాళ్ళ నడక, ముద్దమాట, అందంలేని ముఖము కలిగి కూడా నేనూ గొప్ప నటుణ్నే అనిపించుకుంటున్నా" నని ఓ మహా ప్రతిభావంతుడైన నటుడు అన్నాడు. నిజమే ఆయన కున్న ఆ లోపాలన్నింటితోనూ ఆయన గొప్పనటుడుగా చలామణీ కాగలిగాడంటే ఆయనలో ఏదో మహత్తర శక్తివిశేష మైన ప్రజ్ఞా వుండివుండాలి. ఈలోపాల్నే ఆయన లాభాలుగా వినియోగించుకున్నా డన్నమాట. ఈ లోపాలు ప్రత్యేక 'మానరిజమ్స్' క్రింద మార్చి వాటినుంచి పొందగలిగినంత లాభం పొందాడన్నమాట. ఐతే యిది అందరి విషయం లోనూ వర్తించదు ఈ మాదిరిగా చలామణీ కావడానికి పెట్టి పుట్టాలి. అదిన్నీ కాకుండా కొన్నికొన్ని ప్రత్యేక పరిస్థితుల ప్రభావం కూడా ఒకొక్కప్పుడు యిలాంటివారి కీర్తికి దోహదకారి అవుతూ వుంటుంది. (ఉదా :— మీసాల

కృష్ణుడు, గద్దాల మీరాబాయి) అంతమాత్రంచేత పొట్ట కాలువాళ్లు, ముద్ద, నం., నత్తిమాటల వాళ్ళూ, జిప్సీ, ఓరాంగుటాంగుల అందం గలవాళ్ళూ 'నలుని' వేషం వేసి మెప్పించగల మనుకోడం పొరబాటు. పోతే వాళ్ళకు తగ్గ వేషాలు వాళ్ళు వేస్తారనేది వేరే విషయం. కుంటి వేషానికి గుడ్డివేషానికి కుంటి, గుడ్డి మనుషులే అక్కరలేదు. నవమన్మ థుడు 'నలుని' వేషమూ "బాహుకుని" వేషమూ కూడా వేసి మెప్పించగలడు.

అయితే అంతా వంక లేని నవమన్మథులుండరు. నాట్య శాస్త్రాలలోని లక్షణాలూ అవయవ కొలతలూ గలవారు యీరోజుల్లో యెక్కడా వుండరు. ఏదోఓలోపం ప్రతిమనిషి శరీరంలోనూ వుంటితీరుతుంది ఆజాను బాహువుకి యేనుగకళ్ళు. ఆరడుగుల మనిషికి నడుందిగని చేతులు. నవకోమలమైన ముఖం, చక్కని కన్నులూ, ముక్కూ వున్నవానికి జానెడు పొట్టా యిలాగే సంపూర్ణ నాయక లక్షణాలు యే ఒక్క మనిషిలోనూ చూడం. స్వల్పలోపాల్ని మరుగుపరచేలా నటించ గలవాడు ఉత్తమ నటుడనిపించుకుంటాడు.

నటుడు అన్నవాడు విధిగా పాడగలవాడే అయివుండ నక్కరలేదు. కాని గంభీరమూ మార్దవమూ అయి విన సొంపైన కంఠస్వరం కలిగివుండాలి. అతడు పండితుడే కానక్కరలేదు. కాని సుస్పష్టమైన వాచికం చెప్పగలవాడై వుండాలి. పెద్ద సాహిత్యవేత్త కానక్కరలేదు. కాని సమ

యోచిత సంభాషణలు చెప్పగలిగిన చాకచక్యమూ, పాత్రను క్షుణ్ణంగా అర్థం చేసుకోగల పరిజ్ఞానమూ వుండాలి. చూడ చక్కని రూపురేఖలు అందమైన పొందికైన అంగసౌష్టవమూ ధీరోదాత్త పాత్రలు ధరించేవారికి ఉండితీరాలి.

నటుడు తన శరీరాన్ని జాగ్రత్తగా కాపాడుకోవాలి. శరీరసౌష్టవం విషయంలో క్రీడలలో పాల్గొనే వారికన్నా యెక్కువ జాగ్రత్తతీసుకోవాలి. లేకుంటే తను నటించే సుదీర్ఘ పాత్రలో రానురాను నిలబడలేని స్థితికి రావచ్చును. నీరసం అన్ని రసాలను మింగివేస్తుంది. అంచేత శరీర దారుఢ్యం నటుడికి చాలా అవసరం.

శరీర వ్యాయామంతో బాటు నటుడు మానసిక వ్యాయామంకూడా చేయాలి. మంచి ధారణశక్తి సమయస్ఫూర్తి అలవరచుకోవాలి. వివిధ విషయాలలో పాండిత్యం లేకపోయినా జ్ఞానం ఆర్జించాలి. మిత్రుల్ని అడిగి తన శరీరంలో అంగవిన్యాసంలో యితర విషయాలలో గల లోటు పాట్లు తెలుసుకొని సాధ్యమయినంతవరకూ అవి సవరించుకోవాలి.

ఆహార్యం అందంగా కనిపించటానికి శరీరసౌష్ఠవం, వాచికం చక్కగా వినిపించడానికి గంభీరమైన కమ్మనిగొంతు, సాత్వికం గొప్పగా అభినయించడానికి యేకాగ్రత నటునకు చాలా అవుసరం.

ఉన్న శరీరసౌష్ఠవాన్ని జాగ్రత్తగా కాపాడుకోడానికి తగు వ్యాయామం నీతినియమాలు అవసరం. గొంతు (స్వర పేటిక) అదుపులో వుండటానికి ప్రత్యేక వ్యాయామం అవసరం. సంగీతసాధన మంచిది. ఏకాగ్రత సాధించటానికి మానసిక వ్యాయామం అవసరం. రోజూ కొంతకాలం యిష్టదైవతాన్ని గాని లేక గోడమీద పెట్టిన యొక చుక్కనుగాని తదేకంగా చూడటంవల్ల యేకాగ్రతసిద్ధిస్తుంది. ఈసిద్ధికలిగాక యెప్పుడే రసం కావాలంటే అప్పుడది యుద్భవింపచేయగలశక్తి వస్తుంది. ఈసిద్ధి(ఏకాగ్రత) కలవానికి 'మూడ్'లోకి వెళ్ళటానికిగంటల తరబడి కాసుక్కూచోవలసిన అవసరంకలుగదు. ఏకాగ్రత సాధించినవారు నటనలో నేగాక నిత్యజీవితంలోకూడా అన్య యానందాన్ని యనుభవించగలుగుతారు.

నటుని శరీరం పాత్రపోషణకి ముఖ్యాంగం. అయితేఅన్ని అవయవాలలోకి భావప్రకటనకు అనువైనది తల (లేక ముఖం) నాట్యశాస్త్రకారులు చేతులు ముద్రలకీ కాళ్ళు (పాదాలు) తాళానికీఉపయోగించమన్నారు. ఈసూచన ఒక్క నాట్యానికే అన్న యపోహ పనికిరాదు. నాటకాభినయంలోకూడా మనకి తెలిసినా తెలియకపోయినా యీకాళ్లు చేతులు అందుకే వుప యోగపడ్తాయి. అంచాత ఆశాస్త్రాన్ని తెలుసుకోడం మంచిది. ఇక భావప్రకటనకు ముఖం. ఇందులోనూ కళ్ళు అతిముఖ్యం. అయితే యీ ముఖ్యభాగాన్ని మన నటులు చాలామంది పూర్తిగా విస్మరించారు. ముఖ్యంగా పాటలూ పద్యాలూ పాడే

టప్పుడు వీళ్ళముఖాలు చూడలేము. నటుడిలో యితరలోపాలు యెన్నివున్నా 'ముఖం' సుస్పష్టంగా భావప్రకటన చెయ్యగలిగితే అతడు ఉత్తముడే. ఔత్సాహిక నటుడుకూడా తలను చాలా అశ్రద్ధచేస్తున్నారు. పోర్షన్లు కంఠస్తంచేసి రంగస్థలంమీద వప్పచెప్పే ఉత్సాహంలో వీరు పాత్రలో లీనంకాకుండా (అభావ) ముఖాలు పెట్టేస్తున్నారు. ముఖ్యంగా వీరు యీవిష యంలో కొన్ని ఘోరతప్పిదాలు చేస్తూంటారు. Stage fear వల్ల నైతేనేం Natural effect కోసం అనే అపోహావల్ల నైతేనేం వీరు ముఖం ప్రేక్షకలోకంవైపు తిప్పరు. పక్క చూపులో నేలచూపులో చూస్తూంటారు. రంగంమీద నటి స్తున్నంతసేపు ముఖం ప్రేక్షకులందరికీ కనపడే యాంగిల్‌లో పెట్టివుంచాలి.

స్టేజిభియరును అరికట్టడానికి ప్రేక్షకులవైపు చూడద్దని లోగడ వ్రాశాను. ఇప్పుడు ప్రేక్షకులవైపుకు ముఖంపెట్టమని వ్రాయటం పరస్పరవిరుద్ధం అని భావించకండి. ప్రేక్షకలోకం వైపు ముఖంపెట్టండి అంతేగాని వార్ని చూడవద్దు. చూడకూ డదుకూడాను. ప్రేక్షకులను చూస్తూ భావప్రకటన యెలా చేయ గలరు? ప్రేక్షకులవైపు ముఖంవుంచి సూన్యంలోకి చూస్తూ న్నప్పుడే మీభావప్రకటన రాణిస్తుంది. పేక్షకులను చూస్తూ నటిస్తే వారిని మీరుచూస్తున్నభావమే వ్యక్తమవుతుంది.

మీరు చెప్పబోయే సంభాషణలు వినే మీ ప్రక్క పాత్ర ప్రేక్షకులలో వున్నట్టు వూహించుకోండి. అంతేగాని

ఆపాత్రకోసం ప్రేక్షకులలో వెతక్కండి వెతికి కళ్ళతో పట్టుకో కండి.

ఇలా ప్రేక్షకులవైపు ముఖంవుంచి చేసే నటన స్వాభావ విరుద్ధం అనే అపోహ కొంతమంది వ్యక్తంచేయటం విన్నాను. "ప్రక్కమనిషి (పాత్ర)తో సంభాషణ చెబుతూ మరో (ప్రేక్షకుల) వేపు చూడటమేమిటి? అని వీరి వాదన. ఈ వాదన ఎంత పెద్దలు లేవదీసినదైనా తెలివితక్కువవాదన యని చెప్ప డానికి నే నే మాత్రమూ భయపడను.

మీరు నాటకం ప్రదర్శిస్తున్నారు. ఎవరికి? ప్రేక్షకులకు. నాటకానికి ముఖ్యం మీరూ మీరూ మాట్లాడుకోడం కాదు. నాటక ప్రయోజనం ప్రేక్షకులకు ప్రదర్శించడం. ప్రేక్షకులు మీపాత్ర ప్రక్కపాత్రతో సంభాషిస్తోందని అనుకుంటున్నారు; అంతేగాని మీరు మీసంభాషణ ప్రేక్షకులకోసమే చెబుతు న్నారు. వారి ఆనందాన్నే మీరు ఆకాంక్షిస్తున్నారు. ఇది కాదనగలరా?

అటువంటప్పుడు మీభావప్రకటనంతా ప్రక్కపాత్ర చూసి ప్రేక్షకులకు అవకాశం లేకపోవటం నాటక ప్రయోజ నానికే విరుద్ధంకాదా?

మనం సామాన్యంగాకూడా ప్రక్కవారితో మాట్లాడే టప్పుడు యెప్పుడూ వాళ్ళముఖమే చూస్తూ మాట్లాడం. అప్పు డప్పుడు చూస్తూ ప్రక్కకుతిరిగే మాట్లాడ్తాం.

ప్రేక్షకులవేపు విధిగా తలతిప్పి మాట్లాడడానికి మరో 'సాంకేతిక' కారణంకూడా వుంది. ప్రక్కకు తలతిప్పి చెప్పే వాచికం ప్రేక్షకలోకాన్ని (ఆడిటోరియం) సగంధ్వనితో మాత్రమే ప్రకాశిస్తుంది. వెనక్కుతిరిగి చెప్పేమాటలు అసలు వినిపించవు.

ఇప్పుడు రంగస్థలంమీద దూరశ్రవణ యంత్రాలు అమరుస్తున్నారు అసలే అగమ్యగోచరంగా (ప్రక్కపాత్ర లను చూడాలా, ప్రేక్షకులను చూడాలా) కొట్టుమిట్టాడు తున్న నటులకు—ప్రేక్షకులకూ, ప్రక్కపాత్రలకూమధ్యగా ఈమైక్ ఒకటి కూర్చుంది.

ప్రక్కపాత్ర, మైక్, ప్రేక్షకులలో ఎవరివైపు తల త్రిప్పి మాట్లాడాలా అని తబ్బిబ్బయిపోతున్నారు నేటినటులు. అయితే కాస్త అనుభవం సంపాదిస్తే ఎబ్బెట్టుగా కనిపించ నీయకుండా ప్రేక్షకులకు భావప్రకటనా, మైకుకు మాటలూ (ధ్వని) ప్రక్కపాత్రతోమాట్లాడుతున్నాడనే భ్రమా తేలికగా కలిగించవచ్చు. వచ్చే చిక్కల్లా—ఏదోచేద్దామనుకుని మర్చి పోయి గబుక్కున మరొకటి చెయ్యటంతోటే వస్తుంది.

ఇక మిగిలిన అవయవాలను ఉపయోగించుకోడం : క్రొత్తగా రంగస్థలంమీదకు వచ్చిన నటునకు చేతిలో పెద్ద తంటా. ఈ చేతులలో మహామహాఅనుభవశాలురే చిక్కన పడ్తాంటారు. అవి ఎక్కడపెట్టినా ఎలాపెట్టినా అసహ్యంగా కనిపిస్తాయి. తరుచు పోకూడనిచోట్లకి పోతాయి! ఈలోపా

లను నటుడు ఫీలవుతూనే ఉంటాడు. కానీ మార్గాంతరం తోచక అలా చేతుల్ని అసహ్యాకరంగా పెడ్తూనేవుంటాడు. పాత్రలో లీనమైతే, కొంత అనుభవంతో చేతులు వాటంతట అవే తమ స్థానాన్ని చూచుకుంటాయి. ఈ సూక్తితతిమ్మా మువ్‌మెంట్సుకు పోజులకు గెశ్చర్లకు కూడా వర్తిస్తుంది.

ఇక మిగిలిపోయినదీ ముఖ్యమైనదీ నటునిగొంతు. ఇది అసహ్యంగా కీచుగా వుండకూడదు. మాట అందరికీ విని పించేలా ప్రస్ఫుటమైనధ్వని కలిగివుండాలి. శృతిలయబద్ధంగా కంఠం ఉండటానికితగు ప్రాక్టీసుచేయాలి.

దూరశ్రవణయంత్రాలు వాడ్తున్న ఈ రోజులలో నటుని గొంతుయొక్క-ధ్వని ప్రాముఖ్యం తగ్గిపోయిందనేవాదన లేకపోలేదు. ఎన్ని ఇతర హంగులున్నా నటునికి స్వాభావసిద్ధ మైన గంభీరధ్వనికి సరిపోవు. ఇలాటి హంగులన్నీ ప్రదర్శనకు మెరుగులుదిద్దటానికి వుపయోగిస్తాయి. అసలు సత్తాలేకపోతే ఈమెరుగులేమీ పనిచెయ్యవు.

ప్రాతపద్ధతుల్నీ, ప్రాతనాటకాలనీ మనం యెంతకా దన్నా వాటి విశిష్టత వాటికుంది. ప్రాతనాటకాల్లోని కొన్ని కొన్ని పాత్రల స్వగతాల్ని ఉదా : హరిశ్చంద్ర నాటకంలో 'వల్లకాటిసీను, ప్రతాప రుద్రీయ నాటకంలో 'పిచ్చివాడి' పాత్ర చిత్రనళీయంలో 'బాహుకుని' స్వగతం, చంద్రహాసలో 'దుష్టబుద్ధి (కుంభీనసుని)' స్వగతం, చంద్రగుప్తలోచాణక్యుని స్వగతం వగయిరా కంఠస్థంచేసి పెద్దలయెదుట అభినయించ

టం చాలా మంచిది. అలాగని వీట్ని మీరు రంగస్థలం మీద ప్రదర్శించడానికి ప్రయత్నం చేయనక్కరలేదు. మీ సమాజ సభ్యుల్ని మరో పదిమందివిజ్ఞుల్ని ఆహ్వానించి ప్రదర్శిస్తేచాలు. ఈతరహా శిక్షణ మిమ్మల్ని మంచినటుడుగా మలచడానికి బాగా వుపయోగిస్తుంది.

ఇక 'కన్యాశుల్కం నాటకం' ఔత్సాహికులపాలిటి కాదంబరి. ఈనాటకంఅంతా ప్రదర్శనయోగ్యంగా కంఠస్థం చేయగలిగితే మీరు నాటకకళలో 'నిధి' అని చెప్పుకోవచ్చు అథవా అందులోని కొన్నికొన్ని పాత్రలన్నా నేర్చుకుతీరాలి. ఇలాంటి నాటకమే "ప్రతాపరుద్రీయం" (మహామహోపాధ్యాయ కీ॥ శే॥ బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రి రచన) నాటకం కూడాను. అసలు ఈరెండే చెప్పుకోతగ్గ తెలుగునాటకాలని పెద్దలంటూంటారు. ఇది అతిశయోక్తి కాదు.

నటుడు ముఖ్యంగా జ్ఞాపకం ఉంచుకోవలసింది నాటకంలో వివిధపాత్రలుంటాయనీ, నాటకప్రదర్శన బాగుండటానికి తనతోబాటు అవన్నీకూడా బాగుండాలనీను తను యెంతప్రజ్ఞాశాలియైనా "తదితరులు" సరైనవారు కాకపోతే ప్రదర్శనరక్తి కట్టదు. తనమటుకు తన రాణింపుచూసుకునే వాడు తాత్కాలికంగా మంచి నటుడనిపించుకున్నా కొద్ది రోజులకే పెద్దదెబ్బతినేస్తాడు. నాటకంఅంటేనే పదిమందితో పని. ఆ పదిమందినీ సరైనవాళ్ళని ఎన్నుకొని వారితో కలిసి కట్టుగా ప్రవర్తించగలవాడే అసలైన నటుడు.

---

# నాటకశిల్పం



## III నాటకసమాజస్థాపన - నిర్వహణ

నాటకం ప్రదర్శించాలన్న సరదా, నాటకంలో వేషం వేయ్యాలన్న సరదా అందరికీ వుండవచ్చు. మొదటిసరదా తీర్చుకోటం కొంతవరకూ తేలికే కాని రెండో సరదామటుకు అంత తేలికగా తీర్చుకోలేరు. నాటకంలో వేషం వెయ్యాలీ అంటే ఉత్త నటుడైనంతమాత్రాన సరిపోదు. సంఘీభావమూ సహాకారము కలిగివుండాలి.

ఎంత గొప్పగా నటించశక్తిగలవాడైనా ఒక సమాజాన్నంటూ ఆశ్రయించకపోతే అసలు నాటక ప్రదర్శనే జరుగదుకదా!

అందుచేత నటునిగా (వృత్తికిగాని ఔత్సాహికముగా గాని) రాణించదల్చుకన్నవారు ఒకసమాజాన్ని ఆశ్రయించి తీరాలి ఏదోఒక సమాజంలో ప్రవేశం సంపాదించటం తేలికే కాని ఆ సమాజవిధులను అనుసరిస్తూ చక్కని ఆ దర్శప్రదర్శనలను యేర్పాటుచేయటంలో భాగస్వామికావటం కొంచెం కష్టమైన పని.

"ఇల్లుకట్టిచూడు పెళ్ళిచేసిచూడు" అనే సామెతకు నాటకసమాజ నిర్వహణలో తలదూర్చినవారు "నాటకం వేసిచూడు" అని కూడా చేరుస్తూంటారు. కొన్ని పనులు డబ్బుఖర్చుచేయటంవల్లా మరికొన్ని పనులు శ్రమపడటంవల్లా దిగ్విజయంగా చెయ్యవచ్చుకానీ ఇల్లుకట్టడానికీ (లేక కట్టించడానికి) పెళ్ళిచేయుడానికి, నాటకం ఆడించడానికీ ఒక వ్యక్తి కేవలం ధనవ్యయంతోగాని శరీరశ్రమతోగాని అనుకున్న ఫలితాలు సాధించలేడు. వీటికి ధనవ్యయమూ శరీరశ్రమలతోబాటు అనేకమంది సుహృద్భావ సహకారాలు అవుసరమవుతాయి.

నాటక ప్రదర్శనకు అనేకమంది సహకారం కావాలి. కేవలం ఆ నాటకప్రదర్శనలో పాల్గొనేనటుల కట్టుబాటు వగైరాలేకాక ఇతర శాఖల అనగా సంగీతవాయిద్యాలు, లైట్లు, రంగాలంకరణ మొదలగు అనేక యితరపనులచేసే వారి సహకారంకూడా కావాలి. ఇంతేకాదు వీరంతాకలసి కట్టుగాపనిచేసి యిచ్చిన ఒకప్రదర్శననుచూచి మెచ్చుకోగల ప్రేక్షకవర్గం దొరికటంకూడా అవుసరమే!

ఇన్ని కారణాలచేత నాటకప్రదర్శన యేర్పాటు చేయుడమనేది మాటలతో అయేపనికాదు. ఇది ఒక్కనటుని వల్ల అయేపనిగాదు. నాటకసమాజం ప్రారంభించి దానిచేత పనిచేయించి ప్రదర్శన యిచ్చినారంటే అది గణింపతగ్గ విషయమే ఆ ప్రదర్శన యెలాగున్నదీ అనేది మరోవిషయం.

ఉత్సాహవంతులైన నాటకకళాభిమానులు కాలక్షే పానికిగాని ఒక ప్రయోజనాన్ని ఆశించిగాని సమాజాలుగా యేర్పడి, వీలువెంబడిన నాటకప్రదర్శనలు యేర్పాటుచేసు కునే సమాజాలను ఔత్సాహికనాటక సమాజాలందాం. ఇట్టి సమాజాలు యేర్పడటం వాటి నిర్వహణకూడా ఆయా ప్రత్యేక పరిస్థితులనుబట్టి వుంటాయి. ఔత్సాహిక నాటక సమాజసభ్యులెవరూ నాటకప్రదర్శనములమీాది ఆదాయంతో పొట్టపోసుకునేవారుగావుండరు. వీరు జీవనోపాధికిగాను ఇతర వృత్తులుకలవారైనా అయివుంటారు, లేక అట్టి వృత్తులకోసం ప్రయత్నంలోనన్న వుంటారు. విద్యార్థులుగా కూడా వుండ వచ్చు. కొన్నికొన్ని వృత్తులవారు యెప్పుడూ ఒకేచోటవుండే అవకాశంవుండదు. బదిలీలు అవుతూంటారు. అటువంటివారు సమాజంలోని ముఖ్యవ్యక్తులైనప్పుడు వారుబదిలీఅయిపోయి నంతనే సమాజం కుంటుపడకుండా మిగిలినవారు తగు సమర్థ తతో సమాజనిర్వహణకు బాధ్యత వహించాలి.

ఔత్సాహిక నాటకసమాజనిర్మాణం :

నేను నటుణ్ణి అని యేఔత్సాహికనటుడూ ఒకానొక సమాజం దగ్గరకువెళ్ళి చాటుకోడు. కాగా ప్రస్తావనవశంగా ఫలానివారు నటకులు అని తెలుస్తుంది.

సమాజనిర్మాణకౌశలంగలవారు ఒకరు నాటకసమాజ నిర్మాణానికి పూనుకని పదిమంది మంచి మనుషులసహాయం లభిస్తే నాటకసమాజనిర్మాణం త్వరలో సానుకూలపడుతుంది.

సాధారణంగా యిలాంటి సమాజాలు నలుగురైదుగురు నట మిత్రులతో ప్రారంభమవుతాయి. తరాత తర్వాత క్రొత్తవారు చేరుతూంటారు. ప్రాతవారూ క్రొత్తవారూ యొకే కుటుంబంగా వ్యవహరించుకుంటూ సమాజాన్ని చక్కగా నిర్వహించుకుంటూరావాలి.

ఔత్సాహిక నాటకసమాజాలు స్కూళ్ళలోనూ, కాలేజీల్లోనూ Institutionలోనూ నిర్మించడమూ నిర్వహించడమూ కూడా తేలిక. యిచేయితరులునిర్మించాలన్నా నిర్వహించాలన్నా కొంచెంకష్టం ఒకేచోట చదువుకునేవారు, పనిచేసేవారు ఒకరినొకరు యెరిగివుండే అవకాశమూ తరుచు కలుసుకునే అవకాశమూ యెక్కువ అనేకచోట్ల(విడివిడిగా)పనిచేసేవారితో నిర్మింపబడిన సమాజనిర్వహణ కొంచెం కష్టం. కానీ అంతా మంచి ఉత్సాహవంతులైనప్పుడు అనుకున్నప్రకారం ప్రోగ్రాములు నిర్వహిస్తున్నప్పుడు యీతేడా ఆట్టే పట్టివ్వదు. ఏతరహాసమాజమైనా నిర్వాహకులూ యితరసభ్యులూపరస్పర సహకారసంఘీభావంలో యొకే కుటుంబ లా వ్యవహరిస్తూ వ్యవహరించే సమాజాలు పదికాలాలపాటు మానగలవు. అస హనం సహాయనిరాకరణ యే సమాజంలోవున్నా అది పైకి రాదు. త్వరలోనశిస్తుంది.

ప్రతి సంఘానికీ అవుసరమైనట్లే యీ నాటకసమాజాలకు కూడా నిబంధనలు చాలా అవుసరం. వ్రాతపూర్వకంగా లేకపోయినా మాజువాణీగానైనా యిది యిల్లాజరగాలి అనే

ఒక నిర్ణయం ఉండాలి. సాధారణంగా యీ ఔత్సాహిక నాటకసమాజాలెలా ప్రారంభమవుతాయంటే; ఏదో ఒక నాటకంమీదో నాటికమీదో ఒకరికి (లేకకొందరికి) మోజు కలగటమో లేక యేదో సందర్భాన్ని పురస్కరించుకుని ఒక ప్రదర్శన యేర్పాటు చెయ్యవలసిరావటమో జరుగుతుంది ఆ తాత్కాలిక ప్రయోజనానికి యేర్పాటయిన సమాజం. అను కున్న పనులు అనుకున్నవిధంగా జరిగి నాటక ప్రదర్శన జరిపి తదుపరి విచ్ఛిన్నం అయిపోకుండా వుండాలంటే ఒక నిబంధ నావళీ దాన్ని సక్రమంగా నిర్వర్తింపగల నిర్వాహకులూ దాన్ని గౌరవించేసభ్యులూ అవుసరం.

ఔత్సాహికనటులు లబ్ధి (డబ్బు) ఆశించకుండా నాటక ప్రదర్శనలలో పాల్గొంటారన్నాం కానీ నాటకప్రదర్శన అనం గానే కొంత ధనం విధిగా కావాలి. ఇది సేకరించడానికి అనేక మార్గాలున్నాయి. ధనాధికులైన మెంబర్లయితే తలకింత చొప్పున చందారూపంగానో లేక అయినఖర్చులో వంతుల వారీగా చెల్లించటమో చేస్తారు. కానీ ఈపద్ధతి అన్నిచోట్లా యెల్లప్పుడూవర్తింపజెయ్యటంకష్టం. డబ్బుకూడాపెట్టుకుంటూ నాటకాలాడే ఉత్సాహం ఆట్టేరోజులు నిలవకపోవచ్చు. కొంతమంది అభిమానులను ప్రోగుచేసి వారికి ప్రవేశపత్రములు అమ్మటంద్వారాగాని లేక నెలసరి చందాలరూపంగాగాని నిధి ప్రోగుచేసుకోడం మరోమార్గం. ఇదీ అంత సంతోషదాయక మైన విషయంకాదు. ఒకటి రెండుతూర్లు సంతోషంతో చందా

యిచ్చినవారు మరోమాటు కొంచెం కష్టపడవచ్చు వారిని చూచిన సమాజనిర్వాహకులు నిరుత్సాహం పొందవచ్చు. ఏది యెట్లున్నా యీ ధనాభావం ఔత్సాహికనాటక సమాజాలకు పెద్ద సమస్యేనని అంగీకరించక తప్పదు. ఔత్సాహిక సమాజాలు (ముఖ్యంగా ధనం సేకరించలేనివి) ప్రదర్శన ఖర్చు లనేకవిధాల తగ్గించుకునే ప్రయత్నాలుచేస్తున్నాయి. ఇందులో ముఖ్యమైంది స్త్రీపాత్రలులేని నాటకాలను యెన్నుకోవడం. రెండవది ప్రదర్శనశాలలు లభ్యంకానందున మ్యాటనీ నాటకాలు ప్రదర్శించడమో లేక ఓమోస్తరుగా పనికి వస్తుంది అనుకున్న పెద్దహాళ్ళవంటి పొగాకు వగైరా ఖాళీ గోడవునులలో ప్రదర్శనలు యేర్పాటుచేయటమో చేస్తున్నారు.

మూడవది : సంగీతం రంగాలంకరణ ఖర్చులు సాధ్యమైనంత తగ్గించుకోవడం

ఈ విషయాలు తీవ్రంగా నాలోచిస్తే నాటకకళలో నవ్యరీతులు ప్రయత్నించి చూపాల్సిన ఔత్సాహికనాటక సమాజాలు నాటకానికి కావలసిన ముఖ్యభాగుల్నే ఒకటొకటిగా యెలావదులుకోవాల్సివస్తోందో యర్థమవుతుంది.

ఈ కష్టాలను యెప్పటికప్పుడు యేదోవిధంగా నధిగమిస్తూ నాదర్శ ప్రదర్శన లేర్పాటు చేస్తున్న సమాజాలు వున్నాయి కాని యెంత ఓర్పు కలవారైనా యెల్లప్పుడూ కష్టాలు పడుతూ సమాజాలు నిర్వహించటం కష్టం. ఇటు

వంటి వారికి ప్రభుత్వమూ, ప్రజలూ యితోధిక సహాయం చెయ్యాలి.

కేవలం వుత్సాహం, నాటకాలంటే సరదా, పది మందిని కూడగట్టుకోగల ఓర్పూ, నేర్పూ వున్నంతమాత్రాన యెవరూ నాటక సమాజం స్థాపించి నిర్వహించలేరు. ఈ సుగుణాలతో పాటు నాటక ప్రయోగంలోని లోతుపాతులు, మెళకువలు తెలిసి వుండాలి. సమాజ సభ్యులంతా యిందులో పాండిత్యం కలవారు కాకపోయినా నిర్వాహకుల కన్నా ప్రయోగ పరిజ్ఞానం అవుసరం.

సమాజ సభ్యులంతా యెంత యనుభవం కలవారైనా యెంత నిపుణులైనా సమాజ కట్టుబాట్లకు లోబడి వుండాలి. తమ సమాజ ప్రదర్శనలంటే చాలా బాగుంటాయనే పేరు తీసుకురావాలనే దృష్టి వుండాలిగాని యెంతవరకూ తనపాత్ర బాగుండి తాను పేరులోకి రావాలనే దృష్టి వుండకూడదు. తమారు పెద్దలుగా యెన్నుకున్న వారు తమకు యేర్పరచిన విధులు శక్తివంచన లేకుండా నిర్వర్తిస్తూండాలి.

పెద్దలుగా యెన్నుకోబడ్డవారు కూడా పేనుకిపెత్తనం అబ్బినట్లు ప్రవర్తించక యెవరి మనసూ నొవ్వకుండా సతి చాకచక్యంగా యెవరెవరి శక్తి సామర్థ్యాలకు తగినట్లు వారి వారికి పనులు పురమాయించి చేయించుకునే శక్తి కలిగి వుండాలి.

సాధారణంగా నాటక సమాజాలకు యీ క్రిందిపనులు నిర్వర్తించ గలవారవుసరం. ఈ పనులకు ప్రత్యేకం ఒక

వ్యక్తి అంటూ లభ్యం కానప్పు డొకేవ్యక్తి ఒకటికన్నా యెక్కువ పనులు నిర్వర్తించవచ్చు. లేక నన్నిపనులూ నొకరే నిర్వర్తించ వచ్చు. ఏదియేమైనా యీ పనులు జేయా లని ముందుగా ననుకొని నాయీ పను లెవరివల్ల జరగా ల్సిందీ నిర్ణయం చెయ్యటం సమాజ నిర్వాహకుల ముఖ్య విధులలో నొకటి.

1. ప్రాథమిక దశ

1. నాటక నిర్ణయం:—ఇది సమాజ సభ్యులంతా కలసి చేయవచ్చు వివరాలు మరో ప్రకరణంలో వున్నాయి.

2. నిర్మాత నియామకం:—ఇతనినే డైరెక్ట రన వచ్చును. ఈ వ్యక్తి నాటక శిల్పం బాగా తెలిసినవాడై వుండాలి. నాటకాన్నీ పాత్రలనూ అర్థంచేసుకోగల పరిజ్ఞానం కలవాడై వుండాలి.

3. పాత్రల యెన్నిక:—చిన్న పాత్ర లనేవి లేవు. అంచేత అంతా పెద్ద పాత్రలకు ప్రాకులాడక తగుపాత్రలను తీసుకోవా లవి యెంత చిన్నవైనా.

4 ఆర్గనైజేషన్:—ఆహ్వానాలు, పబ్లిసిటి ప్రద ర్శనశాల వగైరా యేర్పాట్లు పరికరాలను సమకూర్చటం, వగైరా పనుల కుత్సాహులైన వారుండాలి.

౨. ప్రయోగదశ

1. రిహార్సలు:—కట్టుబాటుగా నొక నిర్ణీత టైంటే బిలు ప్రకారం నడపాలి. నటనరంగ ప్రయోగం వగైరా

విషయాలను తమకు తెలిసినంత నిర్దుష్టంగా అభ్యాసం చేసి చక్కని ప్రదర్శన అనిపించుకోవాలి.

## 3. ప్రదర్శనదశ

1. ప్రేక్షకస్థానం:— ఆహూతులకు తగు స్థానాలు యేర్పర్చి వారి కసంతృప్తి కలుగకుండా తగు జాగ్రత్తపడాలి.

సౌండు, లైటింగు సాంకేతికంగా నిర్దుష్టంగా వుండేలా అమర్చాలి.

2. రంగస్థలం:— గ్రీన్ రూము మేకప్‌కూ ప్రాపర్టీస్ వగైరా లందుబాటులో వుండేలా గమర్చేందుకూ నటులు విరామ సమయంలో విశ్రాంతి తీసుకునేందుకు తగు యేర్పాట్లు చేయాలి.

రంగస్థలం:— రంగాలంకరణ లైటింగు వగైరాలు ప్రతి దృశ్యమూ ప్రేక్షకులకు కనిపించేలాగున నేర్పాటు చేయాలి. అనవసరమైన నాలస్యం జరుగకుండా ప్రదర్శన చకచక నడిచేలా గన్ని యేర్పాట్లు చేసుకోవాలి.

ఈ విషయములనుగురించే ముందుప్రకరణలలో విపులంగా చర్చించాను.

ఇక నియమావళి యేయే అంశాలను కలిగివుంటే బాగుంటుందో చెప్తాను.

1. పేరు, నిర్మాణం, చిరునామా :—

2. ఉద్దేశ్యాలు :—

3. సభ్యులు :—

అ నటీనటులు

ఆ. అభిమానులు పోషకులు వగైరా.

అర్హతలు. రుసుము, విధులు, హక్కులు

4. విధులు :— సేకరణ, భద్రత.

5. నిర్వాహకవర్గము :—సభ్యుల యెన్నికా? నియామకమా? అర్హతలు, బాధ్యతలు, హక్కులు.

6 నిర్వహణ :— సమాజమును యే యే విధముల నిర్వహించవలెనో సూచనప్రాయంగా వ్రాసుకునేది.

7. లెక్కలు :— వ్రాయువిధి, తనిఖీ (ఆడిటు) యేర్పాటు, లాభనష్టముల పంపిణీనిష్పత్తి వగైరా సూచన ప్రాయంగా వ్రాసుకునేది.

8. ఆస్తులు :— (రంగపరికరాలు సంగీతపరికరాలు వగైరా) సేకరణ, భద్రత.

వివిధవిషయములు :— వీలునుబట్టీ అవుసరాన్నిబట్టీ పై నియమావళికి మరికొన్ని అంశాలు చేర్చుకోవచ్చు. ఒక మారుచేసుకున్న నియమావళి యెక్కువమంది సభ్యుల నామోదంమీద మార్చుకోనూవచ్చు. సమాజం నడుస్తున్నకొద్దీ కొత్తకొత్త యనుభవాలు కలుగుతూంటాయి. కొత్త కొత్త సమస్యలు యెదురౌతూంటాయి. వాటిని జాగ్రత్తగా పరిశీలించి పరిష్కరించుకురావాలి. మన సమాజ చరిత్రానుభవాలూ గ్రంథస్థంచేస్తూపోయే యలవాటు మనకూ మన తరువాతివారికీ కూడా చాలా నుపయోగకరంగా వుంటుంది.

---

# నాటకశిల్పం

## IV నాటక ప్రయోగం

### 1. వృత్తినాటక ప్రయోగం

వృత్తినాటక సమాజాలంటూ యొకానొకప్పుడు ఆంధ్ర దేశంలో వుండేవి. కాని యీనాడు యిట్టి సమాజాలు లేవనే చెప్పవచ్చు.

ఈ వృత్తి నాటక సమాజాలు ధార్వాడ కంపెనీ పార్సీ కంపెనీల ప్రదర్శనలు చేసిన దిగ్విజయ యాత్రతో ప్రోత్సహింపబడి యించుమించు అదే ఫక్కీలో ప్రదర్శన లిచ్చేందుకు ప్రారంభింపబడ్డాయి. వీటి పుట్టుక చరిత్రవగైరాలు తెలుసుకునేందుకు యితర గ్రంథాలున్నాయి.

జమీందారులు, ధనాధికులూ నయిన నాటక కళాభిమానులు స్థాపించి నిర్వహించిన నాటక సమాజాలు కుటుంబ ఫక్కీలో (సురభి, సి. యస్. నటేశం వగైరా కంపెనీలు) నిర్వహించిన సమాజాలు, విద్యాధికులైన వుత్సాహవంతులు స్థాపించి నిర్వహించిన సమాజాలున్నాయి.

ఈ మూడు రకాలవృత్తి నాటకసమాజా లుచ్ఛస్థితిలో నున్నప్పు డనేకమంది గొప్పగొప్ప నటులు తయారయారు.

పిసిరినమ్మకు బొక్కనదే దక్క డనే ప్రాథమిక సూత్రంమీద నిర్వహింపబడిన సమాజా లొకధ్యేయము సరియైన ప్లానింగు లేక విపరీతమైన ధనార్జన చేసికూడా నష్ట పోయి నిర్వాహకుల నించుమించు బికారులనుచేసి నాశన మయాయి. కుటుంబఫక్కీలో నిర్వహింపబడేవి క్రొత్తపోకడలు ప్రవేశపెట్ట లేక నామమాత్రావశిష్టంగావున్నాయి. విర్వాధికుల బహుముఖవ్యాపారాలవల్ల యితర కారణాలవల్ల యీ తరహా సమాజాలుకూడా త్వరలోనే నశించాయి. కాగా నాయా సమాజాలలో పాల్గొన్న నటులు కళాకారులు ప్రసిద్ధికెక్కారు.

ప్రస్తుతవృత్తి నాటకసమాజాలు ప్రదర్శన లేర్పాటు చేసుకోడానికి కంట్రాక్టరుపై నాధారపడ్తున్నాయి. ఈ కం ట్రాక్టర్లు కేవలం ధనార్జనే దృష్టిలోపెట్టుకుని ఫలానా నటు లుంటే బాగాడబ్బువస్తుందనే యాశకొద్దీ యొకేపాత్రకునలుగు రైదుగురు నటుల్ని మాట్లాడి నాటకప్రదర్శనలు చేయిస్తు న్నారు సమాజాలుగా యేర్పడ్డ నటులుకూడా తమ ప్రదర్శ నలు కంట్రాక్టరుసహాయ మపేక్షించి సమాజమంతకూ కొంతనిర్ణీత మొత్తం పుచ్చుకుంటున్నారు ధైర్యంచేసి స్వతం త్రంగా నాటకప్రదర్శన నేర్పరుచ్చుకోగల సమాజాలు లేవనే చెప్పవచ్చు. చెదురుమదురుగా యిలాంటిప్రదర్శనలు యేర్పరుచ్చు కున్నా నిర్వహణలోపంవల్ల నష్టపోయి కంట్రాక్టునాటకాలకే యెక్కువగా మొగ్గటం జరుగుతోంది. ఈ కంట్రాక్టర్లను కున్న ప్రకారం డబ్బుయివ్వనప్పుడు సమాజంలోని యితర సభ్యు

లకు వేతనం (కిరాయి) ముట్టచెప్పలేక నిర్వాహణభారం నెత్తిన వేసుకున్నవారు చిక్కుల్లోపడిన పరిస్థితు లనేకం. ఇటువంటివే మరో కొన్ని కారణాలవల్ల వృత్తినాటకప్రదర్శనలలో నెన్నదగిన వుత్తమనటులు తయారుకావటంలేదు అక్కడనుం చొకరూ యిక్కడనుం చొకరూ వచ్చి కంట్రాక్టరు చౌకగా మాట్లాడి వుంచిన దుస్తులకం పెనీవారి మిగిలిపోయిన దుస్తులుధరించి తమ పద్యాలు నాలుగూ చదివేసి నిర్ణయించుకున్న మొత్తంలో కంట్రాక్టరు దయాధర్మంగా యిచ్చిన మొత్తం పుచ్చుకుని రైలెక్కిపోతున్నారు. ఈ తరహా నాటకప్రదర్శన లెప్పుడో తప్ప రసాభాస కాకుండా వుండవు. కంట్రాక్టరులకుకూడా యెప్పుడో కాని పెట్టుబడి సొమ్ము చేతికి వస్తుందన్నయాశలేదు. కంట్రాక్టరు నెత్తికి చేతులు, హాలువాళ్ళ కుర్చీలూ బెంచీలూ ముక్కలు చెక్కలూ, ప్రేక్షకు లసంతృప్తి, యీ నాటకాలవల్ల ప్రయోజనాలు. ఫలితాలు కంట్రాక్టర్లు నాటక మంటే నామడదూరం పారిపోవటమూ, హాలువాళ్ళు నాటకానికి హాలుకావాలంటే కర్రపుచ్చుకు వెంటబడటం, యెంత మంచినాటకం ప్రదర్శిద్దామనుకున్నా ప్రేక్షకులలోని నైరాశ్యంవల్ల కిలెక్కను లేకపోవడం.

ఈ తరహా నాటకాలు ప్రబలమైన రోజులలో కూడా యొకటి రెండు సమాజాలు ఆ యా సమాజ నిర్వాహకుల పట్టుదలా ఓర్పూ ఫలితంగా కొన్ని క్రొత్త నాటకాలను

ప్రదర్శించడమూ కొంతమంది మంచి నటులను క్రొత్తవారిని తయారు చేయడమూ జరిగింది.

ఇటువంటి అననుకూల పరిస్థితులలో కూడా వృత్తి నాటక రంగం నిలబడ గలిగిందంటే యిందుకు లోగడ పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్న నటుల ప్రతిభా, రెండవ ప్రపంచయుద్ధపు ధర్మమా యని యేర్పాటైన యుద్ధనిధి నాటకాలే కారణం.

ఒకొక్క పాత్ర నొక్కొక్క నటు డా పాత్ర తను తప్ప మరొకరు ధరించలేరనేంత విశిష్టతకు తెచ్చారు. వారి జీవితానంతరం గాని మరొకరా పాత్ర ధరించగల ధైర్యం లేకుండా కొన్నికొన్ని పాత్రలను ప్రదర్శించిన నటు లీ కంట్రాక్టు నాటకాల యుగంలోకూడా మన గలిగారు.

ఏదియేమైనా నాటక ప్రయోజనాన్ని సమాజాలుగా పేరు ప్రఖ్యాతులు గడించుకున్న నొకటి రెండు సమాజాలు మినహా తతిమ్మావారంతా విస్మరించారు. కృష్ణ పాత్రమీద నారదపాత్ర బాగుండటమూ, సత్యభామపాత్ర మీద వసంతకపాత్ర బాగుండటమూ, నక్షత్రకుడి పాత్రమీద వీరబాహు పాత్ర బాగుండటమూ యనే కాంపిటీషను స్పిరిటుతో నాటకాలు ప్రదర్శించారే గాని, యేయొక్క నాటకాన్నీ భక్తి శ్రద్ధలతో నది నాటక మనుకొని పాత్రలు తగు విధంగా ప్రవర్తించిన పాపానపోలేదు. కంట్రాక్టునాటక యుగంలో, సారంగధర నాటకంలో హరిశ్చంద్ర పద్యాలు

వింటాం. మరోదాంట్లో మరోటిచూస్తాం. ప్రేక్షకులు గోల చేస్తున్నారని, యవి వారు కావాలంటేనే వినిపించామనీ యంటారు. ఇది యబద్ధం. లేనిపోని గొప్పదన మాపాదించుకో డాని కొకటి రెండు చోట్ల కక్కుర్తిపడి తాముగా నీ పద్ధతులు ప్రవేశపెట్టి యేడ్పించాలని ప్రేక్షకులు ఫలానా పద్యం పాడు, ఫలానాపాట పాడంటే విధిలేక పాడి మరింత అపహాస్యం పాలు కావలసొస్తోంది.

ఇతర రాష్ట్రాలలోని నుత్తమనటులకు మన నటు లేమాత్రమూ తీసిపోరు. కాని వారి నాటకప్రదర్శనలముందు మనప్రదర్శనలు నాటకప్రదర్శనలనిపించుకోవు. అందుచేతనే యేనాటకం తయారుచేసినా నెలలతరబడి ప్రదర్శనలుంటాయి యితర రాష్ట్రాల్లో. మనరాష్ట్రంలో నొక వూళ్లో నొకనాటకం వేస్తే మరల యెన్నాళ్ళకో! యెన్నేళ్ళకో! ఇట్టి తరుణము మించిన దొరకదుకదా!!! చక్కని నాటకాలు వారముల తరబడి ప్రదర్శించిన వుదాహరణలు మనకూ లేకపోలేదు. అందుచేత ప్రజలలో వారములతరబడి యొకేనాటకంచూచే యాశక్తి లేకపోలేదనీ యెటొచ్చీ ఆ స్థాయికిరాగల చక్కని నాటకప్రదర్శనలే అరుదనీ చెప్పుకోవల్సివస్తోంది.

ఈనాటి వృత్తినాటక ప్రయోగాన్నిగూర్చి అంతగా చెప్పాల్సింది యేమీలేదు. ఏదో అమానుషశక్తి యెవరి లోనో ప్రవేశించి యేరెండకరాల పొలాన్నో నమ్మిస్తుంది. పాతవాస నున్నా లేకపోయినా నాడబ్బుపుచ్చుకొని పేరెన్నిక

గన్న నటీనటుల వద్దకుపోయి యొక్కొక్క పాత్రకు నలుగు రైదుగుర్ని కుదుర్చుకొని హాలువాళ్ళని ప్రాధేయపడి వది కుదుర్చుకుని పబ్లిసిటీ ప్రారంభిస్తాడు. నక్షత్రాలు వక్రించక పోతే పెట్టుబడిసొమ్ము కొకఅణా అటూ యిటూగా కలెక్షను వస్తుంది. లేకుంటే హాలుఅద్దెమటుకూవచ్చి వూరుకుంటుంది. ఒక్కొక్కప్పు డసలు యేమీరాకపోవడంకూడా కద్దు!

ఈ తరహానాటకప్రదర్శనల్లో ఆనువాయికీగావస్తున్న

యూచార మొకటుంది. అది వచ్చిన కలెక్షనుకాస్తా చేతబట్టు కునికంట్రాక్టరు పారిపోవడం,మాకుడబ్బు ముట్టలేదుకనుక మేం నాటకం ప్రదర్శించమని నటులు బిగదీసుకోడం,రెచ్చిపోయిన ప్రజలు కుర్చీలతోనూ బెంచీలతోను వారిని సత్కరించడం! కొన్నిరోజులు పోయినాక వచ్చిన కలెక్షనులో ప్రపోర్షనేటు (దామాషాగా)నటులకు కంట్రాక్టర్లు పంచియివ్వటం. అసలు లేనిదానికంటే యిదేనయమని మూడువందలి స్త్రీగానిరామన్న నటులు మూడు రూపాయలూ పుచ్చుకుని నిష్క్రమించటం జరిగింది. ప్రకటించినరోజుకు అందరు నటులూవచ్చి ప్రదర్శన జరుగుతుంది. అని ఆఖరుక్షణంవరకూ యెవరూ అనుకునేవారు కారు.

ఇలాపరస్పర మోసాలతో కూడుకున్న యీ ప్రదర్శన లెవరికీ నుపయోగంలేకుండా పోయినాయి. చాలా మంది నటులూ కంట్రాక్టర్లూ కూడా యెక్కువగా నష్టపోయి

నారు. అయినా యివి ఆపాలన్న వుద్దేశ్య మే యెవ్వరికీ కలగకపోవడం ఆశ్చర్యం.

ఈ కంట్రాక్టుయుగంలో వృత్తి నాటకరంగం నడచిన విధం పరిశీలిస్తే యీతరహాలిన్నాళ్ళేలాసాగిందాయని యాశ్చర్యం వేస్తుంది. నిజమే, యిది యెప్పుడో నశింపుకావలసి వుండెను. కాగా గత ప్రపంచసంగ్రామధర్మమాయని "యుద్ధనిధి నాటకాలు" అంటూ వచ్చాయి. అవి యీనటనలను నిలబెట్టాయి. ఈనాటకాలకి డబ్బురాకపోవడ మంటూ లేదు. అంచాత ప్రదర్శించినప్రతినాటకానికీ ప్రతినటునకూ యింతో అంతో తప్పక ముట్టుతూ వుండేది. ఈ నాటకాలలో కూడా చాలా అవినీతి లేకపోలేదు. నిర్వాహకులు తతిమ్మావారి కన్నుగప్పి యెక్కువ మొత్తాలు మిగుల్చుకుని బాగుపడ్డ వుదంతా లనేకం. అయితే కంట్రాక్టరంటూ యొకడున్నాడతడైనా నటుల కష్టం తినేవాడేకదా! పోనీ మన నటుల్లోనే యొకడు యీలాభంపొందుతున్నాడని వూరుకున్న వారు వూరుకున్నారు లేనివారు రచ్చకెక్కి గోలచేసారు. ఎంతగోలచేసినా నివి యేర్పర్చేవారికి బాగా లాభాలుండటం మూలాన యీ ప్రదర్శనలు యథావిధిగా జరిగాయి. అక్కడక్కడ మళ్ళీ కంట్రాక్టర్లు తలెత్తారు. మళ్ళీ మామూలు పరిస్థితులు దాపురించాయి. ఇంతలో పంచవర్ష ప్రణాళికా నాటకాలు ప్రారంభమయి నటులకు టిఫిను కర్చులకు బాధలేకుండా చేస్తున్నాయి.

ఈ తరహా 'చెంచా పాల'తో నాటక రంగ మెన్నాళ్లు బ్రతుకుతుంది? వృత్తినటులు వ్యక్తిత్వాన్ని వదలుకొని నాటక మంటే సమాజ మనే దృఢాభిప్రాయానికి వచ్చి యీ సమాజాభివృద్ధి కనుగుణంగా వ్యవహరిస్తూ చక్కని నాటక ప్రదర్శనలు యేర్పాటు చేయాలి. ఫలానా నటు డనేదానికన్నా ఫలానా సమాజ లాంటే నాటకానికి ప్రేక్షకు లాకర్షింపబడేరోజులు తిరిగిరావాలి. వృత్తి నటులు తమకన్నామించిన నటుల్ని తయారుచేయాలి. సమాజ నిర్మాణాని కవుసరమైన నిబంధనావళితో నవుసరమైతే రిజిష్టరు చేసుకుని నాదర్శవంతమైన సమాజాలు నిర్మించుకోవాలి. చూడ చక్కని నాటకాలు తయారుచేసి ప్రదర్శించాలి.

ఎవరివృత్తివారు వ్యక్తిగతంగా చేసుకుంటూ సంఘం పెట్టుకోవలసిన అవుసరం లేకుండా బ్రతుక నేర్చిన వృత్తులు గలవారే యీ రోజుల్లో సంఘాలు స్థాపించుకుంటున్నారు. సంఘం అంటూ లేనిదే నాటక ప్రదర్శన వీలులేని పరిస్థితులు గల యీ వృత్తిలో గణియపుపెట్టె చంకన బెట్టుకుని యేకాకిగా తిరుగుతున్నారంటే వృత్తినటులు దేశపు నడకలో యెంత వెనుకనున్నారో యాలోచించుకోవచ్చు.

నాటక ప్రదర్శన కయ్యేఖర్చులలో నే డెక్కువ భాగం నటులకూ, హాలుకూ అవుతున్నాయి. ఒక నాటక ప్రదర్శనకు రెండువేల రూపాయలు పుచ్చుకున్న వారున్నారు.

ఈమాదిరిగా నటులకూ, హాలుకూ వ్యయపరచి రంగాలంకరణ పగ్గైరాలకు కూడా వ్యయపరచగల వుత్సాహం యెవరికీ వుండదు. నాటకాలు అపభ్రంశ సీనరీలముందు ప్రదర్శింప బడుతున్నాయి. వృత్తినాటక సమాజాలంటూ యేర్పడిన పిమ్మట యేయే శాఖ కెంతెంత ఖర్చు చేయాలో ముందుగానే నిర్ణయించుకుని నాటక ప్రదర్శనలో వన్ని కళలకూ తగు ప్రాధాన్యం యిచ్చి చూడ చక్కని తెలుగు నాటకాలు ప్రదర్శిస్తారని యాశిస్తున్నాను.

## 2. ఔత్సాహిక నాటక ప్రయోగము.

### (a) నాటక నిర్ణయం

వృత్తినటునకు సాధారణంగా తనకిష్టంకాని నాటకంలో నిష్టంకాని పాత్ర ధరించే యోగం పడ్తూంటుంది. ఇదే యింకా వివరంగా చెప్పాలంటే అతను వెయ్యదల్చుకున్న అభిమాన పాత్రగల నాటకప్రదర్శన యేర్పాటు జరుగకపోవచ్చు. అథవా జరిగినా తన యభిమానపాత్రకు తనుగాక మరొకరి నేర్పర్చబడవచ్చు.

ఔత్సాహిక నటు డీ విషయంలో చాలా యదృష్టవంతుడు అతని యభిమాన నాటకంలో అతని అభిమానపాత్ర అతనికి లభించే అవకాశం ఎక్కువగావుంది. ఈవిధంగా తను హృదయపూర్వకంగా నెన్నుకున్న పాత్రను నటించి మెప్పించే అవకాశం అతనికుంది.

ఈ సదవకాశాన్ని దుర్వినియోగం చేసుకోరాదు. ఒకానొకపాత్ర తనకు సరిపోయిందీ, మెప్పించ గలదీ యున్న కారణాన ప్రదర్శింపజాలని నాటకాన్ని యెన్నుకుని సమాజం సత్తిన రుద్దబూనరాదు.

ప్రదర్శింపజాలని నాటకం అంటూ యొకటుంటుందా? వుంటే దాని నిర్వచనం యేమిటి? ప్రదర్శకులకి కోరుకోను పడనిదీ. ప్రేక్షకులకి ఆనందాన్నివ్వందీ, ప్రదర్శింపజాలని నాటకం అని స్థూలంగా చెప్పుకోవచ్చు.

ఆంధ్రనాటకరంగంలో పదిమందీ యెలుగెత్తి చాటే కొఱతలు రెండు; మంచి నాటకాలు లేవు. (2) సరైన రంగస్థలం లేదు. (అంటే ప్రదర్శనశాలలు లేవు).

తమాషాగా లేదూ!? నాటకాలు లేవు. రంగస్థలాలు లేవు యీ రెండూ ఒకరినోట వెంట ఒకేమాటువస్తే "నాటకరంగమే లేదు!"

నాటకాలు లేకపోయినా, రంగస్థలాలు లేకపోయినా అదృష్టవశాత్తూ వుత్సాహవంతులైన నటులూ, ఓపికగల ప్రేక్షకులూ వుండటంమూలాన సరైన నాటకరంగం లేకపోయినా యేదో ఒక నాటకప్రదర్శన యేదో ఒక రంగంమీద జరుగుతూనే వుంది.

నాటకాన్ని యెన్నుకోవడమన్నది నిజంగా ఒక పెద్ద సమస్యే. ఈవిషయంలో యిదమిద్ధంగా కొన్ని నిబంధనలు చెప్పటంగాని వాటిని సర్వేసర్వత్రా ఆచరణలో పెట్టడంగాని

కుదరదు. పరిస్థితులనుబట్టీ మనకున్న వీలుచాళ్ళనుబట్టీ మనకు అనువైన నాటకాన్ని నిర్ణయించుకోవాలి.

నాటకాలలో యెన్నోరకాలుండవచ్చు. యెన్నిరకాలున్నా మనకు యిప్పుడు రెండురకాల నాటకాలున్నాయి. ఒకటి గద్యపద్యములతో కూడిన నాటకాలు, రెండు పద్యాల్లేని గద్య (వచన) నాటకాలు. ఈ రెండురకాల్లోనూ పాటలుండావచ్చు లేకనూపోవచ్చు.

ఒకప్పుడు నాటకాలలో పద్యాలుండాలా అక్కర్లేదా అన్న పెద్దవివాదం బైల్దేరింది.(నిజంచెప్పాలంటే యీ వివాదం అసలు నాటకంలోవున్న పద్యాలు పాడాలా, చదవాలా అన్నది రానురాను అది నాటకంలో పద్యాలుండాలా అక్కర్లేదా క్రిందికి దిగింది)

"పద్యం ఆంధ్రులసొత్తు అది లేకుండా నాటకమేమిటి?" అనేవారున్నారు. నిజమే పద్యం "పాడటం" మనసొత్తే. ఈ "పద్యం పాడటం" అన్నది మరేదేశపు నాటకాలలోనూ లేదు. ఈ దొమ్మీలో కొట్టుకుంటూ కొందరు "యితరభాషలలో అసలు పద్యాలేలేవుఫో" అనేశారు! చాలాపొరపాటు, ఇతరభాషలో పద్యాలు (లేక పద్యాలనుపోలినవి) వున్నాయి. అయితే వాళ్ళు వాట్ని మనవారిలా వికృతంగా పాడరు. అంచేత అలా అనుకునే అవకాశం కలుగుతోంది. 'శహార్' అనేది యించుమించు పద్యమే. పద్యగ్రంథాల్ని రచించిన వార్ని 'శహారీ' లంటారు. షేక్స్పియర్ నాటకాలు పద్యాల

బిగింపులు కావూ? అయితే యివన్నీ మన పద్యాలలా గందరి గోళ్ళపడి వికృతాకారాలు (రాగాలతో) దాల్చలేవు!

పద్యానికీ వచనానికీ వున్న తేడా యేమంటే, వచనం యెక్కడంతమవుతుందో మనకి తెలియదు. కానీ పద్యం నాలుగు పాదాలతో (సీసమైతే మరోగీతాన్ని కలుపుకుంటుం దనుకోండి) ఆగిపోతుందని మనకిముందే తెలుస్తుంది కానీ యీ రోజులలో పద్య మనేది ఓ నటమహానుభావుడు యెత్తు కున్నాడంటే యది యెంతకాలాని కాపబడ్తుందో, పరమాత్ము డన్నవాడికే తెలియకుండాపోయింది!

నాటకాలలో పద్యాలుండాలా అక్కర్లేదా అన్న వాదన గ్రంథరచనకు వాడాల్సింది గ్రాంథికమా గ్రామ్యమా అనే వాదనలాగానే అటూ యిటూ తేలకండా వుండిపోయి పద్యాలుపాడే నాటకాలూ, వచన నాటకాలూ కూడా విరివి గానే చలామణీ యవుతున్నాయి

నటుడనంగానే "పద్యాల పాటగాడనే" యిపోహ అప్పటికీ యిప్పటికీ కూడా లేకపోలేదు. కానీ పద్యాలపాటగా ళ్ళెవరూ యుత్తమనటులు కాజాలకపోయినారు. ఇకముందు నవగలరనే యాశకూడాలేదు!

నాటక మంటే యనేక లలితకళల కలయిక. రచన (నాటకం) చిత్రలేఖనం (తెరలువగైరా) వడ్రంగం (సెట్టిం గులు వగైరా) సంగీతం (పాటలూ పద్యాలూ పాడటమే గాదు) వగైరాల కలయిక. ఈ లలితకళల మేళవింపు,

సొంపు మనం నాటక ప్రదర్శనలో చూడగోర్తాం. అలాం టప్పుడు సంగీతాన్ని నాటకం నుంచి తొలగించడం మంచిది కాదు. "సంగీతం లేకుండా నాటక మేమిటయ్యా, నువ్వూ నేనూ కూర్చుని మాట్లాడుకునేది నాటక మవుతుందటయ్యా" యనే వారున్నారు. ఈ వాదనకూడా తప్పుద్రోవ పట్టింది. పద్యాలు పాడటమే సంగీతంగా యెంచడం పొరబాటు. నాటకంలో నేపథ్య సంగీతం సరిగా వాడుకుంటే పద్యాల మీది కీ సంగీతాన్ని తోలాల్సిన యవసరం వుండదు.

పద్యాలకు వాడే సంగీతం వెఱ్ఱితలలు వేసింది. ఈ సంగీత విభాగం అనేక యితర కళలను మింగేసింది. ఒక పద్య పాటకుడు చెవికడ్డంగా చేయి పెట్టుకుని నసహ్యమైన ఆహార్యంతో జుగుప్సాకరంగా నటిస్తూ కమ్మగా పద్యాలు పాడుతున్నా డన్నంత మాత్రాన నతడు నటుడూ కాడు, అది నాటకమూ కాదు.

నాటకంలో అన్ని కళలూ సమానంగా రాణించా లంటే యీ పద్య పాటగాళ్ళు తగ్గాలి. పాటకు హంగు దారులుగా వుండాల్సిన వాద్య విశేషాలు పాటనే మింగేస్తే యెంత సొంపుగా వుంటుందో, నాటకానికి వన్నె తేవాల్సిన సంగీతం నాటకాన్నే వెనక్కునెట్టి ముందుకువచ్చినుంచుంటే అలాగుంటుంది.

సంగీతం మీద (పద్యాల పాడడం మీద!) వుండే కతుకోద్దీ వచన నాటకాభిమానులు సంభాషణలకుమాత్రమే

ప్రాముఖ్య మివ్వట మంతమంచిది కాదు. నాటకంలో శృతి మించని సంగీత మాఖరికి నేపధ్య సంగీతమైనా వుంచాలి.

పద్యనాటకాల్లోనూ, వచననాటకాల్లోనూ మళ్ళీ విషాదాంతమనీ సుఖాంతమనీ రెండు రకాలున్నాయి. మనకి సుఖాంతాలేయలవాటు. ఇప్పుడిప్పుడువిషాదాంతాల్ని జీర్ణించు కుంటున్నాం, వీటికికూడా కాస్త చక్కెరపూతపెట్టి!

వీట్లతో మళ్ళీ పౌరాణికాలనీ, చారిత్రకాలనీ, సాంఘికాలనీ వున్నాయి.

సాంఘికాలలో సామాజికాలూ రాజకీయాలూ కలబోసినవీ విడివిడిగా విడదీసినవీకూడా వున్నాయి.

నాటకాల ప్రదర్శనాకాలపరిమి తెక్కువ. వీటిని తయారుచెయ్యటానికయ్యే వ్యయప్రయాసలెక్కువ. తక్కువ కాలంలో సులభంగా ప్రదర్శించటాని కనువుగా నేకాంకికలూ నాటికలూ ఉన్నాయి. వీట్లలో పైనచెప్పబడ్డన్ని తరహాలవీ వనగా పౌరాణికాలూ చరిత్రకు సంబధించినవీ వగైరా లన్నీ వున్నాయి.

ఏకాంకికలూ, నాటికలూ, సభల్లోనూ, పెళ్ళిళ్ళలోనూ, ఉత్సవాలలోనూ, ప్రదర్శనకు చాలా సను కూలంగా వుంటాయి. వీట్ని తయారుచెయ్యటంలోకూడా పెద్దనాటకానికి అయ్యేంత వ్యయప్రయాసలుండవు కష్టనష్టాలున్నా సూక్ష్మంలో బైటపడవచ్చు. చాలా సంస్థలీమధ్య నుత్సవాలలో పోటీలకు నాటికల నాహ్వానిస్తున్నాయి.

సాధారణంగా ఔత్సాహిక నాటకసమాజాలలో 'నాటిక' ప్రాక్టీసుచెయ్యని సమాజమంటూ లేదు. పెద్దనాటకం మొకటి తయారయేటప్పటికి చిన్ననాటికలు రెండుమూడు తయారయిపోతాయి. ఈ నాటికలకు మనకు కొదువలేదు. మంచివి వున్నాయా అంటే అది మళ్ళీ వేరేసంగతి. నాటక నిర్ణయంచేసుకునేందుకు పడే బాధ నాటికానిర్ణయానికి పడ నక్కరలేదు. ఇంచుమించు చేనాటికకైనా తగుమాత్రం శ్రద్ధతో ప్రదర్శిస్తే రక్తికడుతుంది. ఇంచుమించు నాటికలన్నీ వచనరచనలే.

నాటకం నిర్ణయించడం పెద్దసమస్యే. పద్యాలున్న నాటకమా లేనిదాయని ముందు నిర్ణయించాలి పద్యాలున్న నాటకం తీసుకోవడం కొంత వ్యయప్రయాశలకు లోనైనపని. పద్యాలు రాగయుక్తంగా పాడకపోయినా శ్రుతి తప్పకుండా తగుమాత్రపు రాగవరుసలో నవాలి. ఇందుకు ప్రక్క వాద్యాలు అవసరం. రిహార్సల్సులో యీ పద్యాలు జంత్ర వాద్య సమ్మేళనలో బాగా నలగాలి. చక్కనిగాత్రం గల సామాజికులు లేనప్పుడు పద్యాలున్న నాటకాన్ని తలకెత్తు కోవడం అంత మంచిపనికాదు

పోతే పాటలు ప్రతినాటకంలోనూ పెట్టుకోవచ్చు. అవి కూడా చక్కగా పాడగలవారు లేనప్పుడు వదులుకోవడమే మంచిది. కాదు కూడదుండాలే అనుకుంటే బాగా ప్రాక్టీసు చేయాలి.

"ఈ బాధలన్నీ పడేబదులు వచన నాటకం తీసుకుంటే సరి" అనుకుంటారు. ఆఖరికి జరిగేదికూడా ఇంతే!

అయితే వచన నాటకాన్ని ప్రదర్శించి మెప్పించడ మంత తేలికైన పనికాదు. పాటలూ, పద్యాలూ లేనికొరత మరో కళలో చూపాలి. నాటకాన్నద్భుతంగా ప్రదర్శిం చాలి. పద్యాలూ పాటలూ పాడి తెచ్చుకోగల మెప్పు కేవలం నటనతోనూ, సంభాషణల వుచ్చారణతోనూ తెచ్చుకోవాలి.

అందుచేత పద్య నాటకంకన్నా వచననాటక మన్ని విధాలా పాటవం కలిగి వుండాలి. అంతంతమాత్రపు రచనలు పేలవమైపోతాయి. ప్రదర్శనంతా అయిపోయినాక (అయ్యేదాక కూర్చుంటే!) ప్రేక్షకులు పెదవి విరుస్తారు. అందుచేత చక్కని కథా, మంచి సన్నివేశాలూ సరైనపాత్ర పోషణావున్న నాటకాల్నే యెన్నుకోవాలి. వారెవరో ప్రదర్శించారుకదా అద్భుతంగా వుందని అదేనాటకం మీరూ యెన్నుకుంటేమీ చేతుల్లో అది ఫెయిల్ అయిపోవచ్చు. మరొకళ్ళు చెడగొట్టిన నాటకం మీ చేతుల్లో రక్తిగట్టవచ్చు.

ఒకనాటకం రక్తికట్టడం చెడిపోవడమనేది పూర్తిగా రచనమీదే నాధారపడి వుండదు. ప్రదర్శకుల చేతుల్లో కూడా కొంతవరకు దానియదృష్ట మాధారపడి యుంటుంది. ఒక సమాజంలో యొక నాటకానికి సరిపోయిన వ్యక్తులు మరో సమాజంలో లేకపోవచ్చు మరో సమాజానికి వున్న కొన్నికొన్ని హంగులు యీ సమాజానికి లేకపోవచ్చు.

ఈవిధంగా యనేకరకాల వీలుచాళ్ళ ( Resources) ను బట్టి యుంటుంది మీారు చేయ దలుచుకున్న నాటికపు ఎన్నిక.

ఫలానా నాటకం బాగుంటుందని వినంగానే యది తొందరపడి నిర్ణయించుకో కూడదు. సావధానంగా యా నాటకాన్ని పరిశీలించాలి. మన సమాజంలో యానాటకం లోని పాత్రలకి సరిపోయే వ్యక్తులెంతమందివున్నారు ? ఓ మోస్తరుగా ఫరవాలేదనిపించే వాళ్ళెంతమంది వున్నారు! అసలు పనికిరానివా ళ్ళెంతమందివున్నారని ముందుగా బేరీజు వేసుకోండి.

తర్వాత నాటకాన్ని రక్తికట్టించే ముఖ్యపాత్రలేవో చూచుకోవాలి. వాటికి అతికినట్టు సరిపోయినవారుంటే మంచిదే లేక అవి చెడగొట్టకుండా యొకమాదిరిచేయగలవా రుంటే నాటకం మరోలా రక్తికట్టించగలమేమో చూచుకో వాలి. అన్నింటికన్నా ముఖ్యం మీా ప్రేక్షకులు (సాధారణంగా ప్రతిప్రోత్సాహిక సమాజానికి కొందరు ముఖ్యప్రేక్షకులుం టారు. (వీరే ప్రతినాటకానికీ చందాలరూపంలో ప్రవేశ పత్రాలుకొంటూ ఉంటారు) ఈ నాటకాన్ని యెలా 'రిసీవ్' చేస్తారో నాలోచించుకోవాలి. వీలైతే కొంతమం దభిమా నులనాహ్వానించి మీారు నిర్ణయించదల్చుకున్న నాటకం వారికి పరిచయంచేసి వారి యభిప్రాయాలుకూడా తెలుసుకోవచ్చు.

పై విషయాలలో ఫరవాలేదని తోచిన నాటకం నిర్ణ యించుకోవచ్చు.

'నాటకాంతం హిసాత్యం' అన్నారు పెద్దలు. ఈనాడు ప్రతివారూ నాటకరచనలు చేస్తున్నారు. అలాచేయకూడదని పెద్దలుచెబితే చెప్పవచ్చునుగాని మనంచెప్పకూడదు. పసలేని రచనలు కొద్దిరోజు లేదో కారణాలవల్ల విజృభించినా కొద్ది రోజులకే చప్పబడిపోతాయి. నాటకరచన మంచిచెడ్డలను రంగస్థలమే తేల్చాలి. సాహిత్యవేత్తలూ విమర్శకులూ కాదు. యేపుట్టలో యేపాముందో; ఒకయనామికు డున్నట్టుండి యద్భుతనాటకం రచించవచ్చు (ఇలాంటిసంఘటన లనేకం).

సాహిత్యమంతా తెల్సినపెద్దలకు స్టేజిక్రాఫ్టు దాని అవసరాలు తెలియకపోవచ్చు. అందుచేత వారు నాటకం పేరుతో మరోటి వ్రాస్తారు. వాట్ని నటసజామాలు ప్రదర్శించలేవు. ప్రదర్శిస్తే ప్రేక్షకులు చూడలేరు.

మన తెలుగునాటకరచన లంతగా చెప్పుకోతగ్గవిగా నుండటంలేదు. నూటికి 99 పాళ్ళనువాదాలు అనువాదమని చెప్పుకోకుండా కళ్ళుమూసుకురాసేసేవి జాస్తీ అవుతున్నాయి. ఈవిధానం సాహిత్యజగత్తుకు ఘోరపచారం. మన నాటకరచనాచరిత్రకు మచ్చతెచ్చేది.

మరొకరక మితరదేశాల నాటకాల టెక్నిక్కనుసరించడం. ఇదియొకపక్షంగా మొదటిరకంమీద మెరుగు. అయితే ఈ టెక్నిక్ కొన్నికొన్ని నాటకాలలో వెర్రితల లేస్తోంది. కొంత ఆ నాటకంలోదీ, కొంత యీ నాటకంలోదీ, మరో కొంత సినిమాలోదీకలిపి మనకోనాటకం ప్రసాదింపబడ్తోంది.

ఈకోతకుచెందిన నాటకాలలో ఫ్లాష్ బ్యాక్ పద్ధతి ప్రవేశపెట్టడ మొకటి. స్టేజిక్రా ఫ్టభివృద్ధినందని మన నాటకాలలో ఫ్లాష్ బ్యాక్ పద్ధతి సుతరామూ పనికిరాదని నాభావన.

సాలిలోక్వీ (స్వగతం) నాటకాలలో పనికిరాదన్నవా రొక పాత్రయొక్క మనోభావాల్ని ప్రదర్శించటానికి ఫ్లాష్ బ్యాక్ పద్ధతి నుపయోగించి కొంతవరకూ పాత్రపోషణ చేయడానికి తంటాలు పడుతుంటారు. ఈ పద్ధతిమీద స్వగతాలు వాడటమే నయం. అందులోనూ మీకళ్ళ యెదుట జరిగినట్టుండే నాటకమని చెబుతూ జీవితంలో వెనుక యెప్పుడో జరిగినట్టు మదే పాత్రలచేత యదేదృశ్యంలో నభినయింప జేయ్యట మెంతవిజ్ఞత ?

సామాన్య ప్రేక్షకుల కసలే ఫ్లాష్ బ్యాక్ పద్ధతి అర్థం కాదు. సినిమాలు తరచుచూచే ప్రేక్షకులకు కొందరికి యీ పద్ధతి యర్థమవచ్చు. కాని సినిమా టేక్నిక్ నాటకానికి వాడట మాంజనేయులవారి ముంపు కుప్పిగంతులు వేసినట్లుంటుంది. నాటకరంగాన్ని సినిమాకు దూరంగా యుంచకపోతే యిక యీ మాత్రమూ మనజాలదు. సినిమాలలోవే నాటకాలలోనూ చూపిస్తుంటే ప్రేక్షకులు సినిమాలనే యెక్కువగా నాదరిస్తారు. ప్రేక్షకుడికి తక్కువ ఖర్చుతో యెక్కువ వినోదం యిచ్చేది సినిమా. నాటక విశిష్టత నిలబెట్టుకోలేక సినిమాను యనుకరిస్తే నాటకం నిరాదరణ పొందుతుంది.

అయితే మరి నాటకం పాతపద్ధతులమీద నడవాల్సిందేనా, కొత్త పద్ధతులు ప్రవేశ పెట్టవద్దా? యనే ప్రశ్న రావచ్చు. నిజమే. ఏ కళయినా కొత్తదారులు వెతికి యభివృద్ధి పొందకపోతే యదివసించి తీర్తుంది. అయితే చేతకాని యసంపూర్ణ యనుకరణలు కొత్తపద్ధతు లనిపించుకోవని సవినయంగా మనవి చేస్తున్నాను.

పైగా మన నాటకరంగం ప్రాథమిక సూత్రాలనే సరిగా నర్థంచేసుకొని ప్రదర్శించలేని స్థితిలోవుంది. అటువంటప్పుడు లేనిపోని చేతకాని స్పెషల్ యెఫెక్ట్సు పెట్టి యపహాస్యం పాలుకావటం వాంఛనీయం కాదు. ఈ స్పెషల్ యెఫెక్ట్సు నవి యెలా చెడగొట్టబడుతున్నదీ వేరొకచోట మనవి చేస్తాను. నాటక రచనకు సంబంధించిన యీ విభాగంలో యీ చర్చ యెందుకు వచ్చిందంటే స్పెషల్ యెఫెక్ట్సు వున్న నాటకం యెపి జాగ్రత్తగా ప్రయోగించ గలవారు మాత్రమే యెన్నుకోవాలని చెప్పడానికి రచయితలు కూడా సినిమాలలో చూచిన ప్రతికొత్త టెక్నిక్కూ నాటకంలోకి జొరబెట్ట వద్దని మనవి చేయడానికి

నేటి నాటక రచన ననేక పరిణామాలు పొందింది. భాసుడనీ, కాళిదాసనీ మనం పైపైకి ఎంత చెప్పుకున్నా మన నాటక రచనా విధానం మొదట్నించీ పాశ్చాత్యనాటకాల నెక్కువగా ననుకరించింది. ఆమాటంటే పాశ్చాత్యులే మన వార్ననుకరించాలనేసి గొప్ప జాతీయవాదిగా చలామ

ణయిపోవటంకూడా జరుగుతోంది ఈ పాశ్చాత్యపద్ధతి మీద యిప్పటి నాటకాలన్నీ ననుకరణలనీ పనలేనివనీ యీసడిం చడంకూడా పరిపాటయిపోతోంది. తెలుగులో రెండే రెండు నాటకాలు 'మనవి' అనుకోదగ్గ వున్నాయని పెద్దలు సెలవిస్తున్నారు. ఇది కాదనిచెప్పి సమర్థించుకోగల ధైర్య మెందరికుంది ? ప్రయోగానికి సంబంధించినంతవరకూ యిప్పటి నాటకాలు వెనుకటినాటకాలమీద నభివృద్ధిని సాధించాయి. వెనుకటి నాటక మేది చేపట్టినా ఒమిషన్సు(Omissions) ఎడి సన్సు (Additions) లేకుండా రంగస్థలప్రయోగానికి కనువు గావు. నేటి నాటకాలు యించుమించు ప్రొడక్షన్సు కాపీలే. నాటకంపుస్తకం పుచ్చుకుని ప్రారంభంచేస్తే ఆఖరయేవరకూ ప్రయోక్త లేమీ బాధపడనక్కర లేదు. ప్రయోక్తపనిని చాలా సులభతరంచేసి వేసిన యీ రచనలు నాటకప్రయో గంలో నారితేరినవారు వ్రాసినవి. ఈ రచనలలో (ప్రయో గానికి సంబంధించినంతవరకూ) ఒక్క పొల్లుకూడా వుండదు. కళ్ళుమూసుకు యథాతథంగా ప్రదర్శించి వేయవచ్చు. బాగా రక్తికడ్తాయి.

అనువైన నాటకా లెన్నుకోడానికి కొన్ని సూత్రాలు పాటించవచ్చు.

నాటకనిర్ణయ మేవొకరిద్దరి చేతుల్లోనూ పెట్టకూ డదు. అలాగని "పదిమంది వంటవాళ్ళుచేరి పాడుగొట్టిన పులుసు" మాదిరిగానూ చెయ్యకూడదు.

ఇతరవిషయాలతోపాటు యీ క్రింది ముఖ్యాంశాలు మనసులో నుంచుకుంటే నంతగా వాగ్వాదాలలోకి పోకుండానే పదిమందీ కలసి నాటకపు ఎన్నిక చేసుకోవచ్చు.

1. సమాజ ఆర్థికపరిస్థితి, స్తోమత.

ఆర్థిక స్తోమతులేని సమాజాలు, పురాణచరిత్రాత్మక నాటకాలజోలికి పోకూడదు. రంగస్థలాలంకరణకు యితర విషయములకూ ధనవ్యయ మెక్కువగా నుండ దనుకున్న నాటకాల్నే నిర్ణయించుకోవాలి.

2 నటీనటుల శక్తిసామర్థ్యాలు.

ఎవళ్ళని పలుకరించినా నేనో "ఆంధ్ర పృథ్వీరాజు" నంటాడు. తనకు తా నెంతో గొప్ప నటుణ్ణని యింటిదగ్గర కూర్చు నెంత యాలోచించినా ఫరవాలేదు. కానీ పదిమంది లోకీ వచ్చి నాకు ఫలానావేషం (సాధారణ గా హీరో) తప్ప మరోటివద్దనే వాళ్ళని మెల్లిగా సమాజంలోంచి తప్పించాలి. చిన్న నటులున్నారుగాని చిన్న పాత్రలు నాటకంలో లేవు. ప్రతి చిన్నపాత్ర కొక విశిష్టతవుంది. ఇది అర్థంచేసుకుని తనకు నచ్చినపాత్ర (అలా తోచనప్పుడు యితరుల సలహాను పాటించి) యెన్నుకున్న వాడు "మహానటుడు". అధికారమున్నదని ప్రతి నాటకంలోనూ 'హీరో' లేక ముఖ్యపాత్ర ధరించబూనటం మంచిది కాదు. తనకు నచ్చినపాత్ర యున్నదని సమాజంలోని యితర నటీనటుల శక్తిసామర్థ్యాలకు తగనిపాత్రలున్న నాటకాన్ని నిర్ణయించకూడదు.

3. ఎన్నుకోబోయే నాటకం ప్రేక్షకులను రంజింపజేయ గలదా?.

ఒకో తరహా ప్రేక్షకులకు కొన్నికొన్ని నాటకాలు నచ్చుతాయి. కొన్ని నాటకా లెంత గొప్ప శిల్పంవున్నా నచ్చవు.

4. ఎక్కువ మంది సభ్యులు యీ నాటకంవేపు మొగ్గుతున్నారా?

ఎక్కువ మంది యామోదించిన దాన్నాచరించా లన్న విధి వుండనే వుందిగదా.

5. మనకున్న సాధన సంపత్తి (Resources)తో నీ నాటకం వెయ్యగలమా?

ఈసూత్రాలవల్ల నాటకపు యెన్నిక సులుసూత్రంగా జరిగిపోతుందనిగాని, యీ సూత్రాలనుమించి మరేక లేవని కాదుగాని, నాటకపు టెన్నిక కీ సూత్రాలు కొంతవోహద కారిగా వుంటాయి.

ఈమధ్య క్రొత్త నాటకాలంటూ మన నాటకరంగం మీదికి రానోచుకున్నాయీ యంటే యవి యౌత్సాహిక నాటక సమాజాల మూలంగానేవచ్చాయి.

ఈ ఔత్సాహిక సమాజాల పేరెత్తినప్పుడు ప్రజా నాట్యమండలిని విస్మరించ లేం. ఏకున్న అంగబలం, తగు మాత్రపు ఆర్థిక స్తోమత మరేసమాజానికి లేవు. ఆంధ్ర దేశానికి నాటక మంటే యేమిటో మచ్చుచూపినవారు వీరు.

ఈ సంస్థలు మరోకొన్నాళ్ళు మనకుండా ననేక కోణాలనుంచి దెబ్బలుతగిలాయి. ఈ దెబ్బలలో నతి ముఖ్యమైనదీ, నన్ని ఔత్సాహిక సమాజాలకూ సాధారణంగా తగిలేదీ ముఖ్యనటులు సినిమావైపుకి మొగ్గటం! యేమయినా ఏకఆంధ్రనాటకరంగంలో నౌత్సాహికసమాజాల కాదర్శప్రాయంగా ప్రజానాట్యమండలి వివిధశాఖలను నడిపారు, అనేక క్రొత్తక్రొత్త నాటికలనూ నాటకాలనూ పరిచయంచేసారు.

నాటకప్రయోజనం వీరి ప్రదర్శనలలో సాధించిన ప్రాముఖ్యం మరేయితర సమాజాలు, యిచ్చిన మరేయితర ప్రదర్శనా సాధించలేదు. వీ రొక్కనాటకాన్నే కాక యనేక పాతకాలపురూపకాల్ని సంస్కరించి ప్రచారంలోకి తెచ్చారు. తతిమ్మావారంతా నుద్ధరించాలని దానంమటుకుచేసి వూరుకున్నారు. వీరు వుద్ధరించిచూపించారు. వాటిలో వుపజ్ఞప్రజ్ఞకూడా కనబర్చారు.

క్రొత్తనాటకాల్ని యెన్నుకుని ధైర్యంతో ప్రదర్శిస్తున్న నౌత్సాహిక సమాజాలను అభినందించాల్సిందే. అయితే యీసందర్భంలో ఓచిన్నవిషయాన్ని మనవిచేస్తాను.

ఏనాటకమయినా నది నా సమాజమెంబర్లలో ఒకరుగాని, లేక వారి చుట్టపక్కాలుగాని లేక నభిమానులుగాని వ్రాసినందువల్ల దాన్ని యెన్నికచెయ్యకండి. అందువల్ల ముందుముం దనేక చిక్కులు వస్తాయి. ఎవరో ఒకరు వ్రాసిన నాటకాలు ప్రదర్శించడానికే యేర్పడ్డసంఘాలు లేకపోలేదు. అది వేరేసంగతి.

ఎందుకూ పనికిరాని నాటకం మరొకాయనెవరో వ్రాసో వ్రాయించో తెచ్చి అది ఆడమని కూర్చుంటాడు. ఈపని అతను మరో దురుద్దేశ్యంతో చేసివుండడు కేవలం వుత్సాహాన్ని పట్టలేక చేసివుంటాడు. అయితే నది ప్రదర్శనకు ఏమాత్రమూ పనికిరాకపోవచ్చు. అలాగని యాతనికి చెబితే చిన్నబుచ్చుకుంటాడు. మంచివాడైతే యెంతకో వూరుకుంటాడు. లేకపోతే నాటకరచనమీదా సమాజపువ్యవహారాల మీదా నయినవాళ్ళదగ్గరా కానివాళ్ళదగ్గరా వుపన్యాసాలు ప్రారంభిస్తాడు. ఒక్కొక్క మహానుభావుడు సమాజవ్యవహారాలు స్థంభించే పరిస్థితికి తెస్తాడు.

ఒకసారి మా కిలాంటి యనుభవమే జరిగింది. సాధారణంగా నేనూ గంగాధరరావూ రచించిన నాటకాలు ప్రదర్శించేవాళ్ళం. ఒకమారు మరొక మిత్రుడు నాటిక నొకదాన్ని రాసుకొచ్చి యది వెయ్యాలన్నాడు. మా సమాజ మెంబర్లందర మించుమించు వొక కుటుంబంలా మెలిగేవాళ్ళం. అయినా ఆ రాసుకొచ్చిన మిత్రుడికి యీ రచన ప్రదర్శనానికి పనికిరాదని చెప్ప సాహసింపలేక పోయాం. కాగా పోర్షన్లు రాసుకొని రిహార్సల్సు ప్రారంభించాం. రిహార్సల్సులో యాతని రచనలోని లోపాలూ, ప్రదర్శనకు పనికిరాదన్న విషయ మాతను రెండు మూడు రిహార్సల్సులోనే తెలుసుకున్నాడు. "ఇది వెయ్యలేంరా బాబూ!" యని యూ పుస్తకం మర్నాటినుంచి తేవటం మానేశాడు. అప్పటినుంచీ

యిప్పటివరకు కతను మరిక రచన జోలికిపోలేదు. ఇప్పటి కతడో పెద్ద నటుడు. మా అందరికన్నా యెక్కువ నాటకాల్లో నటించాడు.

ఒకవేళ తప్పనిసరిగా తమ సమాజ మెంబర్లు వ్రాసుకొచ్చిన నాటకాలు ప్రదర్శించాల్సి వచ్చినప్పుడు యీ సమాజ సభ్యులు దాని యెన్నిక బాధ్యత వదులుకోవడం మంచిది. బయటనుంచి సలహాదారు పెద్దల్ని పిలిచి నాటకం వారికి బాగా పరిచయం చేసి వారి నిర్ణయానికి బద్ధులై నడుచుకోవడం మంచిది.

నాటకపు యెన్నిక విషయంలో ఆఖరి విషయమూ అతిముఖ్యమైన విషయమూ యేమిటంటే— ప్రేక్షకులను మనసులో పెట్టుకోకుండా నాటకపు నిర్ణయం చేయకూడదు. ప్రేక్షకులకోసమే నాటకాలు ప్రదర్శించేది. వారు మెచ్చుకోని ప్రదర్శనలిస్తూ యేసమాజ మూ ట్టకాలం నున లేదు. రెండు మూడు చెత్త ప్రదర్శనలిచ్చారంటే మరో దానికి వూరికే చూసేందుకు రమ్మని బలవంతం చేసినా యెవరూ రారు.

అలాగని ప్రేక్షకులు కోరేదిదేనని చెత్తంతా వారి నెత్తిన దిమ్మరించకండి. వార్ని చెడునాటకాల బారినుంచి మెల్లిమెల్లిగా తప్పిస్తూ మంచిప్రదర్శనలు చూసే నలవాటు చెయ్యండి.

ఏదన్నా క్రొత్తనాటకం ప్రేక్షకు లాదరణపొందక పోతె నాటకసే ప్రేక్షకులు మెచ్చుకొ లేర్తారనే నమ్మకంగల నాటక మొత్తాకని ప్రదర్శించండి. లేక మరొక క్రొత్తనాటక మెత్తుకని అది దెబ్బతిన్నదంటే మీ సమాజముకూడా దెబ్బ తింటుంది.

ప్రాతనాటకాలమీద వ్యంగ్యాలు (ఆమాటకొస్తే సినిమామీద చేసే వ్యంగ్యప్రదర్శనైనా సరే)నాయా నాటకాలు వాటి ప్రదర్శనారీతులు మీకు బాగా తెలిస్తేనే ప్రయత్నిం చండి.

ఒకర్ని లేక ఒక విషయాన్ని వక్రంగాచూపేటప్పుడు దాని యథార్థరూపం తూర్ణంగా తెలిసినవారే యాపని చేయ టాని కర్హులు.

మీ నాటకనిర్ణయములు పోంగానే ఆ నాటక రచ యితకు మీనిర్ణయం తెలియబర్చటమూ యాతని యనుమతి సంపాదించటమూ కనీసధర్మం. శక్తికొలదీ రాయల్టీ ముట్ట చెప్పటం వాంఛనీయం.

కాపీరైటు చట్టరీత్యా కాపీరైటు హక్కుదారు లను మతి లేకుండా ప్రదర్శనలుచేస్తే చిక్కున పడాల్సివస్తుంది. చట్టంమాట ఎలావున్నా మనం తననాటకం ప్రదర్శిస్తున్నా మని విన్నప్పుడు రచయిత మహదానందం పొందుతాడనేది జ్ఞాపక ముంచుకోవాలి. ప్రదర్శనకు ముందు తెలియబర్చలేక పోయినచో ప్రదర్శన లయినాకయినా తెలియబర్చటం విస్మ రించరాదు.

## ఔత్సాహిక నాటక ప్రయోగం

### (b) పాత్ర నిర్ణయము - నిర్మాత నియామకము

మీకు తగిన నాటకం నిర్ణయంచేసుకున్నారు. ఇక నిర్మాణం ప్రారంభించటానికి ముందు నిర్మాత నియామకమూ పాత్రనిర్ణయమూ జరగాలి.

నిర్మాతలక్షణాలు : మీసమాజంలో నిర్మాతకుండ వలసినలక్షణాలున్న సభ్యులు కొంతమందియుండనేయుంటారు. అలాంటివారు లేకపోతే బయటనుంచి ఎవరన్నా తెచ్చుకోవడం మంచిది.

బయటనుంచి ఒక అనుభవజ్ఞుడైన నిర్మాతను తెచ్చుకో లేని పరిస్థితిలోగాని, నిర్మాతకూడా నాటకంలో పాత్ర ధరిస్తున్నప్పుడుగాని, లేక మన నిర్మాత అంత అనుభవం లేనివాడైనప్పుడైనగాని కనీసం అప్పుడప్పుడన్నా నాటకప్రయోగం తెలిసిన పెద్దలను మీ రిహార్సల్సుకు ఆహ్వానించి వారి సలహాలు పొందటం చాలా అవసరం.

సర్వసమర్థుడైన నిర్మాతంటూ మీ సమావేశంలోనే యుంటే మీసమాజమంత యదృష్టవంతమైనది మరొకటిలేదన్నమాట.

'నిర్మాత' అన్నది మనకింకా వాడుకలో యున్నపదం కాదు సాధారణంగా యీ వ్యక్తిని మనం 'డైరక్టరు' అంటాం 'నిర్మాత' అంటే డబ్బు పెట్టుబడిపెట్టేవాడేనని మన

యర్థం, ఇది మనసినీమా ప్రపంచం మనకు ప్రసాదించిన అర్థం!

"నిర్మాత" డబ్బు పెట్టుబడి పెట్టేవాడు మాత్రమే కాక యనేక యితర బాధ్యతలు వహించవలసినవాడు. నటీనటుల నిర్ణయములో ఆఖరిమాట యతనిది. రిహార్సలు వగైరా నిర్వాహణకు జవాబుదారీ వహించాలి. నాటకం నిర్ణయమైన దగ్గర్నుంచీ రంగస్థలం ఎక్కి ఆఖరు తెలుపడేవరకూ అన్నివిష యాలలో ముఖ్య బాధ్యతంతా నిర్మాతదే. అతనికి సహాయ కులుగా డైరెక్టరూ వగైరాలను నియమించుకోవచ్చు.

'నిర్మాత' నండి 'డైరక్ట' రనండి 'సూత్రధారు' డనండి లేక మరేదన్నా యనండి. ఏమన్నా యీవ్యక్తియొక్క బాధ్యత చాలా యెక్కువ ఇతడు స్టేజిక్రాఫ్టులో మంచి యనుభవజ్ఞుడై యుండాలి, నాటకాలనూ అందరి పాత్రలను క్షుణ్ణంగా యర్థంచేసుకోగలవాడై యుండాలి. ఉన్నంతలో యవకాశాల నద్భుతంగా వినియోగించుకోగల నేర్పరై యుండాలి. ఇవన్నీవుండీ యోహ్మా పట్టుదలాగలనిర్మాత పేను రాణిస్తాడు. తన సమాజానికి మంచిపేరుప్రతిష్ఠలు తెస్తాడు.

తనను నిర్మాతగా నియమించమని యేవ్యక్తీ తనకు తానుగా కోరుకోనక్కరలేదు. ప్రతిభవున్న వ్యక్తిమీ దందరిదృష్టి దానంతట దేపడుతుంది. కాగా యీ భాధ్యత కూడా వంతులవారీ పంచుకునే సమాజాలు లేకపోలేదు.

ఒకరికన్నా యెక్కువమంది నిర్మాతకుతగ్గ లక్షణా లున్నవారు సమాజంలో నున్నప్పు డిది యాచరణీయమే

కాని కేవలం వంతులకోసమని మాత్రమే నిర్మాతలనుమారు స్తూండటం వాంఛనీయంకాదు. కాగా నిర్మాత విధుల్ని జాగ్రత్తగా చూసినేర్చుకుంటూ సమాజసభ్యులంతాకూడా నిర్మాణంలో నేర్పుసంపాదించుకోవచ్చు. కొన్ని పనులలో ప్రత్యేకప్రతిభ కనపర్చేవ్యక్తుల కాయాపనులు వప్పచెప్పాలి. వ్యక్తుల ప్రజ్ఞనుగుర్తించి వారికి తగు ప్రోత్సాహం యివ్వక పోతే వారు సమాజాన్ని విడిచివెళ్ళి పోటీసమాజాలు స్థాపించే యవకాశం వుంటుంది.

పోటీసమాజా లుండకూడదనికాదుగాని, యీ పోటీ యొక్కొక్కప్పుడు వెఱ్ఱితలలువేస్తోంది.

నిర్మాతకు నాటకంనడిపే పూర్తిహక్కు వుండాలి. కాగా అతడు యెక్కడన్నా నడ్డుత్రోవతొక్కితే పదిమందీ నది సరైందికాదని చెప్పవచ్చు అతను సర్దుకుంటే మంచిదే. లేకుంటే అతణ్ణి తొలగించాలి. కాగా రిహార్సల్సు చేసేటప్పుడుగాని నాటకప్రయోగానికి సంబంధించిన నిర్ణయాలు చేసేటప్పుడుగాని నిర్మాతదే పైచేయిగావుండాలి. పదిమందీ పదివిధాల చెప్పేకన్నా సమర్థుడైన ఒకడి నిర్ణయం చాలా మంచిది. పదిమంది నిర్ణయు మొకటైనప్పుడు మటుకు నిర్మాతే తలొగ్గటం మంచిది.

నాటకప్రయోగంలో నిర్మాత నియంతలామెలగాలి; కానీ కర్కోటకుడులాగుండరాదు. పదిమంది సభ్యుల అభిప్రాయాలకు అనుగుణంగా నడుచుకునేవాడుగా ఉండాలి; కానీ

తన అభిప్రాయం యేదో పదిమందికీ చెప్పిఒప్పించలేని "దూడూ బసవన్నా" రకం కాకూడదు. ప్రదర్శనలో వనేక కొత్తవిషయాలు ప్రవేశపెట్టగల నేర్పరై వుండాలి; కాని మనవేంచే స్తేయ దెఘనకార్యం తత్వంగలవాడై వుండకూడదు. ఇసుకలోనుంచి తైలం పిండగల నేర్పువుంచవచ్చు; గాని యెవరూ పనికిరారనీ, యెంత పనికిరానివారైనా తా సత్యమ్ముతంగా సరిదిద్దగలననీ ప్రగల్భాలు కొట్టకూడదు. సామాజికులలో వున్నశక్తి సామర్థ్యాలను మెచ్చుకుంటూ వాట్ని వృద్ధిచేయగల ప్రజ్ఞకలవాడై వుండాలి. నిర్మాత 'తోటమాలి' లా నటులను నాటకాన్ని వోర్పుతో పెంచు కుంటూ రావాలి. ఇతడు పరిశీలన (Observation) లో నిధియైవుండాలి.

పాత్ర నిర్ణయం:— పాత్ర నిర్ణయం కూడా పది మందీ కలసి చేయటమే మంచిది కాగా నిర్మాతకు కొద్ది మార్పులు చేసుకునే హక్కువుండాలి. రెండు మూడు రిహా ర్సల్సు జరిగాక ఈ మార్పులు చేసుకోవచ్చు. సిద్ధహస్తంగా పాత్రలను యెన్నుకోగల శక్తివున్న నిర్మాతమాటను పాత్ర లను పదిమంది కూడ కాదనలేరు.

సరిగ్గా యొకానొక పాత్రకుసరిపడ్డ వ్యక్తులు. ఔత్సా హిక సమాజాలతో వుండటం బహు అరుదు. కాగా సరికి జానెడు యటు యిటుగా పాత్రనిర్ణయం జరిగిపోవాలి. ఒక పాత్ర కచ్చుగుద్దినట్లు సరిపోయే వ్యక్తి మనకు దొరికే

లోగా తలిమన్నా పాత్రల కంతంతమాత్రంగా సరిపోయిన వారు కూడా లేకుండా పోయే చిక్కు సమస్యలు అనేకం అడ్డమువచ్చు. (ఈపరిస్థితి బదిలీలకు అవకాశంవుంటే వుద్యోగాలుచేసే సభ్యులుగల సమాజాలకు తటస్థిస్తూ వుంటుంది.) అందుచేత ఫరవాలేదనుకున్న వాళ్ళతో పని ప్రారంభం చెయ్యాలి. ఒక్కొక్కప్పుడు యిలా యెన్నుకోబడ్డవారే యసలాపాత్ర తమసొమ్మే నేలా తయారవుతూ వుంటారు.

పాత్రల నిర్ణయమప్పుడు సామాజికులంతా చాలా సమరసభావంతో మెలగాలి.

ఏదో యొకపాత్ర బాగుందని పదిమందీ దానికే యెగబడ కూడదు. తనకు సరిపోయే పాత్ర తనకన్నా తనశక్తి సామర్థ్యాల సర్థంచేసుకున్న యితరులకు యెక్కువ తెలుస్తుంది. అందుచేత యలాంటివారు యెంచిన పాత్రలను సంతోషంగా స్వీకరించాలి.

పాత్రల యెన్నికకు సూత్రాలు :— అనుభవంమీద ప్రతివిషయానికి సూత్రాలు పుడ్తూంటాయ్. అవే యెప్పుడూ పట్టుకు లాగుతూ కూచుంటే తెగివూరుకుంటాయ్!

కొందరు యొక విషయంలో యొక యభ్యుదయాన్ని సాధిస్తారు. అది ప్రాతదానిమీద మెరుగని నిరూపణ యవుతుంది. (అయినా కాకపోయినా అయిందనుకుందాం) ఇంత కన్నా యభ్యుదయకరమైనదాన్ని స్వీకరించడాని కటువంటి వ్యక్తులే వెనకడుగు వేస్తారు. ఇది చాలా తమాషాగానే

కనుపిస్తుంది. కానీ నా యనుభవంలో యిలాంటి వ్యక్తులు కలుసుకోవటం జరిగింది ఏ విషయమైనా నిత్య పరివర్తనకు దాసోహ మవుతు దన్న సంగతి గమనించాలి. ఆయా పరిస్థితులను బట్టి వచ్చే మార్పులు జరగకుండా ఆకట్టడం యెవరితరమూ కాదు.

పాత్రల యెన్నికలకు సూత్రాలమాట యెలావున్నా యీా యెన్నిక నొక తమాషా పద్ధతిమీద జరిగిపోతోంది ప్రస్తుతం.

ముఖ్య వ్యక్తికి ముఖ్యపాత్ర తప్పదు. అతనందుకు బొత్తిగా పనికిరాకపోయినా సరే! క్రొత్తవారికి యెవరికీ పనికిరాని పాత్ర లంతకన్నా తప్పవు.

స్త్రీ పాత్రలు పురుషులు ధరించే వెనుకటి రోజుల్లో నాటక సమాజ ప్రవేశం కలగాలంటే 'స్త్రీ' పాత్ర ధరించడాని కొప్పుకుంటే చాలు! స్త్రీ పాత్రలు స్త్రీలేధరించే యీా రోజులలో యేదో అనామక పాత్ర (అని నిర్మాతలు నిర్ణయించినది!) ధరించడానికి వొప్పుగుంటే చాలు

ఇక పాత్రల నెన్నిక చేసేటప్పుడు ముఖ్యంగా జ్ఞాపకం వుంచుకోవాల్సిన కొన్ని విషయాలు వున్నాయి. నటనలో ప్రజ్ఞ గలదని మనకు తెల్సినవ్యక్తి యే పాత్రకైనా పనికివస్తాడను కోడం భ్రమ. అలాగే ఒక వ్యక్తి ఒకరకం పాత్రలకుతప్ప పనికిరాడనుకోడంకూడా పొరబాటే.

పౌరాణిక చారిత్రాత్మకాలకు నెన్నికజరిగేటప్పుడు ప్రజలలో పాతుకుపోయిన నభిప్రాయాలననుసరించి శరీరపరిమాణాలు కలవార్ని ఎన్నుకోవాలి. భీమపాత్రకు సన్నని వార్ని సాధారణంగా నెన్నికచేతురు కానీ అర్జున నకుల సహదేవుల వేషా లించుమించు 12-16 సంవత్సరాల లోపు వాళ్ళ కిచ్చేస్తూంటారు. ఈ నకుల సహదేవుల్ని చూస్తుంటే వీరు ద్రౌపది భర్తలా అపారమైన కౌరవసైన్యాన్ని ఓడించిన మాటయెలావున్నా యెదుర్కొన్నవారా యనిపిస్తుంది. ఐతే వీళ్ళముందు (చిన్నగీతలముందు పెద్దగీతలా) భీముడుమటుకు బలే డాబుసరిగా వుంటాడు!

ఇలాటి పౌరాణిక వేషాలకు చక్కని యంగసౌష్టవం గల యాజానుబాహుల్ని యెన్నుకోవాలి. మీసాలకృష్ణులూ, అయిదడుగుల అర్జునులా ఆయాపాత్రలను బాగుగా మెప్పించిన రోజులు లేకపోలేదు.

ఇకపోతే సాంఘికనాటకాలలోకూడా యవయవసౌష్టవం కలవారు నటిస్తుంటే చూడముచ్చటగా వుంటుంది.

ఒక తరగతి పాత్రలను ధరించటానికి ఆతరగతికిచెందిన వారినే నెన్నుకోవడమనేది మరోసూత్రం.

ఉదాహరణకు ఒక జమీందారుపాత్ర : జీవితంలో పట్టుమని పదిరూపాయలు ఒక్కమారు చూడనివాని కివ్వొచ్చునా? ఇవ్వకూడదా?

ఇవ్వకూడదు; కానీ మనం అలా ఎన్నిక చేసిన నటుడు జమీందారుల ఆచారవ్యవహారాలు క్షుణ్ణంగా పరిశీలించి నటించగల ప్రజ్ఞ వున్నవాడని తెలిస్తే ఆపాత్ర కళ్ళుమూసు కుని యతనికివ్వచ్చు.

ఇలాగే వృత్తిపాత్రలు : దర్జీ, డాక్టరు, లాయరు వగైరావగైరా. నటుడు వస్తుతః ఆవృత్తి కలవాడు కానక్కర లేదు కానీ వృత్తిలోని మెళుకువలు పాత్రకు అవుసరమైనంత వరకూచూసి నేర్చుకోవాలి.

నటుడికి కావలసింది ఊహ Imagination దీనికి తోడు ప్రపంచానుభవం వున్నవాడు వుత్తమనటుడు అనిపించు కుంటాడు

సాధారణంగా దుర్మార్గపాత్రలు ధరించేవారు సాధు పాత్రలు ధరించటం కష్టం మాయలఫకీరు పాత్ర అద్భుతంగా ఒప్పించిననటుడు హరిశ్చంద్రపాత్రధరించి వల్లకాటిసీనులో కన్నీరొలికించడం క్యారక్టర్ యాక్టింగ్ అనిపించుకోదు. కాగా దుష్టబుద్ధి, దుర్జయపాత్రలనూ హరిశ్చంద్రపాత్రనూ కూడా సమానప్రతిభతో నటించిన మహానటులు లేకపోలేదు. పాత్రల ఎన్నికకు సంబంధించినంతవరకూ మనకున్న వ్యక్తు లను దృష్టిలో ఉంచుకొని నెక్స్టబెస్ట్ సూత్రాన్ని పాటించు కుంటూ నిర్ణయాలు చేసుకోవాలి.

ఇంచుమించు ప్రతిష్టాత్మాహిక సమాజానికీ పెద్దసమస్య స్త్రీపాత్రలు నిర్ణయించటం. ఈస్త్రీపాత్రలకయ్యే వ్యయు

ప్రయాసలతో పోల్చిచూస్తే ఫలితాలు చాలా నిరాశాజనకంగా ఉన్నాయి. స్త్రీపాత్రలకు తగు నటీమణు లందుబాటు రుసుములో లభ్యంకాక కొన్నికొన్ని నాటకాలప్రదర్శనే మానుకోవలసివస్తోంది. నాటకానికి యేఖర్చులో ఎక్కువ భాగం స్త్రీపాత్రలక్రిందే వ్యయమయిపోతుంది.

ఈ బాధలన్నీ పడలేక అసలు స్త్రీపాత్రలే లేకుండా కొన్ని నాటికలు ప్రచురితమవుతున్నాయి. మళ్ళీ స్త్రీపాత్రలు పురుషులు ధరించాలనే ఉద్యమంకూడా తలెత్తుతోంది.

మంచీ చెడూ ప్రతివిషయంలోనూ వుంటాయి. ఫలితాలు ఆ మంచిచెడ్డలపాళ్ళకు బట్టి యుంటాయి. ఇది ఇంతేనని యేవిషయమూ నిర్ణయించలేం. నాటకాలలోని అనేకజాత్రల రూపాంతరాలు పొందాయి. ఇక పొందుతాయి దీన్ని ఎవరూ ఆపలేరు.

## ఔత్సాహిక నాటక ప్రయోగం

### (c) రిహార్సల్సు (నాటక శిక్షణ):

నిర్మాత నియామకమూ పాత్రధారుల యెన్నిక యిపోగానే యిక రిహార్సల్సు ప్రారంభించవచ్చు.

ఈ రిహార్సల్సు ప్రారంభించేముందు నిర్మాత నాటకాన్ని పూర్తిగా చదవాలి. ఏదో మామూలుగా చదివేస్తే చాలదు.

నిర్మాత రచయిత ప్లాటును నిర్దుష్టంగా బహు జనామోదకరంగా తన సమాజం ప్రదర్శన చేయగలందులకు బాధ్యుడై యున్నాడు. ఈ బాధ్యత విస్మరించరానిది.

ప్రదర్శించబోయే నాటకాన్ని నిర్మాత క్షుణ్ణంగా చదివి అర్థంచేసుకోవాలి. నాటకంలో లోటుపాట్లుంటే (సన్నివేశాలు గాని, సంభాషణలు గాని, మరేవిషయంగాని) రచయిత యనుమతితో తగుమార్పులు చేసుకోవచ్చు.

నిర్మాతకు నాటకం కరతలామలకమై పోవాలి. పాత్రధారులు వివిధ పాత్రలను యెలా మననం చేసుకుంటారో నిర్మాత నాటకాన్నంతటిని నలా మననం చేసుకోవాలి. రచయిత ముఖ్యోద్దేశ్యాలూ, యెక్కడెక్కడ క్లైమాక్సు వస్తాయి రాలున్నదీ జాగ్రత్తగా గమనించి నోట్సు వ్రాసుకోవాలి.

రిహార్సల్సుకు పోయేముందు నాటకంలో నిర్మాత కర్థంకాని పాత్రగాని, సంభాషణగాని, సన్నివేశంగాని వుండకూడదు ఆయా సందర్భాలలో వ్రాయబడ్డ సంభాషణలు యెందువల్ల యీ విధముగా వ్రాయబడ్డదీ క్షుణ్ణంగా చెప్పగలిగి వుండాలి ఒక్కమాటలో చెప్పాలంటే నాటకమాడుతున్న రోజున ప్రదర్శన యేపంథాలో యుంటుందో యతని మనోఫలకము మీద ముద్రింపబడాలి. అయితే యీ ముద్ర యప్పుడే ఖాయమవకూడదు.

తను అనుకున్న విషయాలు కొన్నికొన్ని తీరా రిహార్సల్సులోలోప భూయిష్టంగా నిరూపించబడవచ్చు. కొందరి

కొందరి పాత్రలు పాత్రధారల తీరుతెన్నులబట్టి మరోలా మలిస్తే బాగుండవచ్చు. అందుచేత తను మొదటనుకున్న విధంగాగాక కొన్నికొన్ని మార్పులు సంభవం కావచ్చు.

మంచినిర్మాత తోటమాలివంటివాడు. నాటకనిర్మాణాన్ని మంచి తోటను పెంచుకువచ్చినట్లు పెంచుకురావాలి.

ఎన్నుకున్న నాటకానికి నిర్మాత ప్రొడక్షను కాపీ (లేక ప్రాంప్ట్ కాపీ) నొకదాన్ని తయారుచేసుకోవాలి.

రెండు అచ్చుపుస్తకాలుకొని యొక నోటు పుస్తకం మీంది కుడిచేతివైపు పుటలలో నతికించుకుంటూ పోతూ యెడమవైపు పుటలపై నోట్సు వగైరాలు వ్రాసుకోడానికి తెల్ల కాగితాలను ఖాళీగా యుంచేయాలి. లేక, ఒకే అచ్చు పుస్తకాన్ని కొని దాన్ని యూడదీయించి ప్రతిపేజీకి మధ్య అవసరమైనన్ని తెల్ల కాగితా లమర్చి తిరిగికుట్టించి బైండు చేయించుకోవచ్చు. ఈ పుస్తకం నిర్మాతకి చాలా అవసరం. అతనికి అప్పుడప్పుడు మెరుపులా మెరిసే విషయాలు అక్కడికక్కడ నోట్సు వగైరాలు వ్రాసుకోడానికి, స్టేజియేర్పాట్లు, పరికరాల లిస్టులూ వ్రాసుకోడానికీ ఈ పుస్తకం బాగా యుపయోగిస్తుంది.

ఓ మూలనుంచి నిర్మాత యీ విధంగా తయారవుతుంటే పాత్రధారులుకూడా తమతమ పాత్రలను క్షుణ్ణంగా అర్థంచేసుకుంటూ చదువుకోవాలి. వీరుకూడా తమ పోర్షను పుస్తకంలో తమకు తోచినవిషయాల నోట్సు పెన్సలుతో

వ్రాసుకోవాలి. మరీ క్రొత్తవారైతే యేమటుకు నిర్మాత చెప్పనిదే అసలు పోర్షను చదవడమే మానుకోవడం మంచిది. యేదన్నా తప్పులు యేర్పాటు మార్పు లేవనూ అనుకోకుండా యిలవడిందా యిక పిచ్చి దిద్దటం బ్రహ్మాప్రళయమౌతుంది.

పోర్షను కాపీలో క్యాచ్ వర్డ్సు లేక క్యూస్ (Cues) వ్రాసుకోవడం చాలా మంది కలవాటు. అలవాటేమిటి? ఇది స్థిరయింపబడ్డ విధికూడాను. కాని యిది చాలా చెడ్డ అలవాటయితే. కొందరు నటులు ప్రక్కపాత్ర చెపుతున్న మాటలు వినకుండా యేమాత్రమూ రియాక్షను చూపకుండా దీపస్తంభాలలా నుంచోడానికి కారణం కొంత వరకూ యీ దురలవాటే.

క్యాచ్ వర్డ్సు సహా తనపోర్షను కంఠస్థం చేసిన నటుడు క్యాచ్ వర్డ్ ప్రక్క పాత్ర నోటినుంచి యెప్పుడు వినిపిస్తుందా యని వినిపించి వినిపించగానే తనపాఠమెప్పుడు వప్పచెప్పటమా యనే ధ్యాసలో నిలబడిపుంటాడు ప్రేక్షకులిది దీపస్తంభ మనుకుంటారు.

నేను తయారు చేసిన నాటకాలను క్యాచ్ వర్డ్సు లేకుండా పోర్షన్లు వ్రాసి యిచ్చేవాడిని. వీలయితే మొత్తం నాటకం లేకపోతే అథవా యీ పాత్ర వచ్చినప్పుడు జరిగే పూర్తినాటకం (ఆ పాత్రకు సంబంధించినంతవరకూ) వ్రాసి యిచ్చేవాడిని. ఏ సందర్భంలోనూ క్యాచ్ వర్డ్సు వ్రాసిన పోర్షన్లెవరికీ యివ్వరాదనే నియమం పెట్టుకున్నాను.

నాటక భావమూ ప్రక్క పాత్రల సంభాషణల తీరూ తెలుసుకుంటే క్యాచ్‌వర్డ్సును గుర్తించాల్సి బాధపడనక్కర లేదు.

క్యాచ్‌వర్డ్సు కంఠతాబట్టినవారినటన చాలా హాస్యాస్పదంగా వుంటుంది. ప్రక్కపాత్రలు చెప్పేమాటలు గమనించడు. దృష్టి క్యాచ్‌వర్డ్సుమీదే కేంద్రీకరిస్తాడు. కర్మం కాలి యీ క్యాచ్‌వర్డు మధ్యలో వచ్చిందో పుటుక్కున సంభాషణల మధ్యలోనే యితరపాత్ర గొంతుక నొక్కేస్తాడు. ఇక యసందర్భపు సంభాషణలతో నాటకం నడవాల్సివస్తుంది. అందుచేత కంఠతా పట్టవలసినది ప్రక్కపాత్రల క్యాచ్‌వర్డ్సుకాదు. వారి సంభాషణలలోని భావం, తన సమాధానాలు క్షుణ్ణంగా తెలిసిన నటుడు తానిదివరలోనీసంభాషణలు చదివి కంఠస్థం చేసినాననే భావన కలుగనీయకుండా నప్పటికప్పుడు సంభాషణలు జరుగుతున్నట్లు నటించగలుగుతాడు.

సంభాషణలు శరవేగంతో నడుస్తూ యే యొక్కపాత్రా తడుముకోకుండా సంభాషించాల్సిన పరిస్థితుల్లోనూ యెదుట పాత్ర సంభాషణ యతని నోటిలోనే తుంచేసి తన సంభాషణ నందుకోవలసిన చోట్లలోనూ క్యాచ్ వర్డ్సు కంఠతా పట్టాలి. ఈ సందర్భాలలో కూడా క్యాచ్‌వర్డ్సు మాత్రమేగాక సంభాషణ (సాధారణంగా యిలాంటివి కురచగానే వుంటాయ్.) అంతా కంఠస్థం చేయటం మంచిది.

నటుడు తన పార్టుపుస్తకంలో పెన్సలుతో తనపాత్రకు సంబంధించినంతవరకూ తనస్వంతవ్యూహాలూ, మాండ్యులేషను వగైరాలు నోట్సు వ్రాసుకోవచ్చు. పెన్సలుతో యని యెందు కనాల్సొచ్చిందంటే, యన్ని విషయాలలోనూ ఆఖరిమాట నిర్మాతదని ఒప్పుకున్నప్పుడు, మన వ్యూహాలు యతని వ్యూహాలతో వ్యతిరేకించినప్పుడు మనం వ్రాసుకున్న నోట్సుపనికి రాకపోవచ్చు. యప్పుడవి పెన్సలుతో వ్రాసుకున్నవైతే చెరిపేసుకోవచ్చు.

నాటకపు నిర్ణయమూ, నిర్మాత నియామకమూ నటుల యెన్నికయైనాక పైచెప్పినవిధంగా వ్రాతకోతలకు సంబంధించిన ప్రాథమిక వ్యవహారం ముగియగానే రిహార్సల్సు ప్రారంభించుకోవచ్చు.

ఔత్సాహిక సమాజాలు రిహార్సల్సు నడపటం చాలా కష్టం. అనేక వృత్తులలో వున్నసభ్యులు వీళ్ళు కలిగించుకొని రిహార్సల్సుకు టైముకురావాలి. ఇది అనుకున్నంత తేలికైన పనికాదు.

అప్పుడప్పుడు కారణాంతరాలవల్ల యనుకున్నటైముకు రిహార్సల్సుకు రాలేనివారిమీద కొంతసానుభూతి చూపవచ్చు. కానీ కొందరికి యిది దురలవాటుక్రింద మారుతుంది. రోజూ యేదోయొకసాకుదొరుకుతూంటుంది! యాలస్యంగానో యసలు రాకుండానోవుండటానికి. ఇలాంటివారు తమనుయిరకాటంలో పెట్టుకుని యితరులను కూడా యిరకాటంలో పెడ్తున్నారన్న

మాట. రిహార్సల్సుకు సకాలానికి రాలేనివాళ్ళూ, యసలు రాలేనివారూ ఔత్సాహికనాటకాలలో పాల్గొనడం విరమించు కోవడంమంచిది. మీరు మంచిఅనుభవంకల నటులేయవచ్చు. ఒక్క రిహార్సలు లేకుండా (ఆమాటకువస్తే అసలు పుస్తకం గాని, పోర్షనుగాని చూడకుండానే!) రంగంయెక్కి సభికులను రంజింపజేయగల ప్రజ్ఞాశాలురుకావచ్చు! కానీ యిది ఔత్సా హికనాటకం అని మరువకండి. ఈ ప్రదర్శనలో అనేకమంది క్రొత్తవారు పాల్గొంటూండవచ్చు. వారికీ మీకూ కాంబినే షను మొదట్నించీ చూసుకోకపోతే రంగస్థలంమీద ప్రదర్శన నాడు వారు చెడడమేగాక మిమ్మల్నికూడా చెడగొడ్తారు.

అంతాఅయినాక "చేతకానివాళ్ళని రంగంమీదికి యెవడ్రమ్మన్నాడయ్యా?" అని మీరే డబాయిస్తారు. (మరి మీకుకాస్తప్రాతపేరుందిగా! అందుకని) కానీ నిజం ఆలోచిస్తే లోపంమీది.

లోపం యెవరిదైనా చెడేది ప్రదర్శన. అపకీర్తి సమాజానికి.

మొదటిరోజున రిహార్సల్సులో పాల్గొనేవారంతా తమ తమ పాత్రలు నాటకక్రమంలో యొకమారు చదివెయ్యాలి. ఒక్కొక్కప్పుడు నిర్మాతే పుస్తకమంతా మొదట్నించీ చివరి దాకా యెవరెవరు మాట్లాడాలీ అనేసూచన ధ్వనిస్తూ చదివే స్తాడు. ఈ పద్ధతికన్నా మొదటిపద్ధతి చాలామంచిది.

మొదటి పద్ధతిలో నిర్మాత తానిదివరకు యాలోచించని కొన్నికొన్ని యమూల్యాభిప్రాయాలు లభించవచ్చు. పైగా పాత్రధారుల శక్తిసామర్థ్యాలు మొదటిమాటే చూసేసుకుని అందుకు తగువిధంగా వారినో లేక నాటకాన్నో మలుచుకుంటూ పోవచ్చు.

రెండవపద్ధతిలో నిర్మాతయొక్క స్వంతఊహాలూ శక్తి సామర్థ్యాలూ నటులమీద ముద్రపడే యవకాశం వుంది. ఇది ఒకొక్కప్పు డన్నిపాత్రలమీదాపడి నాటకం Stale గా ఏక పాత్రాభినయంగా తయారయే అవకాశం వుంది. నిర్మాత జాగ్రత్తపడాల్సినచోటు యిక్కడే. తన నటన వాచికం వగైరాలు యెవరూ తుక్కికిముక్కగా అనుకరించ కుండా జాగ్రత్తపడాలి ఇది మన సమాజాలలో లోపి స్తోంది. కాగా అంతక్రొత్తవారే సభ్యులుగాగల సమాజంలో నిర్మాతే నాటకమంతా మొదట్నించి చివరివరకూ చదవడం మంచిది

యీవిధంగా ఒకటి రెండుసార్లు ప్రాథమిక పఠనం పూర్తికాగానే నిర్మాత తను యిదివరకు వ్రాసుకున్న వీ మొదటి రిహార్సలు గమనించి యిప్పటికప్పుడు వ్రాసుకున్నవీ నోట్సు అవసరమైనంతవరకూ చదివి వినిపించాలి విభిన్నాభిప్రాయా లుంటే సమరసభావంతో తర్కించుకొని ఒక నిర్ణయానికి రావాలి. ఈప్రథమ పఠనాలులో నటీనటుల శక్తిసామర్థ్యాలు చాలావరకూ తెలిసిపోతాయికనుక ఒకమాదిరి రిహార్సలు పెడ్యూలు (టైమ్‌టేబిలు) తయారుచేసుకోవాలి.

నాటకం చక్కగా ప్రదర్శనయోగ్యత పొందేందుకు, నిర్ణయించుకున్న ప్రకారం విధిగా రిహార్సల్సు నడిపితీరాలి.

ఔత్సాహిక సమాజాలలో వుండే పెద్దలోపం ఏమిటంటే, "నాటకం చక్కగా తయారుచేద్దాం" అని యమితోత్సాహంతో ప్రారంభించి కొంతదూరంపోయి "ఊ కానీలే ఎలాగోలా దీన్ని గట్టెక్కించి పారేద్దాం" అని ముగిస్తారు.

మీరు మరో అభిమానవృత్తి చేదన్నా స్వీకరించి అది సరిగా నిర్వహించలేనప్పుడు "నష్టపోతే పోయానులే" అని తెలగరేసుగ ఊరగిపా యెవరూ యేమీ అనుకోరు. నటన అభిమానవృత్తిగా స్వీకరించి మీరలా ప్రవర్తింపచూడటం సాహసం

ఈ అభిమానవృత్తి (నటన) మీరు సరిగా నిర్వహించనప్పుడు, బాధా నష్టమూ మీ ఒక్కరితో అంతం కావు. ప్రదర్శనరోజున అనేక వేల కళ్ళు మిమ్మల్ని చూస్తూంటాయ్. మీరు మీ పాత్రను సరిగా నిర్వహించలేకపోతే ఆ కళ్ళుగల ఆసామీలందరూ తమను రెండు గంటలు కూచోబెట్టి బాధబెట్టినందుకు మిమ్మల్నీ మీ నాటకాన్నీ ఆడిపోసుకుంటారు

మీరు గొప్ప ప్రదర్శన ఇవ్వలేకపోవచ్చు, కాని పోర్షను సరిగా కంఠస్థం చెయ్యకా, ఒకళ్ళతో చెప్పవలసిన సంభాషణ మరొకరితో చెప్పే ఉపభ్రంశాలు చేస్తుంటే చూస్తూ సహించటం కష్టం. ఈ లోపాలకు కారణం సరైన రిహార్సల్సు లేకపోవడమే

“ఈ క్ట్రే యోకంకీ యనుకోకంటా కొనుపలు పెట్టాం, సరిగా పోర్షన్సూ రాలేదు. రిహార్సల్సు పడలేదు” యని ప్రదర్శన ఖరా బయినాక చెప్తూకుంటే విని సంతోషించే వారుండరు. ముఖప్రీతికి చప్పరించేసి ‘పోనీలే’ అన్నా “యను కోకుండా ప్రదర్శించమని వీళ్ళని ప్రార్థేయ పడిందెవరు?” యని నవ్వుకుంటారు మీరు లేకుండా చూసి.

రిహార్సల్సు సాధ్యమైనంత వరకూ స్టేజిమీద ప్రదర్శనలాగే జరగాలి. చివరిస్టేజస్‌లో కూడా రిహార్సల్సులో పుస్తకాలు పుచ్చుకుకూర్చుని పోర్షన్‌లు చెప్పే దురలవాటు చాలా సమాజాలలో చూస్తున్నాను. ఇది క్షమించరాని దారుణాపరాధం.

ఒక్క నాటకానికి కెన్ని రిహార్సల్సు కావాలని యిదమిద్ధంగా తేల్చిచెప్పటం కష్టం. ఈ విషయ మాయా సమాజాల వీలుచాళ్ళనుబట్టి నిర్ణయించుకోవాలి. సాధారణ నాటకానికి మామూలుగా 20 రిహార్సల్సూ, నాటికలకు 10 రిహార్సల్సూ సరిపోవచ్చు.

రిహార్సల్సు యెక్కువ వ్యవధి లేకుండా పెట్టుకోవాలి. వీలుంటే రోజూ పెట్టుకోవడం మంచిది అయితే యీాత్సాహిక సమాజికులకు తమవృత్తి చేసుకున్నాక రోజూ రెండు మూడుగంటలు రిహార్సల్సులో గడిపే యోపికా తీరుబాటూ కూడా నుండకపోవచ్చు. అందుచేత నాల్గొక్క రోజులో నాల్గొక్క సీను, లేక కొన్ని పాత్రలు మాత్రమే రిహా

ర్సల్సు చేస్తూ యిప్పుడప్పుడు పూర్తినాటకం రిహార్సల్సు చేసుకోడము మంచిది.

ఈవిధానంలో నటులందరూ ప్రతిరోజూ రిహార్సల్సుకు హాజరవాల్సిన యవసరం యుండదు. నిర్మాత చాలా సూక్ష్మంగా ప్రతినటుడ్ని పరిశీలిస్తూ ప్రత్యేకశ్రద్ధతో వారి వారికిశిక్షణయిచ్చేయవకాశంకూడా యెక్కువగాయుంటుంది.

ఈ క్రింది టైంటేబిలు కొంతవరకూ యేనాటకానికైనా యుపయోగపడవచ్చు. రిహార్సల్సు ఈ క్రమములో జరగటం మంచిది.

1. నాటకం ఒకమారు చదివెయ్యటం. వివిధపాత్రలను గురించీ సన్నివేశాలనుగురించీ చర్చ.
2. నాటకం రెండవమారు చదవటం. వెనుకటి నిర్ణయాల ఆచరణ.
3. పాటలూ పద్యాలూవుంటే వాటి మట్లు (ట్యూన్స్) నిర్ణయం మొదటి సాధన.
4. మొదటిరంగం (ఆరంగంలోని అందరునటీనటులతో)
5. రెండవరంగం (ఆరంగంలోని అందరునటీనటులతో)
6. మొదటిరంగం (లోపాలున్న నటీనటులకు ప్రత్యేకం పాటలూ, పద్యాలూ.
7. పైమాదిరే.
8. రెండవరంగం (అందరూ) పాటలూ పద్యాలూ.
9. మూడవరంగం (అందరూ)

10. మూడవరంగం (లోపాలున్న నటులు మాత్రం) పాటలూ, పద్యాలూ.
11. పూర్తి రిహార్సల్సు.
12. లోపంగా యున్న రంగం (అందరు నటీనటులూ)
13. లోపంగా యున్న మరో రంగం (వీటో)
14. లోపంగాయున్న మరోరంగం లేక పై వాటిలోదే యొకటి (అందరు నటీనటులూ)
15/16. పాటలూ పద్యాలూ పూర్తి ఆర్కెస్ట్రాతో
17 ముత్తం నాటకంమీద లోపంవున్న సన్ని వేశాలు.
18. పూర్తి రిహార్సల్సు (16 మాదిరి)
19. పూర్తి రిహార్సల్సు సెటో
20. డ్రెస్ రిహార్సల్సు

పై కాల్‌షీటు మూడురంగాల నాటకం ప్రాక్టీసుకు గాను తయారు చెయ్యబడ్డది ఇది ప్రామాణికంగా తీసుకోనక్కర లేదు ఇంతకన్నా బాగా మీరు ప్రోగ్రాము వేసుకోగలిగితే మరీమంచిది ఒక వేళ మీరు ప్రదర్శింపబోయే నాటకం మూడు రంగాలకు మించి ఉంటే తదనుగుణంగా 20 కాల్సులోనే ప్రోగ్రాము వేసుకోడం మంచిది. ఏమైనా 30 కాల్సును మించనిస్తే సభ్యుల వుత్సాహం తగ్గిపోవచ్చు. మనం ఎన్ని రిహార్సల్సు వేశాం అన్నదికాదు కావల్సినది. ఆ వేసినవి యెంతచక్కగా నిర్వహించాం అన్నది. పది కాల్సులో 'ప్రతాపరుద్రీయం' నాటకం చూడముచ్చటగా ప్రదర్శించిన సమాజాన్ని నేను యెరుగుదును.

ఔత్సాహిక సమాజాలలో పూర్తి రిహార్సల్సు జరగటమే అంతంతమాత్రం. ఇక డ్రెస్ రిహార్సల్సుకూడానా? యేమైనా యిది ప్రయత్నించటం మంచిది. అథవా మీకు ప్రదర్శన యివ్వబోయే రంగస్థలంమీద పూర్తిరంగాలంకరణతో ఆఖరు రిహార్సల్సు చెయ్యటం మంచిది.

చారిత్రాత్మక నాటకాలూ పౌరాణిక నాటకాలూ వేసేటప్పుడు విధిగా డ్రెస్ రిహార్సల్సు చేసితీరాలి లేకుంటే అలవాటులేని ఆదుస్తులూ, గడ్డాలూ, మీసాలూ. కిరీటాలూ, భుజకీర్తులూ, కత్తులూ, డాళ్ళూ మీకు రంగస్థలంమీద అడుగడుగునా అడ్డంవస్తాయి. ఒరలోనుంచి కత్తిదుయ్యబోయి వ్రేలు తెగేసుకోవచ్చు, లేక దుస్తుల్ని (కొంగును) అందులో యిరకబెట్టి యెంతప్రయత్నంచేసినా ఒరలోనుంచి కత్తిరాక, కత్తిదాసితో పాటు ఒరా అధికట్టిన పటకా యింకా యింకా కర్ణుడి రథచక్రంతో పాటు పైకొచ్చిన భూమీ వగైరాల్లా రావచ్చుగాని కత్తిమాత్రం ఊడిరాకపోవచ్చు. పంచెకుచ్చిళ్ళు కాళ్ళకు అడ్డంపడి మీరు నరకబోయిన పాత్ర కాళ్ళముందు మీరేసాష్టాంగపడవచ్చు.

ఈ దుస్తులూ పరికరాలతో బాగా పరిచయంచేసుకోకపోతే ప్రదర్శననాడు అపహాస్యంపాలుకావడానికి చాలా వీళ్ళున్నాయి.

రిహార్సల్సులో మెలగవలసిన విధానాలూ వగైరా పెద్దగా యిక్కడ యేకరువుపెట్టనక్కరలేదు. ఐతే మళ్ళీ ఓమారు జ్ఞాపకం చేస్తున్నాను.

అనుకున్న టైముకు రావలసిన ప్రతివారూ వచ్చితీరాలి. నిర్మాత యీవిషయంలో ఆదర్శంగా మెలగాలి. అనుకున్న టైముకు అరగంటముందువచ్చి అంతా అయిపోయినాక వెళ్ళి పోవాలి. రిహార్సల్సుకు టైముకు రాకపోతే (ఒక్కరు రాక పోయినా) షెడ్యూలులో పెద్ద డిసెలావేషను ఏర్పడుతుంది. రిహార్సల్సు నాటకానికి చాలా ముఖ్యం. ఒక్కరు ఆలస్యంగా వచ్చినా ఆనాటి కవి జరక్కుండా పోయే అవకాశం వుంది. అందుచేత అనుకున్నప్రకారం రిహార్సల్సన్నీ జరిపితీరాల్సిన బాధ్యత ప్రతి ఒక్క నటుడిమీద వుంది.

రిహార్సల్సు జరిగేటప్పు డెవళ్ళిష్టం వచ్చినట్లు వాళ్లు మాట్లాడ కూడదు. రిహార్సల్సులో తమకు పనిలేని పాత్ర ధారులు మాట్లాడకుండానన్నా కూర్చోవాలి, లేకపోతే బైటికి నిష్క్రమించి మరోచోట కూర్చుని మాట్లాడు కోవాలి.

రిహార్సల్సు 'అవసరంలేని అతిధులు' తరుచు వస్తూం డటం అంత మంచి పద్ధతి కాదు. తప్పనిసరిగా రావాలనివస్తే వారు సత్ప్రవర్తనకు వారిని తీసుకువచ్చినసభ్యులు జవాబు దారి వహించాలి. సాధ్యమైనంతవరకూ యితరుల్ని రిహా ర్సల్సుకు రానివ్వకపోవడమే మంచిది.

మనకున్న పాతికమంది సభ్యులేకాక మరోపదిమంది పోగై సలహాదారులై మన మతికాస్తా పోగొట్టవచ్చు. నిరు త్సాహ పరచవచ్చు. లేనిపోని ప్రచారాలు చేయవచ్చు.

ఏవన్నా జరగవన్నా. స్త్రీలు కూడా సమాజంలో వున్న ప్పుడూ వారితో రిహార్సల్సు చేస్తున్నప్పుడూ యీ విష యంలో మరీ కట్టుదిట్టంగా వుండాలి.

రిహార్సల్సు సాధారణంగా వచనమంతా అయిపోయి నాక పాటలూ పద్యాలూ పెట్టుకోడం మంచిది. లేకపోతే ప్రతి వారు పాడటానికి ప్రయత్నించి కాలయాపన జరిగిపోతుంది. కాగా పాటలూ పద్యాలూ, నేపథ్యసంగీతం వగైరాలున్న ప్పుడు వాటిని ప్రత్యేక శ్రద్ధ తీసుకొని ప్రాక్టీసు యివ్వాలి. సంగీతం లేకపోయినా ఫరవాలేదుగాని వున్నప్పు డపశృతి సంగీతం పనికిరాదు. చక్కగా వినసొంపుగా వుండితీరాలి.

నిర్మాత ప్రతినటుడికి తనెప్పు డెక్కడనుం చేవిధంగా రావాలి, యెప్పు డెటునిష్క్రమించాల్సిందీ మొదలగు వివరా లన్నీ వ్రాసి యివ్వాలి. లేక మొదటి రెండవ రిహార్సల్సులో నటుడన్నా నోటు చేసుకోవాలి.

రంగస్థలం యొక ప్రక్క లోపలగానూ, మరోప్రక్క బైటగానూ, నిర్ణయించుకుని ఆ యా సందర్భాల ప్రవేశ నిష్క్రమణలన్నీ యథావిధంగా జరిపించాలి. ఒక్కొక్క ప్పుడు వెనుకతట్టును బయటగా వ్యవహరిస్తారు. చక్కని రంగాలంకరణతో నీపద్ధతి చాలా బాగుంటుంది. ఈ పద్ధతిలో రంగస్థలపు రెండు ప్రక్కలూ లోపలిభాగంగా వ్యవహరించు కోవచ్చు.

పోర్షను కంఠస్థం చెయ్యటం : లేన పాఠం (పోర్షను) కంఠస్థం చెయ్యటం యనేది ఔత్సాహిక నటులకు పెద్దసమస్య. జ్ఞాపకశక్తిలో యద్భుతప్రజ్ఞ (ఫోటోగ్రాఫిక్ మెమొరీ) గల వారికి యిక్కడ చెప్పవలసినది యేమీ లేదు. వారు మొదటి రెండుమూడు రిహార్సల్సులోనే పోర్షను కంఠస్థం చేసేస్తారు.

పోతే కొంతమందికి యెన్నిసార్లు చదివినా పోర్షను రాదు. ఈ విషయంలో కొన్ని సూచనలు ఇస్తాను.

మీ పోర్షను మొదటిమారుగా వ్రాసి మీరు చదివి కంఠస్థం చెయ్యవద్దు. మొదటి రెండురిహార్సల్సు యనంతరం కంఠస్థం చెయ్యటం ప్రారంభిస్తే మంచిది. మొదటే మీరు తప్పుడు పాఠం కంఠస్థం చేస్తే యందులోవచ్చే లోపాలు ముందు ముందు సర్దుకోడం చాలాకష్టం. మిమ్మల్ని సర్దటం యితరులకికూడా కష్టతరం గావచ్చు.

జ్ఞాపకశక్తి (ముఖ్యంగా కంఠస్థం చెయ్యడానికి) వృద్ధికి చిన్నప్పుడు మాగురువుగారొక చిట్కా చెప్పారు. అదిచాలా బాగా పనిచేస్తుంది. ఒక పుస్తకములో ఒక పేరాగ్రాఫ్ తీసుకోండి దాన్ని కంఠస్థంచెయ్యండి. చూడకుండా యెవరి కన్నా చప్పచెప్పండి సరిపోతే మళ్ళీచదవండి ఇప్పుడు చూడకుండా పైకిచెప్పకుండా వ్రాయండి పోనుపోను పెద్ద పెద్ద పేరాగ్రాఫులతో యీమాదిరి సాధన సాగించండి. ఈ సాధన బాగా వంటబడితే మీరు మొదటి రోజులలో చిన్న

పేరాగ్రాఫు కంఠస్థం చేయగలిగిన కాలంలో యొక పేజీ కంఠస్థం చేయగలుగుతారు మీ శక్తి మీకే యాశ్చర్యాన్ని కలిగిస్తుంది.

ఇంకొంచెం యభ్యాసం యయాక యొకటి రెండుసార్లు చదివి మూడోసారు పైకి చదువుతూ చూడి వ్రాతవ్రాసే టప్పటికి అంతా మీకు కంఠతా వచ్చేస్తుంది.

ఇంత యభ్యాసం యిప్పుడు చేయలేని వారు రాత్రి పడుకోబోయేటప్పుడుగాని చీకటితో లేచిగాని చదువుకోడం మంచిది. ఈ కాలాల్లో మీ మనస్సు నిర్మలంగాయుండి చదివింది కాస్తా వంటబడుతుంది.

ఇకపోతే చిన్న చిన్న సంభాషణలున్న పాత్రలు మరీ కష్టం. తడుముకోకుండా చటుక్కున సంభాషణ చెప్పేసేవృ యిలాంటి పాత్రలున్న వారికి చాలా యవసరం.

రిహార్సల్సులో సంభాషణలు చాలా తొందర తొందరగా (అంటే వెనుకనించి యెవరో తరుముకు వస్తున్నట్టున్నారు) చెప్పాలి. బాగా స్పీడువస్తే దాన్ని చివరిచివరి రిహార్సల్సులో తగ్గించుకోవచ్చు. అలా తగ్గించుకున్నప్పుడు ప్రాంప్టింగ్ అందుకోడంకూడా చాలా తేలిక.

రిహార్సల్సేకదా యని నెమ్మదిగా మాట్లాడకూడదు. రంగస్థలంమీద మాట్లాడేంత స్థాయిలోనూ మాట్లాడాలి. రిహార్సల్సులో యదోలా మాట్లాడుతూ ప్రదర్శనరోజున పొడిచేస్తాం యన్నవాళ్ళని నమ్మకండి! కటువుగాయున్న మాట

లనూ, నోటికిపట్టని మాటలనూ మార్చగలిగితే మంచిదే. లేకుంటే, యతి నచ్చేంతవరకూ పలికించాలి. అంతేగాని యపశబ్దాలుండకూడదు.

## ప్రాంప్టింగ్

తెలుగునాట పోర్షన్లు కంఠస్థంచేసి త్సుణ్ణంగా నాటకాలాడిన వృత్తి నటులు బహుకొద్ది. ఈ మధ్య యీజబ్బు మరీ ఎక్కువైంది. ఇతర దేశాలలో పోర్షన్లు దానివృత్తి నటులుండరు. మనకు వున్నవారిలో వీరే యెక్కువ.

ఔత్సాహిక నటులుకూడా కొందరు పోర్షన్లురాకుండా స్వంతకవిత్వం చెప్పటం ఘనత అనుకుంటున్నారు. కాదు. ప్రాంప్టింగ్ మీద ఆధారపడకుండా పోర్షను చదివే నియమం ప్రతి ఔత్సాహిక నటుడూ పెట్టుకోవాలి. ప్రాంప్టరు అవుసరం యెప్పుడో కానీ కలుగకూడదు.

నిర్మాతే (అతడు పాత్రతీసుకోకపోతే) ప్రాంప్టరుగా వ్యవహరించవచ్చు. కాని వేరే యొక ప్రాంప్టరు వుండటం మంచిది.

ఈ ప్రాంప్టరు రిహార్సల్సులోనూ ప్రదర్శనలోనూ కూడా ఒకడేవుండాలి. ఇతడు చాలావరకూ ప్రదర్శన అభాసుకాకుండా అడ్డుపడేవాడు.

ప్రదర్శనరోజున దోవనుబోయేవారిని పిల్చి పుస్తకం యిచ్చి ప్రాంప్టరుగా నుంచోబెట్టే పాత్రలు 'ఆవమింగినట్టు'

గిక్కలు చూపాల్సి వస్తుంది. పాత్రనిర్ణయమప్పుడే ప్రాంప్టరును కూడా నిర్ణయించుకోవాలి.

ప్రాంప్టరు నాటకమంటే ఆసక్తి కలవాడై వుండాలి. అలాగని ప్రేక్షకుల తరగతికి చెందివుండరాదు. అయితే రంగస్థలంమీద చక్కని దృశ్యం జరుగుతుంటే పుస్తకం మూసేసి గుడ్లప్పగించి దృశ్యంచూస్తూ యికిలిస్తూ నుంచుంటాడు. సంభాషణలు మర్చిపోయి ప్రాంప్టింగు అందని పాత్రల్ని చూసి ప్రేక్షకులు పకపకలాడ్తారు.

రిహార్సల్సులో ప్రాంప్టరు యే యే నటుడు యెక్కడెక్కడ యెంతెంత పజ్ తీసుకుంటున్నాడో జాగ్రత్తగా గమనించుకోవాలి. ఎక్కడెక్కడ నట్లు పోగలడో యూహించుకోవాలి. ఇవన్నీ ప్రదర్శనరోజున చక్కగా వినియోగించుకోవాలి.

ప్రాంప్టింగు నిర్దుష్టంగానూ పాత్రలకు వినిపించేలాగునా వుండాలి. అలాగని నటునికన్నా యెక్కువస్థాయిలో అరవకూడదు. స్థాయి తగ్గించాలి.

ప్రదర్శనలో ప్రమాదవశాన్న కొన్ని సంభాషణలు యెగిరిపోయి నటులు సన్నివేశాన్ని కొన్ని పేరాలు, లేక కొన్ని పేజీలు ముందుకు లాక్కుపోతే వెనుకసంగతినే పట్టుకు ప్రాకులాడకూడదు. తనూ నటులు చెబుతున్న సంభాషణల దగ్గిరకే వెళ్ళాలి, కొన్ని పేజీలు తిరిగిపోయినాసరే. చేతనయితే సమయోచితంగా ఒక కొత్తసంభాషణ చెప్పించి వారిని వెనక్కు

వేసుకురావాలి. అంతేగాని అసందర్భపు సంభాషణ చెప్పేదాకా వారి ప్రాణం తీస్తూ కూర్చోకూడదు.

ప్రాంప్టరు రంగస్థలమంతా తనకు కనిపించే చోటా పాత్రలకు దగ్గరగానూ కూర్చోవాలి. ఇందుకు మంచిచోటు రంగస్థలానికి యెడమప్రక్క ఫుట్ లైట్సుకు దగ్గరలో ప్రక్క తెర (Side wing) దగ్గర నటులవేపు తిరిగి కూర్చోవాలి. ఏ పరిస్థితిలోనూ ప్రాంప్టరు రంగస్థలం వెనుకనున్న తెర వెనుక కూర్చోకూడదు. ఇది చాలా ప్రమాదం. ఇలా కూర్చుంటే యితనిమాటలన్నీ ప్రేక్షకులకు ముందుగానే వినిపిస్తాయి.

పాత్రల మూడ్సు లేపనూ, యాక్సెంటూ, పాజూ కాగా తెలిసిన ప్రాంప్టరు యివి యుపయోగిస్తూ ప్రాంప్టింగు యివ్వడం మంచిదే. తప్పితే మూడ్సు లేపన్సు వగైరాలతో ప్రాంప్టింగ్ యివ్వకూడదు. కొందరు ప్రాంప్టర్లు తామే నటించడం ప్రారంభిస్తారు (వాచికనటనే అనుకోండి!) ఇది కూడదు. ప్రాంప్టరుకుకూడా పోర్షన్లన్నీ యించుమించుకంఠతా రావటం వాంఛనీయం.

మూవ్ మెంట్సు, గెశ్చర్సు వగైరా :

రిహార్సల్సులో మూవ్ మెంట్సు మరీ మెకానికల్ గా నేర్పే నిర్మాత ప్రదర్శనరోజున చెడ్డ దెబ్బతింటాడు.

సాధారణంగా మనం రిహార్సల్సు చేసుకునే గది స్టేజికన్నా చాలాచిన్నదిగా వుంటుంది. ఈ తేడాగమనించకుండా

పొజిషనులూ మూవ్‌మెంటూన్నూ పకడ్బందీగా నిర్ణయించు కుంటే సర్వసాధారణంగా రిహార్సల్సు గదికంటె పెద్దదైన రంగస్థలంమీద యివన్నీ యసహ్యంగా కనిపిస్తాయి.

ఉదాహరణకు యిద్దరు వ్యక్తులు రహస్యంగా మాట్లాడుతున్నారనుకోండి రిహార్సల్సు గదిలో యీ సన్ని వేశాన్ని యొకడాచివర, మరొకడీచివర నుంచుని ప్రాక్టీసు చేస్తారు. అయినా గది చిన్నదవటం మూలాన వారు దగ్గర గానే వుంటారు రిహార్సల్సులో, ఇదే యలవాటు ప్రకారం రంగస్థలంమీద కూడా యొకడాచివర మరొకడీచివర చేరి రహస్య సంభాషణ ప్రారంభిస్తారు. వీళ్ళరహస్య సంభాషణ యరుపులలోకి దిగుతుంది. చూచేవారికి చాలా యసహ్యంగా వుంటుంది. ఇక్కడొక చిన్న మూవ్‌మెంటు వుందనుకోండి. రంగంమీదకు మరోపాత్ర ప్రవేసిస్తుంది. "యెడం వైపు నున్న వ్యక్తి మూడడుగులేసి కుడి ప్రక్కనున్న వ్యక్తివెనక దాక్కోవాలి" రిహార్సల్సులో నేర్చుకున్న ప్రకారం రంగ స్థలంమీద వీళ్ళిద్దరి మధ్యనున్న దూరం మూడడుగులకు మించింది. అంచేత రిహార్సల్సులో మూడడుగులు వేసిన వ్యక్తి మరోవ్యక్తి వెనకకుచేరుకుంటే రంగస్థలంమీద యదే మూవ్ మెంటులో మధ్యన వుండిపోతాడు. క్రొత్తగా వచ్చిన మూడోపాత్రకు "అమ్మదొంగా అతని వెనక దాక్కు న్నావా" యనేలాంటి సంభాషణ వుందనుకోండి. పరిస్థితి యెంత యపహాస్యంగా తయారయిందో గమనించండి.

రిహార్సల్సులో ప్రాక్టీసు చేసినట్లు మూడడుగులు వేసి పూరించుకుంటుంది మొదటిప్రక్కపాత్ర. కుడిప్రక్కపాత్ర గడ్డం నిమురుకుంటూ నుంచుంటుంది. మూడవపాత్ర తనసంభాషణ చెప్పటమా మానటమా యని సందేహిస్తూన్న సమయంలో తెర వెనుక నుంచి ప్రాంప్టరు గోల "నువ్వే యేయ్ చెప్పు" "అమ్మగారింగా యతని వెనుక దాక్కున్నావా" "ఊం చెప్పు చెప్పవేం" "అమ్మగారింగా" యని చెప్పేదాకా పూరుకోడు. మరో కాసేపుంటే యతడే రంగంమీదికి వచ్చేసి యదికాస్తా చెప్పేస్తాడేమో నన్నంత హడావుడి చేసేస్తాడు. మూడవపాత్ర విధిలేక యీసంభాషణకాస్తా చెప్పెయ్యంగానే జనం గొల్లుమంటారు.

అయితే రిహార్సల్సు గదినీ రంగస్థలాన్నీ దృష్టిలో వుంచుకుని యిక్కడి, యక్కడి తేడాలను బాగా బోధించగల నిర్మాత కొన్ని గిరులలో మూవ్‌మెంట్లు వుండేలా ప్రాక్టీసు యివ్వొచ్చు. ఏది యేమైనా ప్రదర్శనరోజున కొన్ని కొన్ని ప్రత్యేక కారణాలవల్ల మూవ్‌మెంట్సులో మార్పులవుసరం కావచ్చు. అంచేత నటులకు మూవ్‌మెంట్సు గణితశాస్త్ర ప్రకారం నేర్పే నిర్మాత ముఖ్యంగా కొన్ని విషయాలు జ్ఞాపకం వుంచుకోవాలి.

ముందు ఈ మూవ్‌మెంట్సనేవి యింతశాస్త్రోక్తంగా మొందుకు చెయ్యాల్సొచ్చిందో తెలుసుకోవాలి.

నాటకదృశ్యం ప్రతిదీ ప్రేక్షకులకు కనిపించటమూ నటీనటుల అభినయ విశేషాలన్నిటిని అంతా చూపించి యూపంది చటమూ నాటక ప్రదర్శన కుండవలసిన ముఖ్యలక్షణాలు. ఒక గదిలో రెండు పాత్రలు సంభాషించే దృశ్యం వుందనుకోండి. అది వాస్తవికతకోసం యేమూలో యేర్పాటుచేస్తే బాగుండదు. కాగా మరీ మధ్యలో యేర్పాటుచేసినా బాగుండకపోవచ్చు. దృశ్యంలో ఆ యిద్దరూ సంభాషిస్తూంటే చూడ ముచ్చటగా వుండాలి. ఇంతలో ఆ దృశ్యంలోకి మరోపాత్ర లేక మరికొన్ని పాత్రలు ప్రవేశించినప్పుడు మొదటి పాత్రలు చూడ ముచ్చట (Graceful)గా తమ స్థానాలు తప్పించ గలగాలి. క్రొత్తగా వచ్చిన పాత్రలు కూడా తగుచోట తమ స్థానాలు యేర్పరచుకోవాలి. ఇది ముందు నిర్ణయం జరుగకపోతే మూవ్‌మెంట్సు నిర్దుష్టంగా జరుగవు. కాగా దృశ్యం చూడచక్కగా వుండదు. చిక్కిరి బిక్కిరిగా తయారవుతుంది. ఇది నివారించడంకోసం యెవరెవరు యేయే సంభాషణలలో యెక్కడెక్కడ వుండాలి, కదలిక యేయే సంభాషణలలో యెంతెంత యెటువైపుకు వుండా లనే నిర్ణయం జరగాలి. ఈ పరిస్థితిలో యనేకమందనేక దారులు త్రొక్కుతారు. కొందరు రంగస్థలాన్ని (ఊహాకు) గళ్ళుగా విభాగిస్తారు. మరికొందరు మరోవిధంగా చేస్తారు. సినిమాకు కావలసినంత నిర్దుష్టమైన కదలిక నాటకాని కక్కరలేదు. అంచేత సన్నివేశం చెడిపోకుండా

చూడ ముచ్చటగా వుంటుందనుకునేలా నటీనటులు తమకు తామే కదలికలు యేర్పరుచుకోవడం మంచిది. ఇదిపైనించి చూచేవారు సరిచూచి మరింత బాగుండేలాటి సలహాలు యివ్వొచ్చు. సమయానుకూలంగా యితరకదలికల కడ్డుశేని నిష్ఠంగా యిక మార్చుకోనూవచ్చు.

కదలికలు (మూవ్ మెంట్సు) కేవలం యాంత్రికంగా నప్పుకుంటే వాటిమీదే దృష్టి కేంద్రీకరించబడి అభినయ విధానాలలో తలమానికమైన సాత్వికాభినయం దెబ్బతింటుంది. సాత్వికాభినయంలో దిట్టలైనవారికి తప్పనున్నా తప్పకుండా యీ మూవ్ మెంట్సు గెశ్చర్సు అలవాటైపోతాయి.

ఈ మూవ్ మెంట్సూ, గెశ్చర్సూ, విషయంలో ఒక్క-మాట జ్ఞాపకం వుంచుకోవాలి. నాటకం ప్రదర్శిస్తున్నప్పుడు యేక్షణంలో ఫొటోతీసినా ఆదృశ్యం చూడముచ్చటగా వుండాలి అనేవిషయమనస్సులో వుంచుకుని ప్రతి మూవ్ మెంటూ ప్రతి గెశ్చరు తదనుగుణంగా నిర్ణయించుకోవాలి. ఇవి యాంత్రికంగా జరిగినట్టు యెప్పుడూ కనపడకూడదు. రంగస్థలంమీద మనిషికి మనిషీ అడ్డురాకూడదు (అలా రావలసిన ప్రత్యేక సందర్భాలలో తప్ప) ఒకరికి చెప్పవలసిన సంభాషణ ఏ సందర్భంలోనూ వెనక్కి తిరిగి చెప్పే అవకాశం రాకూడదు.

స్థూలాభినయంలోనేకాక సూక్ష్మాభినయంలో కూడా గెశ్చర్సు అవసరం. గెశ్చర్సనగానే చేతులు త్రిప్పటం అవయవాలు కదల్చడమే కాదు. ఒకమాట లేక ఒకవాక్యం

చెప్పేటప్పుడు దాని భావానుగుణంగా వివిధావయవాలలో వంపులూ కదలికలూ చూపగల్గాలి.

ఈ గెశ్చర్సు నాటకానికి చాలా అవుసరం. సూక్ష్మాభినయంలో పేరెన్నికగన్న నటులు వీట్ని కనపడనీయకుండా అతిమెళకువతో వాడేవారు. స్థూలాభినయంలో యీ గెశ్చర్సు అతిగా వాడి కొందరు నాటకాభినయంలో యీ విధానాన్ని అపహాస్యం పాలు చేసారు. నటుని అవయవసౌష్ఠవాన్ని అతని ముఖం యేకోణంలో యేవిధంగా వుంటుందో గమనించీ యీ గెశ్చర్సు నిర్ణయంజరగాలి.

ఒకానొక వ్యక్తి (మంచిఅయవసౌష్ఠవంగలవాడు) ఒక మాదిరి అడ్డనడకతో ఒక వేషాన్ని అద్భుతంగా ప్రదర్శించాడు కదా అని పీలగావున్న వారుకూడా అది అనుకరిస్తే అసహ్యంగా వుంటుంది. కోలముఖంవారు సైడుపోజులు యివ్వకూడదు. కొందరు ఏడ్చినా నవ్వినట్టుంటుంది మరికొందరు నవ్వినా యేడ్చినట్టుంటుంది. ఇటువంటివారు తాము ప్రదర్శించజాలనివి ప్రదర్శించకూడదు అంటేనవ్వినా యేడ్చినట్టుండేవారు నవ్వుప్రదర్శించాల్సివచ్చినప్పుడు ప్రేక్షకులకు కన్పించేలా నవ్వకూడదు ఒకచిన్న మూవ్ మెంటూ—ప్రేక్షకులకుముఖంకనుమరుగు—నవ్వు తిరిగి మరొక మూవ్ మెంట్టు ప్రేక్షకులకుముఖం కనిపించటమూ, ఈ మాదిరిగా యేర్పాటు చేసుకోవాలి. ప్రాక్టీసుమీద యిది చాలా బాగా వుంటుంది. చెయ్యాలని చేసినట్టుండకుండా జాగ్రత్తపడాలి.

పూర్తి రిహార్సల్సు వేసేటప్పుడు నిర్మాత నటులకు దూరంగా వుండి ఎఫెక్ట్సు గమనించి రిహార్సల్సు అనంతరం తగు సలహాలివ్వటం మంచిది.

సాధారణంగా నిర్మాతపాత్ర తీసుకోకూడదు కానీ ప్రస్తుతం నిర్మాతే ముఖ్యపాత్ర తీసుకునే సమాజాలు యెక్కువగా వున్నాయి. యీ పద్ధతి మానుకోవడం మంచిది. అయితే మన నాటకప్రదర్శనలు నిర్మాతలకు పేరు తెచ్చినవి కావు. (అసలు నిర్మాతలంటూ లేరనుకోండి) నాటకమంతా చూచి నిర్మాతను తల్చుకున్నవారుండరు. నిర్మాత వ్యక్తిత్వం ప్రదర్శనలో కనిపించటంలేదు. ఈ కారణాలచేత అంతగా కష్టపడ్డ వ్యక్తి తెరమరుగున వుండనిచ్ఛగించక తానూ ఓపాత్ర (న్యాయంగా ముఖ్యపాత్ర!) ధరించడానికి తయారవుతున్నాడు. ప్రస్తుతపరిస్థితులలో యిది మాన్పలేం.

ఒక్కొక్కపాత్రకు యిద్దరుముగ్గురు నటుల్ని యెన్నుకుని రిహార్సల్సు చేయించే సమాజాలున్నాయి. అవి యించుమించు వ్యాపారసరళిలో (వృత్తిగా కాదనుకోండి) నడుపబడే సమాజాలని చెప్పవచ్చు. ఎట్టిపరిస్థితిలోనైనాసరే నాటకం ప్రదర్శించితీరాలనేదే వీరి ఆశయం. వీలుంటే యీపద్ధతి యన్ని సమాజాలూ యాచరించటంమంచిది. అథవా కొన్ని కొన్ని ముఖ్యపాత్రలకన్నా అండర్ స్టడీ చేయించాలి. ఈ పద్ధతిలో చాలా మేళ్ళున్నాయి. కొందరు కొందరు ఒకో పరిస్థితిలో బెదరింపులు ప్రారంభిస్తారు. తాము లేకుంటే

యీ ప్రదర్శనే లేపని విర్రవీగుతూంటారు. ఇది యీ పద్ధతి వల్ల మూన్పవచ్చు. సమాజసభ్యులకు వివిధపాత్రల అభినయంలో తరిఫీదునిచ్చినట్లూ యుంటుంది.

నాటకశిక్షణకు యితర దేశాలలో పాఠశాలలూ కళాశాలలూ యున్నాయి. ఉత్తమనట, దర్శక, నిర్మాతలు యిటువంటి సంస్థలలో తరిఫీదు పొందినవారై యున్నారు.

ఈ కారణంగా యొక సమాజంలో చేరేవటుడుగాని సాంకేతిక నిపుణుడుగాని యెంతోకొంత సాంకేతిక పరిజ్ఞానం కలవాడై యుంటాడు. కానీ మన ఔత్సాహిక సమాజాలలో ప్రవేశంపొందే యువనటులు బొత్తుగా యీ విషయాలలో క్రొత్తవారై ప్రతివిషయమూ యిక్కడే నేర్చుకోవలసియుంటుంది. ఇది రిహార్సల్సు నియమబద్ధంగా నిపుణతతో నడిపితేనే సాధ్యమవుతుంది.

## ఔత్సాహిక నాటక ప్రయోగం

### (d) నాటక అభినయం (నటశిక్షణ)

నాటకాభినయం ప్రత్యేకంగా చెప్పే గ్రంథాలు మనకి లేవు. ఉన్నవల్లా నాట్యశాస్త్రి గ్రంథాలు మాత్రమే. ఈ నాట్యశాస్త్రి రీతుల ననుసరించి యిప్పుడు నాటకాలు ప్రదర్శిస్తే చూచేవాళ్ళుండరు. ఆమాట కొస్తే మన పెద్దల కాలంలో కూడా యీ నాట్యశాస్త్రి రీతుల ననుసరించిన ప్రదర్శిన లఉదనే చెప్పాలి.

నాట్య శాస్త్రాన్నీ, మరోకొన్ని పద్ధతుల్నీ కలగా పులగం చేసి నాటక ప్రదర్శన లనేకరీతుల జరిగాయి.

అన్ని రంగాలలో లాగానే యీ నాటకరంగంలో కూడా పూర్వపు ఔన్నత్యాన్ని ప్రతిభనూ పొగడుకుంటూ యిప్పుడు మనం యెందుకూ పనికిరాకుండా పోతున్నా మని వగవటం పరిపాటయింది.

పూర్వపు ప్రతిభ పూర్వపుది ఇప్పటి ప్రతిభ యిప్పటిది దేనికదే ప్రత్యేకంగా విమర్శించి మంచిచెడ్డలు నిర్ణయించుకోడం మేలు.

ప్రతి విషయంలోనూ ప్రతిచోటా యభ్యుదయమన్నది వున్నది ఇది కాదనలేని సత్యం. కాకపోతే చామకూర వారన్నట్లు మనకు చేతకాని దీ పతనావస్థ యని గుండెలు బాదుకోడం కొందరికి బాగా యలవాటైంది. "అహా! మా కాలంలో యెంత చక్కటి నాటకాలు చూచాం. అవి యిప్పుడేవీ? అలాంటి నటులేరీ?" యని పెద్ద దగ్గరనుంచి చిన్నదాకా యొకటే రాగాలాపన యైపోయింది. ప్రాత నాటకాలు చూడని కుర్రకారు నిజమే కాబోలనుకుని నీరసించి పోవడం జరుగుతోంది. ఈ మాదిరి ప్రచారంలో జాతీయత కూడా ఓపోసు మిళావుచేస్తే యిక మరెవ్వరూ నోరెత్తడానికి వీల్లేదు ఎత్తితే 'విదేశీ వ్యామోహి,' 'బానిస' మళ్ళ మాట్లాడితే 'దేశద్రోహి' లాంటి పదజాలం తేలిగ్గావాడి నేషనల్ హీరో యైపోవచ్చు. అన్ని కళలలోనూ

యిది ప్రేళ్ళుతొక్కుతోంది. సమూలంగా పీకివెయ్యకపోతే యెక్కడికో యెన్ని వేల యేళ్ళు వెనక్కో!! చెప్పలేం.

పురాణం (ప్రాత) వ్యవహారాలకు వాటికితగు ప్రాధాన్యం యివ్వాల్సిందే. కాదని యెవరంటారు! ఈ ప్రాత వ్యవహారాల్ని పొగిడేటప్పుడు వాటికివ్వాల్సిన సరియైనవిలువ "ఆ కాలంలో ఫలానాకళ యేస్థాయిలో యున్నది" అంతే గాని యదేపట్టుకుప్రాకులాడ్దాం యనే భావం యేకోశానా యుండరాదు. దురదృష్టవశాత్తూ యిప్పుడు మన ప్రగుడ్డి "ఉద్ధరణ" కార్యక్రమంలో జరుగుతున్న యపభ్రంశమే యిది.

ప్రాతవాటి ఉద్ధరణ మ్యూజియమ్ స్థాలువరకే అనేది జ్ఞాపకం యుంచుకోవాలి. కాదు యదే యీనాడూ యాచరణీయం యంటే మనం ఆకాలంలోకి వెళ్ళటానికి మూటా ముల్లే సర్దుకుంటున్నామన్న మాటే!

P. C. బరువా నిర్మించిన "దేవదాసు" చిత్రం యాకాలంలో విశేషకీర్తినీ ధనాన్నీకూడా యార్జించింది. యెన్నీమధ్య మరోభాషలో "దేవదాసు" చిత్రం వచ్చింది. ఈ చిత్రానికి పోటీగా ఆ చిత్రం విడుదలచేసారు. కొన్ని సెంటర్లలో యీా వుద్ధరణకార్యకర్తలు అవి రెండూ చూచి వుంటే నేను యేంచెప్పదల్చుకున్నదీ తేలిగ్గా గ్రహించగలరు (బి·· కాలకుపోకుండా సత్యంవప్పుకుంటే).

క్రొత్తచిత్రంలో ప్రతిచిన్నవిషయంలోనూ చెప్పలేనంత అభివృద్ధి కనిపించింది. ప్రాతచిత్రం యించుమించు యొక్క 'అపహాస్యం' గా కనిపించింది. ఆ రోజులలో యీచిత్రానికి నివాళులర్పించిన వాళ్ళల్లో నేనూ ఒకణ్ణి. పోతే యీ నాటికి సరిపోయిన స్థాయిలో యిప్పటి చిత్రం వున్నాదాయన్నది వేరేవిషయం. అది యుండేటట్టుగా చూచుకోవడమే మన ఘనత.

యే విషయంలోనైనా మార్పు మనేది తప్పనిసరి. నాటకకళలో ముఖ్యంగా అభినయంలో మన కాలంలోనే మనం అనేకతరహాలు చూస్తూవచ్చాం. ఆయాసందర్భాలను బట్టి ఆయాతరకాలు ప్రజాదరణపొందుతూ వచ్చాయి. నాటక ప్రదర్శనలో ఫలానిపాత్ర యెలానటించాలి యనేది యెవరూ చెప్పజాలని విషయం. నటునియనుభవంతోబాటూ ప్రేక్షకుల యభిరుచులతో బాటూ యిది మార్తూవస్తోంది. యీ మార్పు చెడుది యనుకోవడం పొరబాటు. మహానటుల యనుభవాలు జాగ్రత్తగా పరిశీలిస్తే వారే ఒక్కొపాత్రను యేయేవిధాల మలుచుకు వచ్చిందీ అర్థం అవుతుంది. శ్రీ ఛెర్కసోవ్ వ్రాసిన 'నోట్సాఫ్ యె సోవియట్ యాక్టర్' యిందుకు చక్కని ఉదాహరణ. ఆయన యీపుస్తకంలో తనవివిధానుభవాల్ని వ్రాస్తూ ఒక్కొకపాత్ర (తను నటించేదే) యెలా పరిణితి పొందుతూ వచ్చిందో విపులంగా తెలియబర్చారు.

అంచాత ఒక్కొకపాత్ర ఒక్కొక్క విధానంగా నటించాలి యనుకోడం పొరబాటు. అంతేకాదు ఒక్కొక రసం ఒకోవిధానంగా అభినయించాలి అనుకోడం కూడా పొరబాటే. యీా విషయాలు మున్ముందు విపులంగా మనవి చేస్తాను.

అసలు నటనంటే యేమిటి ?

జీవితంలో ప్రతివ్యక్తి నటుడే యనే వాదన యొకటి యుంది. ఇది నిజ-కూడాను. ఈ సత్యాన్ని గ్రహించి యది యనుకరించగలవాడు నాటకంలో ఉత్తమ నటుడౌతాడు.

విభిన్న మనస్తత్వాలు గల వ్యక్తుల వ్యవహారాలు (కనీసంవారు యితరులతో జరిపే సంభాషణలు వగైరా) జాగ్రత్తగా గమనించండి. మీాకు యెన్నెన్నో క్రొత్తసంగతులు తెలుస్తాయి. ఒకరు మరొకర్తో పొరుగింట్లో 'పుల్లకూరవండు కున్నారు' అని చెప్పడానికి యెన్ని మూాతివంకర్లు పెడతారు. యెన్ని విశాగచేష్టలుచేస్తారు! మరొకరు యెంతో గొప్ప విషయాన్ని అతితేలికగా చెప్పివేస్తారు. ఈ మనుష్యుల తత్వాలు, పరిసరప్రభావాలు, జాగ్రత్తగా పరిశీలిస్తే అభినయంలో మనకు యనేక విషయాలు తెలుస్తాయి. ఇవి నాటకంలో నటించడానికి బాగా యుపయోగపడ్తాయి.

జీవితంలో వ్యక్తి నటించేటప్పు డతను ప్రేక్షకులను దృష్టిలో వుంచుకోడు. ఎ-తవరకూ ఎదుటి వ్యక్తితోనే యతని సంబంధం. కాగా నాటకంలోనటించే వ్యక్తి జీవితంలోజరిగినది లేక జరుగగలదనిపించే ఒకానొక సంఘటనను ప్రేక్షకులకువిపులంగా

తెలిసేలా చెప్పడానికి నటిస్తాడు. అందులో స్వాభావికతతో బాటు కొంత అస్వాభావికతకూడా వుంటుంది. ఈరెంటిమేలు మిలాపు నాటకీయత. పొరుగింట్లో సంభవించిన మరణానికి లోకధర్మంగా ఓసారి "అయ్యో పాపం" అనేస్తారు కానీ నాటకంలో ఇది సంభవించి చచ్చినవారి ఆత్మీయపాత్ర దుఃఖ రసం ప్రదర్శిస్తుంటే అది తమకే సంభవించినట్టు ప్రేక్షకులంతా కన్నీళ్ళు కారుస్తారు ఒక భీభత్సదృశ్యం (యుద్ధం గ్రుద్దులాట వగైరాలు) చూస్తున్నవారు పిడికిళ్ళుబిగిస్తారు. ఒక శృంగార దృశ్యం చూస్తున్నవారు నాయిక (నాయకుడు) తమతోనే ఆవిధంగా ప్రవర్తిస్తున్నట్టు మురిసిపోతారు. ఆయా ఘట్టా లలో ఆయా అనుభూతులు ప్రేక్షకులలో కల్గించగలవాడు ఉత్తమనటుడనేది నిర్వివాదాంశం. ఇది సాధించడానికి అనేక తీరులు వున్నాయి ప్రముఖనటులు తమ తమ పీలుచాళ్ళను బట్టి యీ తీరులన్నీ ఆచరణయోగ్యములని నిరూపించ గలి గారు. క్రొత్తరీతులు వెతికి అవికూడాచూడముచ్చటగా ప్రద ర్శించగలవార్ని నిరుత్సాహపరచకూడదు. కాగాలోపాలుంటే విమర్శనాత్మకంగా చెప్పటం మంచిది.

ప్రేక్షకులను రంజింపచేయాలి నాటక నటన. కాగా యసఃదర్భంగా ప్రవర్తించి ప్రేక్షకుల మెప్పు పొందగలవారు కొందరున్నారు. ఈ పద్ధతి ఉత్తమప్రమాణాలలో నటించే వారికికూడా వొక్కొక్కప్పుడు శరణ్యమౌతూంటుంది. ఇది మంచిదికాదు. కానీ ఆయా సందర్భాలనుబట్టి ననివార్య

పోతోంది. సాధ్యమైనంతవరకూ యీ పద్ధతికి స్వస్తి చెప్ప టం వాంఛనీయం.

నాటకనట నొకేమారు అనేకమందికి ప్రదర్శింప బడుతుంది అందుచేత విధిగా మనంచేసే ప్రతిపనీ, ప్రతిచేష్టా, ప్రేక్షకులందరికీ కనిపించేలా గర్థమయ్యేలా, చేయాలి. మనం చెప్పే ప్రతిమాటా ఆఖరికి జనాంతికమైనాసరే అందరికీ వినిపించేలా చెప్పాలి ఇక్కడే ప్రాప్తించిన పాత్రకూ నాటకపాత్రకూ తేడా ప్రారంభం అవుతుంది. ఈ తేడాను తెలియాలా కాకుండా స్వాభావికంగా వుండేలా ప్రదర్శించగలగటం ఉత్తమనటన.

సాధన :—ఇది సాధించడానికి నటులు కాదల్చుకున్న వారు కొంత శిక్షణపొందాలి.

మనం మామూలుగా మాట్లాడుకునే స్థాయిలో రంగస్థలంమీద మాట్లాడ్తే ఎవరికీ వినిపించదు (మైక్రోఫోనులు వగైరా యేర్పాటుచేసినా!) అలాగని చెవిటివాళ్ళముందు అరిచినట్లు అరిచినా బాగుండదు. కాగా స్థాయి యెక్కువచేసినా మామూలుగానే మాట్లాడ్తున్నట్లు భ్రమకలిగించాలి. ఇందుకు సంగీతసాధన మంచి శిక్షణ. వాచికానికి (సంభాషణలకు) కూడా శ్రుతిస్థాయిలయ లవుసర మనేది గుర్తించాలి.

ఆంగికాభినయానికి కూడ తగిన శిక్షణ కావాలి. అంగవిన్యాస మడ్డదిడ్డంగా చేసేస్తే యాంగికాభినయం కాదు. క్రమబద్ధంగా చూడ ముచ్చటగా వుండాలి. ఇందుకు శరీర వ్యాయామం మంచిది ఒక్కోమారు కదలకుండా బొమ్మలా

నుంచోవాల్సొస్తుంది. ఒక్కోమాఱు రెత్తిన చెయ్యి సావు గంటదాకా దింపకుండా వుంచాల్సి వస్తుంది. శరీరవ్యాయామంతో యివి సాధించడం తేలిక.

సాత్వికాభినయాని కేకాగ్రత యవుసరం. ఏకాగ్రత సాధించడానికి ప్రతి నటుడూ ప్రయత్నించాలి. ఇది చేతకాకపోతే సాత్వికాభినయం ప్రదర్శించటం చాలాకష్టం. ఒక పదార్థం లేక గోడమీద పెట్టుకున్న నొక గుర్తు (చుక్క)నో తదేకంగా చూస్తూ ధ్యాస నిల్పటం ప్రాక్టీసు చేస్తే యేకాగ్రత కొంతవరకూ యలవడుతుంది.

నటుల కాహార విహారాదులలో నియమమూ నీతి, చాలా యవుసరం. వృత్తినటులకు మరీను.

నటనలోని ప్రాథమిక సూత్రాలు: అందరికీ కనుపించేలా మనంచేసేది ప్రతివారికీ యర్థమయేలా నుండాలి ఇందుకుగాను ముందుగా మనకి మనం నటించబోయే పాత్ర బాగా యర్థంకావాలి. చేసే విన్యాసమూ చెప్పే మాట అర్థయుక్తంగ వుండాలి.

నటనలో ననేక పద్ధతులున్నాయి. ఒకే పాత్ర నొక్కొక్కతరం వా రొక్కొక్క విధంగా నభినయించి మెప్పు పొందారు. ఇదెలా సాధ్యమయిందనేది పరిశీలిస్తే నటనకు యెప్పుడూ యొక ప్రమాణం లేదని దేశకాల పరిస్థితులను బట్టి మారుతూంటుందని తెలుస్తుంది. పరిణామ వాదం యొప్పుకున్నవారు దీన్ని కాదనలేరు కొన్నికొన్ని రసాల

నొక్కొక్క-విధంగా నభినయించా లనుకోవడం పొరబాటు. ఆయా రసాలు తాము నటించే పాత్రల నైజాన్నిబట్టి మారుస్తూ ప్రదర్శించాలి. అంచేత Character study యనేది నటుడు ముఖ్యంగా తెల్సుకోవాలి.

ఒక త్రాగుబోతుపాత్ర నే తీసుకుందాం-మధుసేవలో "రంగడు"-దేవదాసులో "దేవదాసు" ఈ రెండూ త్రాగుబోతు పాత్ర లే అయినా మొదటిదానికీ రెండోదానికీ యెంతో తేడావుంది. దేవదాసు త్రాగుబోతుతనం ప్రారంభించిన కాణ్ణించీ మధుసేవలో రంగడిపాత్రను అనుకరించేస్తే సరిపోతుందా ? అలాగే దుఃఖం యిదీ ఒక్కో అంతస్థు మనుషులు ఒక్కోలా ప్రదర్శిస్తారు కదా ! ఈ తేడాలు క్షుణ్ణంగా అవగతం చేసుకుని ప్రదర్శించగలగాలి. అంతేగాని దుఃఖం అనంగానే గుండెలు బాదుకుం టేడిస్తే సరిపోదు ఇలాగే శృంగారం వగైరా ఇతర రసాలుకూడాను ఆయాపాత్రలనుబట్టి ప్రదర్శించాలేగాని శ్లోకాలలో వ్రాశారుకదా అనీ పిడుక్కీ బిచ్చానికీ ఒకటేమంత్రం పఠించకూడదు.

ఒక్కో-పాత్రను తీసుకుని ఆపాత్ర నైజగుణాలు వగైరా కథనుబట్టీ సంభాషణ సన్నివేశాలక్రమాన్నిబట్టి తెలుసుకోవాలి. అటువంటిపాత్ర మనం ప్రాపంచికంగా ఎక్కడన్నా చూచామా అని గుర్తు తెచ్చుకోవాలి. మనకు తెలియనిపాత్ర అయితే కొంత ప్రయత్నంచేసి తెలుసుకోవాలి. పురాణ, చారిత్ర్యకపాత్రలైతే విపులవిమర్శతో కూడిన గ్రంథాలు పరి

శీలించి పెద్దలనడిగి తెలుసుకుని పాత్రస్వభావాన్ని అవగతం చేసుకోవాలి. మనకన్నా ముందు ఒక సాంప్రదాయాన్ననుస రించి పాత్రనటింపబడ్తుంటే ఆ నటనలోని మంచిచెడ్డలు అవ గాహనచేసుకోవాలి. లేక మనకు అటువంటి వీలుచిక్కకపోతే ఆపాత్ర అనేకంగా నటింపబడటం చూచిన వారినుంచి విష యాలు తెలుసుకోవాలి. అప్పుడు మన యభిప్రాయాలుకూడా కలబోసి నటనారీతులు నిర్ణయించుకోవాలి. అంతేగాని గ్రుడ్డిగా పాత నటులను అనుకరించకూడదు. నటనలో అను కరణ పనికిరాదు – "నటన అంటేనే అనుకరణకదా! ఇదేమి టిలా అంటున్నారనుకోకండి! మరోనటుడ్ని అనుకరించి నన్నాళ్ళూ మనం అపర..............లాగానే వుండాలి! నటనలో అనుకరించాల్సింది ప్రాపంచిక పాత్రలనుగాని ఉత్తమ నటులనుకాదు. ఉత్తమనటులపోకడలు పద్ధతులు తెలుసు కోవాలి. అంతేగాని వారినటన అనుకరించకూడదు.

తామెన్నుకున్న పాత్రను క్షుణ్ణంగా పరిశీలించి యీ పాత్రమీద యొకమాదిరి నిర్ణయం జరిగినాక నటన ప్రాక్టీసు చేయాలి. కొందరీ ప్రాక్టీసు యద్దంలో చూస్తూ చేస్తామంటారు. అద్దంలోచూస్తూ ప్రాక్టీసు చేసినవారునటులు కాలేరుకాగా యొకరిద్దరు పేరుప్రఖ్యాతులుసంపాయించుకున్న నటు లద్దంలో చూచే ప్రాక్టీసు చేశానివినికిడి. ఇది యెంత వరకూ నిజమో తెలియదుకాని యీ మాదిరి ప్రాక్టీసువల్ల సాత్వికాభినయ మన్నది పూర్తిగా దెబ్బతింటుంది. పోతే

నిలువుటద్దంముందు ప్రాక్టీసుచేస్తే ఫోజులూ వగైరా వోమాదిరిగా రావచ్చు. కాని రంగస్థలంమీద కూడా అద్దం దృష్టి పథంనుంచి పోక నటుడ్ని యాంత్రికంగా తయారుచేస్తుంది. సహృదయులైన విమర్శకులను దగ్గర కూర్చో పెట్టుకుని నటించి తప్పొప్పులను తెలుసుకుని ప్రాక్టీసు చేయటం మంచి పద్ధతి. నటనలో మంచి యనుభవం కలిగిన నిర్మాత శిక్షణలో తర్ఫీదు పొందుతున్నప్పుడు యిక విచారించాల్సిన పనేలేదు. అద్దంలోచూచి యెప్పుడూ ప్రాక్టీసు చేయకూడదు. అద్దంలో చూస్తే భావాలెలా ప్రదర్శిత మవుతున్నాయో చూసే దృష్టి వుంటుంది కాని ప్రదర్శించే యవకాశముండదు.

స్థూలాభినయం సూక్ష్మాభినయ మన్న రెండు విధాలైన యభినయం నాటకాలలో వాడుకలోవుంది. ఆంగికం వాచికం ఆహార్యం ఈ రెండు విధాలైన యభినయాలలోనూ వాడ్తారు. నాటకాభినయానికి వన్నె తెచ్చేది యాహార్యం (పాత్ర ధారణ లేక యలంకరణ. దుస్తులు, రంగాలంకరణ) ఈ ఆహార్యం సరియైనది నిర్ణయించుకోవాలి. స్థూలాభినయంలో యాంగిక వాచికాలకు ప్రాధాన్యం. సూక్ష్మాభినయంలో సాత్వికాభినయాని కెక్కువ ప్రాధాన్యం.

సూక్ష్మాభినయం మొదటి వరుసలలో కూర్చున్న సభికులకు తప్ప చివర చివర కూర్చున్నవారికి సరిగా కన్పించదు. ఇందుకు రంగస్థల మీది లైటింగు యేర్పాట్లూ

ప్రేక్షక స్థానంలోని సీటింగు ఏర్పాటు కూడా కొంతవరకూ కారణాలు. ఈ రోజులలో కూడా యివి చక్కబడలేదు.

జనం యెక్కువగా హాజరైన నాటక ప్రదర్శనలలో విధిగా స్థూలాభినయానికి ప్రాధాన్యత యివ్వాలి. నిర్ణీతమైన (Limited) సభికులున్నప్పుడు సూక్ష్మాభినయానికి ప్రధాన్యత నివ్వవచ్చు

ఆంగికాభినయంలో నటుడు వివిధావయవాలను విరివిగా ఉపయోగిస్తాడు. ఈ పద్ధతి ధీరోదాత్త పాత్ర లెక్కువగా వాడకూడదు.

తోలుబొమ్మలాటలో చిన్నచిన్న పాత్ర లవయవాలన్నీ కదుపుతాయి. పాత్రల యాధిక్యత పెరిగినకొద్దీ తల మాత్రం కదుపుతాయి. ఈ విధానం నాటకాభినయానికి కూడా సూత్రప్రాయం కాగా భరతనాట్యపు 'కృష్ణ' పాత్రలూ స్థంభాకారపు తక్కువ (భటులు వగైరా) పాత్రలూ మనకు కోకొల్లలు! ఇది కూడని పని కానీ దేశ కాల పాత్రలనుబట్టి భరతనాట్యపు కృష్ణు లుత్తము నటులుగా చెలామణీ కాకపోలేదు.

ఆంగికాభినయం విరివిగా నుపయోగించేవారి కవయవ స్పష్టతమూ వాటి గదలికల్లోని సొంపూ, వన్నె తెస్తాయి.

వాచికాభినయం (ఇటీవల ప్రచారంలోకి వస్తున్న మూగనాటకాలలో మినహా) ప్రతి పాత్రకూ యవసరం. వాచికం స్పష్టంగా, తగుస్థాయిలో వినదగిన కంఠస్వరంతో

చెప్పగిలిగియుండాలి వాచికాభినయంలో యాక్సెంట్ (Accent) మాడ్యులేషను (Modulation) వగైరాలు బాగా సాధనచేయాలి. ఒకేవాక్యాన్ని వివిధపాత్రలు ఆయా సందర్భాలనుబట్టి చెప్పేతేడాలు అవగతం చేసుకోవాలి.

పూర్వనాటకాలలో వచనంకూడా శృతిలయలకు యనుగుణంగా యుండేది. అందుకు భిన్నంగానూ కొందరు (మహానటులే) చెప్పేవారు రసస్ఫూర్తి యనేది యుంటే యే విధానమైనా ఫరవాలేదు.

స్వగతాలనూ, జనాంతికాలనూ ప్రకాశసంభాషణలకు విభిన్నంగా చెప్పాలి. స్వగతాలూ జనాంతికాలూ కూడా ప్రేక్షకులకు వినిపించేలాచెప్తున్నా యవి ప్రకాశసంభాషణలు కావనేభావం ప్రేక్షకులకు కలిగితీరేలా వాటిని చెప్పాలి.

సాత్వికాభినయంలో దిట్టలైననటులు యాంగికవాచిక ఆహార్యాభి నయాలను మిన్నగా ప్రదర్శించగలరు. సర్వ అవ యవ వ్యాపారులను మనస్సు యెలాగయితే నడుపుతోందో సాత్వికాభినయం యలాగే తతిమ్మా యభినయాలను నడుపు తుండదు. నటుడు తాను ధరించేపాత్రయొక్క అప్పటి స్థితి గతులను యాలోచిస్తూ యందులో ప్రవేశించడానికి ప్రయ త్నిస్తూ నటించాలి. నటుడు ప్రాపంచిక పాత్రమీద గెలుపు సంపాదించిందిక్కడే. ప్రాపంచికపాత్ర యొక విషయాన్ని అనుభవించి ఆ విధంగా ప్రవర్తిస్తుంది. కాగా నటుడు విష యాన్ని యనుభవించకుండా యూహించి ప్రదర్శిస్తాడు.

నటుని యూహాశక్తి యెక్కువగా బయల్పడేది సాత్వికాభినయంలో. త్వరత్వరగా పాత్రలో లీనం చెందడానికి వీలుగా నటుడు తదేకత ( Concentration ) యలవరచుకోవాలి. జరగని యొకసంఘటన జరిగినట్టు యూహించి తదనుగుణంగా రసోత్పత్తి చేయడానికి మనస్సు పరిపరివిధాల పరుగులు తీస్తుంటే సాధ్యంకాదు. అంచేత మనస్సు నిలకడకు సాధన యవసరం. మరోవిషయం : సాత్వికాభినయం యనుకున్న ఫలితాలు సాధించాలంటే ప్రేక్షకులుకూడా కొంతవరకూ పాత్రలో లీనమవాలి. అందుకుగాను ప్రేక్షకులను కూడా యూహాజగత్తులోకి తనతోబాటు తీసుకువెళ్ళగలశక్తినటునకు అవసరం. మంచిసాధనతో అనుభవంమీద యీవిషయంలో కూడా చక్కని ఫలితాలు సాధించవచ్చు

ప్రేక్షకుల యభిరుచుల్నీ, Response నీ బట్టిస్థూల, సూక్ష్మాభినయాలను మారుస్తూ ప్రదర్శించగలగటం యొక విశిష్టత. ఇది అందరివల్లా కాకపోవచ్చు. అయినా సాధ్యమైనంతవరకూ ప్రేక్షకుల యానందాన్ననుసరించి నటించడం మంచిది.

నాటకంలో నటించే ప్రతిపాత్రా రంగస్థలంమీద యున్నంతసేపూ కథలోనూ సంభాషణలలోనూలీనంకావాలి, జరిగేదీ జరుగబోయేది తాము చెప్పాల్సిందీ చెయ్యాల్సిందీ యింతకుముందే తమకు తెలిసినా తెలీనట్టూ అప్పటికప్పుడు సంభాషణా సన్నివేశాల పరిణామాన్నిబట్టి ప్రవర్తిస్తున్నట్లూ

నటించాలి. మరోపాత్ర నటిస్తుంటే తదనుగుణంగా Reaction చూపాలి సాధారణంగా మరోపాత్ర తన సంభాషణ చెప్పూచున్నప్పుడు నాఘాన్నరానీ నాతడాఖాకూడా చూపిస్తారే యన్నట్టు బుర్ర క్రిందికీ మీదికీ ప్రక్కలకూ యూపుతూ నుంచోటం రియాక్షన్ నసిపించుకోదు. ప్రక్క పాత్ర చెప్పే సంభాషణ్ని యనుభవించాలి. రంగస్థలంమీద పాత్రలే నాటకంలో లీనంకాకపోతే యిక ప్రేక్షకులసంగతి చెప్పాలా?

ఈమధ్య "ఫలానా నటుడు ఓవర్ యాక్షను చేసాడు" అన్నమాట చాలామంది నటం నేర్చుకున్నారు. నటనలో ఓవర్ యాక్షను అన్నది లేదనేది చాలామంది పెద్దనటుల అభిప్రాయం! కానా "అండరుయాక్షన్"ను గురించి వీరే అక్కడక్కడ ప్రసందలింపులు చేసినట్లుకూడా తెలుస్తుంది!! మనం ఓవరు యాక్షను అనుకునేది పాత్రధారి పాత్రను సరిగా అర్థం చేసుకోనక నటిస్తున్న విధానం. ఒక్కొక్కప్పుడు చూచేవారికి కూడా పాత్రస్వభావం తెలియక ఓవర్ యాక్షను అనుకుంటారు ఉదాహరణకు ప్రతాపరుద్రీయంలో పిచ్చివానిపాత్ర, కొంతవరకూ పేరిగాని పాత్ర. ఈ పాత్రలకు మోతాదుమించిన నటన అవుసరం. అది ఓవర్ యాక్షనుకాదు. పాత్రలస్వభావం లోనే వున్నదీ ఓవర్ యాక్షను. అది ప్రదర్శించకపోతే "అండర్ యాక్షను" అవుతుంది. పేరిగాడు ప్రతాపరుద్రుడౌతాడు పిచ్చివాడు యుగంధరుడౌతాడు!!

ఒకదృశ్యంలో చెప్పేవారూ వినేవారూ ఇద్దరే కాక మరికొన్ని పాత్రలుంటాయనుకోండి. ఇవన్నీ రథంమీాది బొమ్మల్లా కూర్చుని గుడ్లు మిటకరిస్తూ చూస్తూంటాయ్. ఇది చాలా అసహ్యంగా వుంటుంది. ఉదా: కురుక్షేత్రంలో ధృత రాష్ట్రుని కొలువుకూటం. బహుళప్రచారంగల యీా నాట కాన్ని గురించి చెప్పాల్సిందేముంది!

రంగస్థలంమీాద పనిలేనిపాత్ర అంటూవుండదు. సంభా షణలు లేనంతమాత్రాన ఆపాత్రలు దిక్కులుచూస్తూ మర బొమ్మల్లా నుంచోకూడదు. జరిగే సంభాషణలనుబట్టి వీరు కూడా నటిస్తూండవచ్చు. ఇటువంటి పాత్రలు నటించే టప్పుడు ముఖ్యపాత్ర (అనగా అప్పుడు సంభాషణలు చెప్తూ ప్రాధాన్యంవహించేపాత్ర)కు అడ్డుతగులకూడదు. అతని సం భాషణలూ నటనా చూడటం మాని యీా పాత్రలవంక ప్రేక్షకుల దృష్టి మళ్ళేలా ప్రవర్తించకూడదు. ఎవరన్నా ప్రేక్షకులు హఠాత్తుగా యీా పాత్రలవంక చూసినప్పుడు మటుకు యివి నిర్వ్యాపారంగా నిలబడి కనిపించకూడదు.

నటనావిధానంలో అప్పుడూ, ఇప్పుడూ, యిక ముందూ కూడా మార్పులు అనేవి వున్నాయని గమనించాలి. ఇవి ఎందుకు? ప్రేక్షకుల అభిరుచులు మారుతుంటే నటనకూడా మారుతోంది, మారితీరాలి. లేకుంటే అది నాశనం అవుతుంది. వెనుకబడిన ప్రాంతాలప్రేక్షకులకు నచ్చిన నటన విద్యాధికు లైన విజ్ఞానవంతులకు నచ్చకపోవచ్చు. కొన్నాళ్ళకు వెనుక

బడిన ప్రాంతాలవారుకూడా విద్యార్థికులు మెచ్చే నటన కల వాటుపడవచ్చు. విద్యార్థికులకూ విజ్ఞానవంతులకూ సాంప్ర దాయనట వని లేనిపోనివేవో ప్రదర్శిస్తూ కూర్చుంటే నాటక మంటే మొహం మొడుతుంది. అంతేగాక మరొకఅపహాస్యంగా కూడా వారు భావించవచ్చు. అందుకనే "అసంపూర్ణ రామాయణం" లాంటి వ్యంగ్యనాటికలు బహుళ ప్రచారం లోకి వచ్చాయి!

నాటకాభినయం శాస్త్రమా, కళా, అనే చర్చ అనవు సరం. కావలసిందల్లా ప్రజానురంజకంగా అభినయించగల్గటం. ఇందుకు తగు కృషి అవుసరం.

## ఔత్సాహిక నాటక ప్రయోగము

### (e) ఆహార్యం

#### 1. పాత్రధారణ. అలంకరణ (Make up).

ఔత్సాహిక నటులలోనేమి వృత్తి నటులలోనేమి పాత్రధారణను గురించి తెలిసినవారూ, తెలిసి యాచరించ గలిగినవారూ, బహు కొద్దిమంది. మేకప్‌లోని మూల సూత్రాలు తెలుసుకొన్నంతమాత్రాన తమకుతాము మేకప్ చేసుకోవడంగాని, లేక మేకప్‌లో తాముపార ప్రజ్ఞావంతుల మనుకోడంగాని పొరబాటు.

కొద్దోగొప్పో మేకప్ తెలిసినవారుకూడా తమ ముఖానికి రంగువేసుకోడానికి ధైర్యంచాలక మేకప్‌మాన్ వద్దకు చేర్తారు. 'నాకు ముందు వెయ్యమంటే నాకు ముందు వెయ్య'మని.

ఔత్సాహికనటునకు యెప్పుడోగాని రంగస్థలమెక్కే యవకాశం లభించదు. మేకప్‌మీద యెన్ని పుస్తకాలుచదివినా యెన్ని డిమాన్‌స్ట్రేషన్సుచూచినా యవకాశాలుతక్కువగుట మూలాన సాధనచేసి ప్రత్యేకత సంపాదించే యవకాశ ముండదు. అందుచేత యెందుకీ బాదరబందీయుంటాయని మేకప్‌కు మరొకరిమీద యాధారపడతారు. ఔత్సాహిక నాటకాలకు కుదురుకున్నా ప్రొఫెషనల్ మేకప్‌మాన్ ప్రొఫెషనల్ గానే వ్యవహరిస్తారు. అతనికి పాత్ర స్వభావం మనసూ వగైరాలు తెలుసుకుని ప్రత్యేక మేకప్ చేయాలనే యాసక్తి యుండదు. కాగా యిందుకుగాను మన సమాజంతో పాటు (అందులో నొకడుగా) మెలగగల మేకప్‌మాన్ దొరకటం లేక తయారుచేసుకోగలగడం యా సమాజపు యదృష్టమనే చెప్పాలి.

సాధారణంగా మేకప్‌మాన్ ముందు కూర్చున్నవారు తమ వేషస్వభావం వయసూ యతనికిచెప్పరు. మనసెక్కడో వుంటుంది. ఉత్సాహం యెగదన్నుతూంటుంది. మేకప్‌మాన్ కివ్వేం పట్టవు పరసపెట్టె రంగుకొట్టుకురావడం కార్యక్రమంలో ఓపన్నండేళ్ళ బాలాకుమారుడిలా తయారుచేసివదలి

'ఆఁ అద్దం చూచుకోండి' యంటాడు. తీరా యద్దంచూసుకుని "అయ్యో కొంపముంచావయ్యోయ్. నేను వేసేది ముసలాడి వేషమని" లబలబలాడ్తావు "ఆమాట ముందే చెప్ప లేక పోయారా? సరేరండి" యని యిక ముఖంనిండా పిచ్చిగీతలు గీసి వదుల్తాడు. అప్పుడా వేషం మనం అనుకున్నట్లు ముసలిముఖం గాకుండా జబ్బుమొహంగానో మహాలాగానో యుంటుంది.

తనకు తాను మేకప్ చేసుకోడం తెలికేకాని కొంచెం శ్రద్ధా మంచి ప్రాక్టీసూ యుండాలి. మేకప్ యంటే రెండు చేతులకీ యింత గ్రీజ్ పెయింట్ (కేక్) తీసుకుని బాగా మర్దించి మొహానికి టపా టపా బాదుకోడం కాదు. (మా చిన్నతనంలో యిలాగే సర్దాగా యుండేదనుకోండి!)

మీరెంతో పోర్షన్లు కంఠస్థం చేసి మీ పాత్రను క్షుణ్ణంగా నటించగలమనే ధైర్యంతో నాటకప్రదర్శనకు హాజరయారు. మేకప్ చేసుకోడానికి కూచున్నారు. ఆఖరుసారి చేసుకుంటున్న యీ మేకప్‌నే మీరు రంగస్థలం మీద ప్రవేశించగానే ప్రేక్షకులు ముందుగా చూచేది. ఈ పునాది మీదనే మీరు యెంతో గొప్పగా నటించబోయే పాత్రనిర్మాణం, పరిణామం యాధారపడ్డాయి. అందుచేత యిది యెంత ముఖ్యమో ఆలోచించుకున్న నటుడు మేకప్ గురించి ప్రత్యేకశ్రద్ధ తీసుకుంటాడు. మేకప్‌లో రంగుల కలయిక తెలియాలి. ఏయే రంగులు కలిస్తే ఏయే యెఫెక్టు వస్తుందో

బాగా తెలియాలి. అవసరమైతే నీ రంగుల కలయికమీద ప్రయోగాలుచేయాలి. ఏవో కొన్ని యింగ్లీషు పుస్తకాలు చదివి కేకుల నెంబర్లు తెలుసుకుంటూ జపంచేస్తుంటే మేకప్ చేతకాదు. ఇంగ్లీషు పుస్తకాలలో వారు వ్రాసిన మనుషుల రంగూ మనరంగూ వేరు. ఆ నెంబర్ల కేకులు (గీజ్ పెయింట్స్) మనకు పడవు. కనుక పుస్తకాలు చూచీ, నెంబర్లు కంఠస్థం చేసి మోసపోకండి. స్వంతంగా ప్రయోగించి యేయే నెంబర్లు గల రంగులు యేయేవిధంగా సరిపోతాయో తెలుసుకోవాలి. అయితే యీ ప్రయోగాలు ప్రదర్శన ముందుమటుకు చెయ్యకండి. ఇంటిదగ్గిరచేసినా మీరుతప్పే అవకాశంవుంది. రంగస్థలంమీద యెంతలైటు వుంటుందో అంతలైటూ పెట్టుకుని ఈ ప్రయోగాలుచేయాలి. రంగులకు కాంతికీ (లైటుకూ) చాలా సంబంధంయుంది. కాంతిప్రభావం రంగుల్ని తమాషాగా మారుస్తుంది.

మేకప్ సామానులు మంచివి యెంచుకుంటే యెట్టే శ్రమపడకుండా చక్కగా మేకప్‌చేసుకోవచ్చు. చెప్పుడు మాటలువిని చెడ్డసామానులు తెచ్చుకుంటే మీరెంతచక్కగా నటించదల్చుకున్నా రంగస్థలంమీద మీపాత్రధారణ సరిగా లేకపోతే రసాభాసమవుతుంది. (మధ్యలో మీసాలూడిపోవడం రంగువున్నట్టుండి బీటలుపడిపోవడం లేక కారిపోవడం వగైరాలు). మీకు పరిచయంలేని పరికరాలు యనుభవం సంపాదించకుండా మొదటిసారిగా వాడకండి.

ఈ క్రింది మేకప్‌సామానులు ప్రతినాటకానికీ యుప
యోగిస్తాయి.

1. గ్రీజ్ పెయింట్ - నెం 2, $2\frac{1}{2}$, 3, 5, 9.
2. కార్మైన్ (ఛీక్స్ రెడ్ లేక రూజ్) నెం 2, 3.
3. రోజ్‌పౌడరు (ఫేస్‌పౌడరు)
4. సఫేద్ (జింక్‌పౌడరు)
5. ఎరుపురంగు (గుమ్మాలకి వేసుకునేది మంచిది) 1తులం
6. పసుపురంగు ,, ,,
7. స్పిరిట్‌గమ్
8. ఐబ్రోపెన్సిల్స్ (నలుపు, బ్రౌన్)
9. ఐషేడ్స్‌కు వివిధరంగుల కణికలు
10. పౌడర్‌పఫ్ (లాంబ్స్‌వూల్) పాడ్స్
11. క్రేప్ హెయిర్ (అనేక రంగులుంటాయి మనకు తెలుపు, నలుపు, గ్రే రంగులుచాలు)
12. కొబ్బరినూనె.
13. సబ్బు (లక్సు శ్రేష్టం)
14. రంగు తుడుచుకునేందుకు కొత్తగుడ్డముక్కలు లేక పాతవైనా బాగా వుతికించినవి (వీటికి లోపిస్తే కర్తెనులనిండా దుస్తులనిండా రంగుపులిమి యుంటుంది జాగ్రత్త!)
15. చిన్న కత్తెర (మంచిది)
16. అద్దం (పెద్దవీ చిన్నవీకూడా)

17. సేఫ్టీపిన్నులూ
18. సూదీ దారం.

స్పిరిట్ గమ్, కొబ్బరినూనె సీసాలు అవసరం ముగియకుండానే తన్నేసి ఒలకబోసేస్తారు హడావిడిలో; ఎవర్నీ యేమీ యనటానికి వీలుండదు. పైగా పారబోసుకున్నాక యెవర్నని మటుకు యేమి ప్రయోజనం? అంచేత వీటికా ప్రమాదం రాకుండా ముందే జాగ్రతపడాలి. ఖాళీ సిగరెట్టుడబ్బాలలో యిసుకపోసి యీ సీసాలను వాటిలో గుచ్చి వుంచుకోడం మంచిది.

స్పిరిట్ గమ్ ముందుగా టెస్టుచేసుకోవాలి ఒకటి రెండు చుక్కలు బొటనవ్రేలుమీద వేసి చూపుడు వ్రేలుతో పట్టిచూస్తే సరిగా అతికేదీ లేందీ తెలుస్తుంది సరిగా అతక్క పోతే కాస్త రెజిన్ మెత్తగానూరి తగుమాత్రంగా కలిపి బాగా గిలకరించండి.

వేషధారణకు కొద్దిక్షణాలు ముందు చక్కగా గడ్డం గీసుకోవాలి. ప్రొద్దున్నే చేసుకున్నాలెద్దూ అని తీరా గ్రీజ్ పెయింట్ వేసుకునేసరికి గడ్డమంతా అసహ్యంగా కనిపిస్తుంది. పౌడరు వేసేసరికి అసలు చూడలేకుండా తయారవుతుంది.

గడ్డంగీసుకున్నాక : చెమటా, మట్టీ, నూనెజిడ్డూ లేకుండా ముఖం సబ్బుతో సుభ్రంగా కడుక్కోవాలి. లక్సు సబ్బు నాటకాలప్పుడు వాడటానికి బహుశ్రేష్టం. కొన్ని యితర సబ్బులు వున్న జిడ్డుకుతోడు మనోకొంత మైనంలాంటి బంకను పట్టిస్తాయి.

తలవెంట్రుకలు ముఖంమీద పడకుండా వెనక్కి దువ్వుకోవాలి. అవసరమైతే ఒక గుడ్డపీలిక తలకు కట్టుకోవాలి తలవెంట్రుకలు ముఖంమీదపడి గ్రీజ్ పెయింటు వేసేటప్పుడు చీకాకుచేయకుండా ఇక మనవేషానికి సరిపోయిన నెంబరు గ్రీజ్ పెయింట్ కొంచెంగా కుడిచేతి చూపుడువ్రేలుకు తీసుకొని యెడమ చేతి అరచేతిలో వ్రాసి దాన్ని బాగా మర్దించాలి. చేతివ్రేళ్ళకి వుంగరాలుంటే వాటిని తీసెయ్యాలి కేకు (గ్రీజ్ పెయింట్) పాతదైతే బిగుసుకుపోయి వుంటుంది. ఎంత మర్దించినా పాకానపడదు. ఇలాంటి కేకునుగాని, లేక చేతులకు పట్టించుకున్నాకగాని పెట్రోమాక్స్ లైటు తలదగ్గర పెట్టివుంచితే మెత్తపడుతుంది. గ్రీజ్ పెయింట్ ముఖానికి యెక్కువగా పట్టించుకోగూడదు.

మేకప్ అనేది ముఖభావాలు కనిపించకుండా వేసుకునే ముసుగుకాదు. ముఖాన్ని తేజోవంతంగానూ భావప్రకటన కనుగుణంగానూ వుండేట్టూ చెయ్యాలి.

మేకప్‌లో సాధారణంగా రెండువిధాలు :

(1) సామాన్యమైనది.

(2) ప్రత్యేకమైనది.

సామాన్యమేకప్ అంటే ముఖాన్ని వున్నదున్నట్లు మెరుగుదిద్దేసెయ్యటం. ప్రత్యేక మేకప్ అంటే ముసలి ముఖాలు, వికృతాకారాలు స్పెషల్ యెఫెక్ట్సు (మసూచికం వ కరటెంకర్లు వగైరా) చూపటం.

ఈ రెండు తరహాలకు కూడా గ్రీజ్ పెయింటు వేసు కోడం పొడరద్దుకోడం వరకూ ఒకటే. కాగా ప్రత్యేక మేకప్ వాడబోయేవారు గ్రీజ్ పెయింట్ రంగులు మార్చుకోవాలి. ఒకేమారు ఒకరంగుగాని ఒక్కొక్క భాగానికి ఒక రంగు చొప్పునగాని వాడాలి.

గ్రీజ్ పెయింటు సాధారణంగా నెం 2 లేక $2\frac{1}{2}$ అన్ని ముఖాలకీ వాడ్తారు నె బర్ల బాధ ఆట్టే లేకుండా ఓ సులువు సూత్రం చెబుతాను. పసుపూ యెరుపూ రంగులు వాడటంలో మీరు నేర్పరితనం సంపాదిస్తే నెం 2 లో మీరు కోరిన రంగులు తెప్పించుకోవచ్చు. ఈ రంగుల మిళితం జాగ్రత్తగా ముందు పరీక్ష చేసుకోవాలి. మీరీరంగుల మిశ్రితం చేయగల నేర్పు బాగా సంపాదించాలి. అప్పుడు యెన్ని యేళ్ళ వయ స్సుకు యేరంగు బాగా నప్పుతుందో యిప్పటికప్పుడు మీరే తయారుచేసుకోగలరు. ఇదీగాక మనలో కొందరు తెల్లతోలు వాళ్ళు కొందరు నల్లతోలువాళ్ళూ వుంటారు. అంచేత యేదో ఓ నెంబరు పట్టుకు ప్రాకులాడకూడదు. నల్లవాళ్ళకు ఎరుపూ పసుపూ రంగులు ఓమోతాదు యెక్కువపడాలి. తెల్లవాళ్ళకు యివి అంతగా యెక్కువ కలపకూడదు.

గ్రీజ్ పెయింటు రెండుఅరచేతులమీదా బాగాపల్చగా అయేలా మర్దనచేసుకోవాలి. అలారుద్దుకుంటూనే రెండు అరచేతులూ రెండు చెంపయెముకలమీదా (ఛీక్ బోన్స్) బాగా అదుముకోవాలి తరువాత నుదురుకీ గడ్డానికీ అదుముకోవాలి,

అంటే యీభాగాలు రంగుతో హైలైట్ కావలసినవన్న మాట. ఇక ముఖం అంతా అద్దుకుని జాగ్రతగా కలుపుకురావాలి. ముఖంఅంతకీ(ముందు అద్దిన నాలుగుచోట్లూ కొంచెం యెక్కువగా) సమానమైన ఫిల్మ్‌పడేట్టుగా పులమాలి. ఈ గ్రీజ్ పెయింట్ యెక్కడా యెక్కువ తక్కువలు (మాసికలు, పొడలు) పడకూడదు. చెవుల గుంటలన్నింటిలోనూ బహు శ్రద్ధతో పులమాలి. గడ్డంక్రిందా, మెడముందూ వెనుకలూ జాగ్రత్తగా రంగు కలిసేలా పులమాలి.

చాలామందికి ముక్కుకి గ్రేజుపెయింటు సరిగా పట్టదు. (ముక్కుమీద చెమట పోసేవారికి మరీను) యెక్కువన్నా యవుతుంది, తక్కువన్నా యవుతుంది. పొడలు పొడలుగా వస్తుంది. తీరా పొడరద్దే సరికి యీ లోపం విపరీతంగా కనుపించి రంగు కడిగేసుకోవాలసి వస్తుంది. కనుక ముక్కుకి గ్రేజుపెయింటుచాలాజాగ్రత్తగా వాడాలి. ముక్కు ముఖంలోని యన్ని భాగాలకన్నా (చెవులు మినహా) చల్లగా యుంటుంది. (ముక్కుమీద చెమటపోసే వారికి మరీను). గ్రీజుపెయింటులోని మైనం యీ చల్లదనానికి తగిలీ తగలకుండానే యీ భాగాలలో గట్టిపడి పోతుంది. గట్టిపడిపోయిన పెయింటు బాగా పులమడానికి వీలుగాక పొడలూ, యతుకులూ యేర్పడుతాయి. అందుచేత ముక్కుకి గ్రీజుపెయింటు వేసేటప్పుడు ముక్కును పొడిరుమాలుతో తుడవాలి, అవుసరమైతే కొంచెం రుద్దితే సరి వేడెక్క-

తుంది. రంగును తొందరగానూ గట్టిగానూ చేతులతో రుద్దుకుంటూ ముక్కుకు పట్టించుకుంటూ యుంటే యీ భాగానికికూడా రంగు బాగా పడుతుంది.

మామూలుగా నాటకాలలో వాడే గ్రీజుపెయింటు తడితగిల్తే గట్టిపడి ఫిక్సు అయిపోతుంది. ఏ పరిస్థితిలోనూ పౌడరునొక్కి గ్రీజుకు నిగారింపు తగ్గేలా చేయకుండా గ్రీజు పెయింటుకు తడి తగులనీయరాదు.

ఇంతవరకూ గ్రీజు పెయింటు మేకప్‌కు పునాదియని తెలుసుకున్నాం ఈ పునాదిమీదే ముందు ముందు మీరు చేయబోయే మేకప్ యంతా యాధారపడి యుంటుంది. అందుచేత యిది చాలా జాగ్రత్తగా చేసుకోవాలని మరో మాటు నొక్కి చెబుతున్నాను. ఏ పరిస్థితులలోనూ గ్రీజు పెయింటు యెక్కువగా పట్టించుకోవద్దు. తక్కువైతే మరో కోటింగు వేసుకోవటంలో వున్నహాయి యెక్కువ పట్టించుకుని తక్కువ చేసుకోవడానికి గుడ్డతో తుడుచుకోవడంలో లేదు!

గ్రీజు పెయింటయినాక ఛీక్స్ రెడ్ (రూజ్)వాడాలి. ఇదీ యనేక రకాలు, రంగుల మార్పుకూడా యుంటుంది. ఏ రంగు కావాలో మాటిమాటికీ మీరు పుస్తకాలలో చూచే యలవాటు మానుకోవాలి. అనుభవం మీద తెల్సుకోవడం మంచిది. తెలియని సామానులు వాడకండి. పెద్ద పెద్ద పేర్లున్నాయి కదాయని. ఎట్టి కేసు యెప్పుడూ చీక్సుకు

వాడకూడదు. ఇది ఫిక్సుకాక కొంతసేపటికి కరిగి కారటం ప్రారంభిస్తుంది. అన్నిటికన్నా శ్రేష్ఠం మంచికంపెనీవారు తయారుచేసిన గుమ్మాల రంగు. పేర్లమీద మోజుంటే Carmen 2 వాడండి. ఎట్టటివాళ్ళయితే రెండుబుగ్గలూ కొంచెం గిల్లండి. రెండు బుగ్గలమీదా యెఱ్ఱధాళు దిగు తుంది. ఒక 'స్పాట్'లో యెక్కడ యెఱ్ఱరంగు పట్టించండి. కొంచెము యెక్కువగానే! (మరీ యెక్కువద్దుసుమా!) ఆ ముద్దను, లేక చుక్కను ముక్కువేపుకూ, చీక్‌బోన్‌వైపుకు బుగ్గలవైపుకూ సర్దుకు రావాలి. రుద్దకూడదు. ముందు రంగు యెటించినచోట కొంచె మెక్కువగానూ సర్దినచోట్ల లో పేడ్ వచ్చినట్లుగానూ వుండాలి. ఇది చాలా బాగుం టుంది. మొగవారికీ నల్లవారికి, ఛీక్‌బోన్ క్రిందుగా రంగు మచ్చ పెట్టి పై మాదిరిగానే సర్దుకురావాలి.

పడుచువేషాలకు యిదేరంగును కొంచెంగా నుదుకు యీ చివరనుండి యీ చివర వరకూ ఒంటిరేఖ విభూతిలా పెట్టాలి. ఆ గీతను క్రిందకూ పైకీ సర్ది వేయాలి. మూడు వ్రేళ్ళకూ కొంచెంగా పట్టించుకుని చెవులమీద యద్దుకొని సర్దుకోవాలి. గడ్డం క్రింది యెముక మీద యీ చెవి తమ్మె క్రిందనుంచి యీ చెవితమ్మె క్రిందవరకూ యెుక వ్రేలు వెడల్పున వ్రాయాలి. గడ్డంముందు భాగానికి (క్రింది పెదవి క్రింద యేర్పడిన గుంటలో) పెదవి వెడల్పున యద్దాలి. ఇవన్నీ సరిగా సర్దుకోవాలి ముక్కు దూలానికి ముక్కుపుట

కలు పెట్టుకొనే చోట కూడా యద్దాలి. ఒక్కమాటలో చెప్పాలంటే యౌవనరక్తం మిసమిసలాడుతూ ప్రవహించే యన్నిచోట్లా యీ యెర్రరం గద్దాలి. దాన్ని జాగ్రత్తగా సర్దాలి. రుద్దకూడదు. ఛీక్స్‌కు వేసిన షేడ్ కన్నా ముఖం మీద యితరచోట్ల వేసిన షేడ్స్ తక్కువగా వుండాలి.

ఇక్కడ యవసరమైన వేషాలకు ఐషేడ్స్ దిద్దుకోవాలి. లైట్ మేకప్పులకు ఐషేడ్స్ యనవసరం. ఎరుపు, బ్రౌను, సిల్వర్, గ్రే, రంగుల పెన్సిళ్ళతో యీ షేడ్లు దిద్దుకోవాలి. లేకుంటే ఆయారంగులు జాగ్రత్తగా అగ్గిపుల్ల (వెలిగించి ఆర్పివలిపితే మొనవస్తుంది) తో కనురెప్పలవద్ద దిద్ది వాటిని పైకనురెప్పకు పైకీ, క్రిందికనురెప్పకు క్రిందికీ సర్దాలి.

ఇక పౌడరు వేసుకోవచ్చు ఇది రోజ్ గాని లేక Broun (బ్రౌన్) (ఎరుపు, పసుపు, రంగులు మిశ్రితమైన రంగు) గాని యుండాలి. (ఈ రంగులు కలిస్తే చర్మపు రంగు వస్తుంది) పౌడరు కొంచెంగా అక్కడక్కడ అద్దితే లాభం లేదు. పౌడరు అద్దడానికి చెయ్యి వుపయోగించరాదు. "లాంబ్స్ వూల్ పఫ్" యుపయోగించాలి. ఎక్కువైతే మెత్తని బ్రష్‌తో తుడిచివెయ్యాలి. ఆ అద్దినపౌడరును గ్రీజ్ పెయింటుయొక్క నిగారింపు తగ్గేలా మెత్తని గుడ్డతో వత్తాలి. తరువాతకూడా యెక్కువతక్కువలుంటే జాగ్రత్తగా కలుపుకు సరిచేసుకోవాలి పౌడరుఅద్దకం సరిగాకలిసాక చేతులు రెండూ నీళ్ళలో ముంచి విదిలించేసి (చేతులు కొంచెం తడిచేసుకొని)

మొహం యంతటా యద్దుకోవాలి. పౌడరు యద్దటంలో యింకా యేమైనా మిగిలిపోయిన తేడాలను యీతడిచేతితో సవరించేసుకోవాలి. ఇప్పుడు మేకప్ ఫిక్స్ అయిపోయిందన్న మాట.

ఏ పరిస్థితుల్లోనూ పౌడరుయద్ది రంగు ఫిక్స్ చేయకుండా కనుబొమ్మలు, కనురెప్పల వెంట్రుకలకు నల్లరంగు పులమ రాదు. అది ముందుగా వాడితే పౌడరుయద్దేటప్పుడు మొహం యంతటికీ నల్లరంగు పడ్తుంది.

కనుబొమలు (స్పెషల్ మేకప్ లేకపోతే) నల్ల పెన్సులతోగాని యిందాకా చెప్పినలాటి మొన దేల్చిన యగ్గిపుల్ల తోగాని నల్లరంగుతో దిద్దుకోవాలి. ఇక్కడకూడా 'బ్లాక్ కేక్' వాడటం మంచిదికాదు. ఇదీ కరిగి క్రిందికికారుతుంది కాటుక వాడవచ్చు జాగ్రత్తగా. చూపుడువేలు బొటన వేలు మునుగోళ్ళతో కొంచెం నల్లరంగు తీసుకుని జాగ్రత్తగా కనురెప్పల వెంట్రుకలను సవరదీయాలి. ఛాక్సుకూడా నల్ల రంగుతో కలుపుకోవాలి. నుదురుపక్కలజుట్టుకునల్లరంగుతో తేలికగా "టచ్" చేయాలి.

ఇక లిప్‌స్టిక్ : కొందరు పెదవులచుట్టూ గీతగీసుకుని జాగ్రత్తగా యెర్రరంగు పట్టిస్తారు ఇదిబాలెట్ బాక్స్ చిల్లలే కనిపిస్తుంది మొగవాళ్ళకు, అందులోనూ ముసలివాళ్ళకు యే పరిస్థితులలోనూ లిప్‌స్టిక్ వాడరాదు. ఐతే పడుచు(మొగ) వాళ్ళకూ, మరీ నల్లగా వున్నవారికి మటుకు కొంచెం యెర్ర

రంగు (కార్మైన్ నెం. 2) క్రింది పెదవికి రాసుకుని పై పెదవితో నొక్కుతూ సరిచేసుకోవాలి. రెండు పెదవులకూ ఎప్పుడూ ప్రాయువద్దు ఆడపాత్రలకులిప్స్టిక్ కార్మైన్ 2తో కాస్త జింక్ పౌడరు కలిపి క్రిందిపెదవికి చుక్క పెడితే ఆ పెదవులు ఆహ్వానిస్తున్నట్లుంటాయి!

కొందరు బ్యూటీస్పాట్స్ (నల్ల చుక్కలు) పెడ్తారు. ఇవి స్త్రీపాత్రలకు వాడటం మంచిదే ముఖభంగిమలనుబట్టి గడ్డంప్రక్కల, పెదవులపైన, ముక్కు క్రిందుగా (యేదో ఒక వైపు) ఒక్కొక్కప్పుడు ఫాలభాగానికో ప్రక్కకూడా యీ చుక్క పెట్టవచ్చు.

"ఆకర్ణాంత విశాలనేత్రాలు" కావాలంటే నల్లరంగు చారవెలుపల కనుకొలనుంచి కణతలదాకా లాగవచ్చు.

ఏదైనా అతిగా మాత్రం చెయ్యకండి. అన్ని అందాలూ ఒకరికే పెట్టేస్తే తలిసెట్టి రామారావుగారి "ప్రబంధసుందరి" తయారవుతుంది! గుండ్రటి ముఖంకలవారికి ఆకర్ణాంతవిశాల నేత్రాలు పెడతే హార్డీమహాశయుడు జ్ఞాపకం వస్తాడు!

కోపపాత్రలకు కనుకొలుకులలో (ముక్కుప్రక్కనున్న భాగం) ఎర్రచుక్క పెట్టాలి. అయితే నాటకంలో యీమాదిరి మేకప్ (పాత్ర స్వభావవివరణచేసేది) అనవసరం. నాట్యాలకు మాత్రం యిది పనికివస్తుంది. నాటకంలో ప్రవేశించిన పాత్ర మొదట్నించీ చివరవరకూ కోపంగా వుండనక్కరలేదు. ఎప్పుడో యెక్కడో కోపంవస్తుందని మొదట్నించీ కను

కొలకుల్లో యెఱ్ఱచుక్కలు పెట్టుకుకూర్చోనక్కరలేదు నటుడు తగుమాత్రపు మేకపుతో రసాలన్నీ, నటిస్తూ ఒప్పించాలి. రసానుగుణంగా మేకప్‌లో వున్నాయికదా అని పుస్తకాలలో వ్రాసినట్లు చేసుకు కూర్చోకూడదు.

ఇక మీసాలూ గడ్డాలూ వగైరాలు పెట్టుకోవచ్చు. అయితే అయినదానికీ కానికానికీ క్రేప్‌హెయిర్ జోలికి పోవడం చాలా ప్రమాదకరం సాధ్యమైనంతవరకూ నల్లపెన్సులు క్రేప్‌హెయిర్ స్థానం యాక్రమించటం మంచిది. తప్పనిసరిగా క్రేప్ హెయిర్ వాడవలసివస్తే మటుకు కొన్ని ముందుజాగ్రతలు అవుసరం.

స్పిరిట్ గమ్ ముందుగా టెస్టుచేసుకోవాలి. ఇదివరకు చెప్పాను, మళ్ళీ చెబుతున్నాను. స్పిరిట్ గమ్ సీసా బాగా గిలకరించి ఒకటి రెండు చుక్కలు బొటనవ్రేలుమీద వేసుకుని చూపుడువేలుతో నొక్కిచూస్తే సరిగా అతికేదీ లేనిదీ తెలుస్తుంది. సరిగా అతక్కపోతే కాస్త రెజిన్ మెత్తగానూరి తగుమాత్రంగా కలుపుకోవాలి. ఈటెస్టు నాటకపు క్రితం రోజునే చేసుకోవాలి.

ఇక క్రాప్ హెయిర్‌లోకూడా రెండురకాలున్నాయి. ఒక రకం (తక్కువ ఖరీదువి) నిగనిగలాడుతూ బిరుసుగా యుంటుంది. ఇది బాగా అతకదు. మంచిరకం నిగారింపు తక్కువగా మామూలు వెంట్రుకల మాదిరివుంటుంది మెత్తగా పట్టుకుచ్చువలె వుంటుంది. ఇది మంచిది. ఇది జడల రూపంలో

లభ్యమవుతుంది. కావలసిన దానికంటె యెక్కువగా యెప్పుడూ యీ జడ వూడదియ్యకూడదు. ఒక యింగు శము జడ సుమారైన నాటకం మొత్తానికి సరిపోవచ్చు. జడ వూడదీసి చాలా రోజులు నిలవయుంచింది గుంభన Texture తగ్గిపోయి జావజావగా వుంటుంది

నాటకం రేపనగా శుభ్రంగా జడవూడదీసి (వంకులు పోకూడదు) నీళ్ళలో బాగా నానబెట్టాలి. మర్నాడు యుద యము (అంటే నాటకం రోజున) తీసి శుభ్రంగా పొడి గుడ్డతో యద్దాలి అలా యద్దేటప్పుడు కూడా వంకులు పోకుండా జాగ్రత్త పడాలి. అటుపిమ్మట తగుమాత్రపు యెండలో యారబెట్టాలి. మండుటెండలో దీన్ని యెండవేస్తే కమురుకంపు కొట్టడమే కాక షేప్ చెడిపోతుంది. ఈ విధంగా క్యూర్ చేసుకున్న క్రేప్ హెయిర్ వూడిపోకుండా చక్కగా అతుక్కొని వుంటుంది. బజార్లో కొన్నదికొన్నట్లే వాడితే నూనె జిడ్డు వగైరాలుండి సరిగా అతకదు. నూనె స్పిరిట్ గమ్‌కి విరుగుడు.

క్రేప్ హెయిర్ యంటించాల్సిన భాగానికి స్పిరిట్ గమ్ జాగ్రత్తగా పిల్లలువాడే వాటర్ కలర్ బ్రష్‌తో రాయాలి. రాసీ రాయంగానే క్రేప్ హెయిర్ యంటించ కూడదు. కానేపు యారాలి. బాగా యారాక (పూర్తిగా యెండిపోయినాక కాదు). కావలసినవిధంగా క్రేప్ హెయిర్ యంటించుకోవాలి కొంచెం వేడిగల చేతివ్రేళ్ళతో కానీ

పదిమి పట్టుకోవాలి. మధ్యలో నూనె తగలకుండా వుంటే దీన్ని పట్టుకు ప్రయాస్యాలలూగినా వూడకపోవచ్చు.

క్రేప్ హెయిర్‌తో మీసా లనేకరకాలుగా చేస్తారు. అవన్నీ యిక్కడ చెబితే యీ భాగానికే యొక పెద్దపుస్తకం కావాల్సి వస్తుంది. ముఖ్యమైనవి రెండు రకాలు చెప్తాను.

1. మీసాన్ని (లేక గడ్డాన్ని) కావలసిన షేపులో ముందుగానే తయారు చేసుకుని దాన్ని యంటించుకుని తరువాత కత్తెరతో సరిచేసుకోవటం. ఇది చాలా తేలికపద్ధతి.

2. మీసాల్ని గడ్డాల్ని ముందుగా తయారు చేయకుండా క్రేప్ హెయిర్ కొంచెంకొంచెం తీసుకుంటూ వెంట్రుకల మొదళ్ళు పైనించి కిందకు యంటించుకుంటూ పోతూ దాన్ని యవసరమైనట్టు కత్తెరతో కత్తిరించుకుంటూ పోవడము మరో పద్ధతి.

మొదటి పద్ధతిలో మీసం క్రింది వెంట్రుక లాపొడుగు నుంచీ పొడుగు వరకూ యతుక్కుంటాయి. రెండవ పద్ధతిలో మొదళ్ళు మాత్రమే యతుక్కుంటాయి. ఈ పద్ధతిలో మీసా లతికించిన వానిలా కాకుండా నిజంగా మొలచిన వాటిలాగుంటాయి. అయితే యీపద్ధతి కష్టం. ఈమాదిరి మీసం పెట్టడాని కెంత చెయ్యితిరిగిన వారికైనా పావుగంటకు తక్కువ పట్టదు.

కనుబొమ్మలకు కూడా క్రేప్ హెయిర్ వాడ్తారు. ఇందాక చెప్పినట్లు ప్రత్యేక కారణ ముంటేతప్ప కనుబొమ

లకు క్రేప్ హెయిర్ వాడకండి. ఒక్కొక్క వేషానికి పొదలు లాగుండే కనుబొమ లవుసరమవుతాయి. అటువంటప్పుడూ తప్పని సరయినప్పుడూ మాత్రమే క్రేప్ హెయిర్ వాడండి. లేకుంటే నల్లపెన్సలేచాలు చక్కగా కనుబొమలు దిద్దుకోడానికి.

స్పెషల్ క్యారక్టర్ మేకప్ :— స్పెషల్ క్యారక్టర్ మేకప్ అంటే ఒక మనిషి ముఖం యతని ముఖంలాకుండా మరోమనిషి ముఖంలా కనిపించేటట్టు చెయ్యడం యని పైన మనవి చేసాను.

పైన వివరించిన విధంగా సామాన్యమైన మేకప్‌కు వాడే గ్రీజ్ పెయింటూ, పౌడరూ వాడటం వరకూ దీని కీమామూలు మేకప్‌కూ భేదంలేదు. షేడ్స్‌కోసం నల్లపెన్సలుతో కొన్ని గీతలు గీసేస్తే సరిపోదు.

ముసలిముఖం కావాలంటే సాధారణంగా నుదుటిమీద మూతిపద్దా కొన్ని నల్లగీతలు గీసేస్తారు. కళ్ళచుట్టూరా, బుగ్గలకూ నల్లరంగు పులిమేస్తారు ఈ విధంగాచేస్తే ముసలితనంకన్నా రోగిష్టితనం యెక్కువగా వ్యక్తమవుతుంది.

ఏదో యొక ప్రత్యేక ముఖాన్ని తయారు చెయ్యాల్సి వచ్చినప్పుడుతప్ప (మీ ముఖమే ముసలితనంలో యెలాగుంటుందో అలా తయారు చెయ్యవలసి వచ్చినప్పుడు) మీరు ముసలితనంలో యెలాగుంటారో యలా మేకప్ చేసుకోటం మంచిది.

మీరు ముసలితనంలో యెలాగుంటారో చాలా తేలికగా తెల్సుకోవచ్చు.

కనుబొమలు పైకెత్తి ముఖంచిట్లించితే నుదుటిమీంద గీతలు పడ్తాయి. ఆ గీతలు నల్ల లేక డార్క్ బ్రౌన్ పెన్సలుతో దిద్దండి.

ఆశ్చర్యం ప్రకటిస్తూనవ్వండి, కళ్ళప్రక్కలవంపులు కనిపిస్తాయి. అవికూడా పై రంగు పెన్సలుతో దిద్దుకోండి.

మూతి వెడల్పుచేసి నవ్వితే మూలలు ముడతలు పడతాయి. వాట్నికూడా పై మాదిరి దిద్దండి.

ఈగీతలు గీతలలాకాకుండా ముడతలనే భ్రమకలిగేలా గీసుకోవాలి. అందుకుగాను నల్ల లేక డార్క్ బ్రౌన్ పెన్సలు గీతలప్రక్క తెల్లగీతగీసి దాన్ని మొదటిగీతతో జాగ్రత్తగా కలుపుకుంటూవస్తే వెలుగునీడల యెఫెక్టువచ్చి నిజంగా ముడతలనే భ్రాంతి కలిగిస్తాయి.

ఇదంతా ఒక్కసారి చెయ్యగలపనికాదు. ప్రయత్నం మీందా యనుభవంమీందా మంచి నేర్పరితనం సంపాదించవచ్చు. కాస్త నలుపు లేక నీలంరంగు, గడ్డంపెరిగేచోట (మాసిన గడ్డానికి వాడే విధంగా కాదు) కళ్ళచుట్టూ రారాసుకోవాలి. ఒక్కో వేషస్వభావాన్ని బట్టి ముక్కుకు కూడా ఆ వైపూ ఈ వైపూ యీరంగు రాసుకోవచ్చు.

తలనెరసినట్లు చూపడానికి కొందరు వుత్త తెల్ల ఫేస్ పౌడరు తలవెంట్రుకల కక్కడక్కడ యద్దుతారు. ఇది

చాలా పొరపాటు. ఫేస్ పౌడరు చివరంటూ సిలకదు. మధ్యతో మాసిపోయి తెల్ల వెంట్రుకలు నల్ల పడ్తాయి. మామూలు పౌడరుకు బదులు జింక్ పౌడరు వాడటం మంచిది. కాస్త లేజ్ పీన్ కూడా కలిపి పట్టిస్తే మరీమంచిది.

పళ్ళూడినట్టు చూపడానికి నల్ల యెనామిల్ పళ్ళకి పేయాలి.

గుడ్డికన్ను కోసం యెర్రథాళు నీరుల్లి పొయ సంపాదించి దానిపై (పచ్చని) పొర జాగ్రత్తగా తీసి కన్ను మూసి బాగా స్పిరిట్ గమ్ రాసి, ఆరినతర్వాత ఆ వుల్లి తొక్క యంటిస్తే దగ్గర్నుంచి చూసినవాళ్ళే నిజంగా యది గుడ్డికన్నే యను కుంటారు.

గుడ్లు తేలేసినట్లు చూపడానికి కళ్ళుమూసుకుని పై రెప్పలకు లేజ్ లైనర్‌లో కలిపిన జింకుపౌడరు పట్టిస్తేసరి.

అనుభవంమీాదా పరిశోధనమీాదా యిలాంటి మెల కువ లనేకం కనిపెట్టూ పోవచ్చు. ఈ సందర్భంలో ఒక్క ముక్క మళ్ళీ జ్ఞాపకం చేస్తున్నాను.

"నాటక మంటే లేనిదాన్ని యున్నట్లు ప్రేక్షకుల చేత భ్రమింపజేసే అద్భుతకళ" ఈ సూక్తి ఆహార్యం విషయంలో అక్షరాల నిజం.

కుంకుడుకాయలు రుద్రాక్షలులా కనిపిస్తాయి.

ముచ్చిబంగారం వివిధరంగుల్లో వెండి బంగారంగానూ నవరత్నాలక్రిందా చెలామ ణవుతుంది

సూత్రంలో మాత్రం చూపించటం బాగా నేర్చుకోవాలి.

విగ్గులు (టోపాలు) :

సాధ్యమైనంతవరకివి వాడకండి. విగ్గు మధ్యలో పడిపోతుందేమో ననే భయం మీకు నాటక మాడుతున్నంతసేపూ వుంటుంది. తప్పనిసరిగా యిది పెట్టుకోవల్సివస్తే మంచివిగ్గు మీతలకు సరిపోయినది చూచి వాడండి. దాన్ని నెత్తినెట్టుకోబోయేముందు కాస్త తైలసంస్కారం చేసి దువ్వండి అన్ని వేపులా అదిమేలా గమర్చుకోండి.

విగ్గుపెట్టబోయేముందు తలముందుభాగంలోని వెంట్రుకలు ముందుకు దువ్వి విగ్గుపెట్టి ఆవిగ్గుమీదనుంచి యీ వెంట్రుకలు వెనక్కువిరిచి తలపిన్నులు (అవసరంఅయితే) పెట్టేస్తే విగ్గుపెట్టినట్లుండదు. మామూలు శిరోజకేశములే అనేలాగుంటుంది. ఛాతీనవద్దా కణతలవద్దా యవసరం అయితే కాస్త క్రేప్ హెయి అంటించాలి.

మీసాలు, గడ్డాలు.

ఇవికూడాయప్పటికప్పుడు క్రేప్ హెయిర్ తో నంటించుకోడం మంచిది. లేకుంటే రెడీమేడ్ గా వున్నవన్నా అమర్చుకోవచ్చు చెవులకి కొక్కేలతో తగిలించుకునేవిమాత్రం వాడకూడదు. అవి మధ్యలో వూడిపోతాయి.

## చేతులూ, పాదాలూ.

సాధారణంగా నౌత్సాహికులు చేసే పొరబాటు మెడ, చెవులకు, సరిగా రంగుపట్టించుకోకపోవడమూ, చేతులకూ పాదాలకూ అసలు వేసుకోకపోవడమూను.

ముఖానికిమాత్ర మతి యందంగా రం గద్దుకుని కాళ్ళూ చేతులూ యధాతథంగా వదలివేస్తే అసహ్యంగా కనిపిస్తుంది. చేతులకీ పాదాలకీ గ్రీజ్ పెయింట్ వేసుకో నక్కరలేదు. ఇదివరకు పెరల్ క్రీమ్ పూసుకునేవారు. అది లేనిపక్షంలో, జింక్ పౌడరూ, మన మొహానికి వేసుకున్న రంగుకు సంబంధించిన షేడ్ వచ్చేలా యెరుపూ పసుపూ రంగులుకలిపి నీళ్ళతో పూసుకుంటేచాలు. పొడలూ మచ్చలూ మటుకు రాకుండా చూచుకోవాలి. ఈవిధమైన రంగుదుస్తు లతో కప్పబడని శరీరభాగానికంతటికీ వెయ్యాలి. నిక్కరూ సగంచేతుల చొక్కాలువాడేట్టయితే మోచేతులూ మోకాళ్ళ వరకూ యీ రంగులే వేయాలన్నమాట.

మేకప్ అయిపోంగానే యిక మీకు నిర్ణయింపబడ్డ దుస్తులు ధరించవచ్చు.

నాటకంలో "అతిసర్వత్ర వర్జ్యయేత్" యీ సూక్తి పాత్రధారణకు మరీ యెక్కువగా వర్తిస్తుంది. మేకప్ యెవరికి వారు వేసుకోవడం నేర్చుకోవడం మంచిది. మేకప్‌లో ప్రత్యేక ప్రవీణులు తయారవడంకూడాసమాజాలకు మంచిది

## ఆహార్యం

### (ii) దుస్తులు

"దుస్తుల విషయం పెద్దగా తెలుసుకునేదేముంది? ఔత్సాహిక నాటక సమాజాలు చారిత్రాత్మక నాటకాల ప్రయత్నమే చేయరుగదా! వాటికేకదా దుస్తులు కావలసినది?" అని యీ భాగాన్ని యశ్రద్ధ చేయకండి.

చారిత్రాత్మక నాటకాలూ, పౌరాణిక నాటకాలూ తీసుకుంటే, యించుమించు మీకు దుస్తులబాధ లేదనే చెప్పవచ్చు. మంచి డ్రెస్సుల కంపెనీకి వెళ్తే మీకు కావలసిన దుస్తులన్నీ దొరుకుతాయి. పరికరాలు కూడా వారివద్దనే దొరుకుతాయి కాస్త డబ్బు యెక్కువైనా!

ఇలాంటి నాటకాలను దుస్తులు యెన్నుకునేటప్పుడు కూడా జాగ్రత్తగా యే యే మనిషికి యే యే దుస్తులు కావాలో నిర్ణయించుకుని లిస్టు వ్రాసుకుని నవి సంపాదించుకోవాలి. సాధారణంగా మనం యే కంపెనీకో వెళ్ళి "ఏమయ్యా! మేము 'ఛత్రపతిశివాజి' నాటకం వేస్తున్నాం నీదగ్గర యేమేమి దుస్తులున్నాయి?" యని యడుగుతాం, ఆ కంపెనీ యజమాని వ్యాపార సరళిలో (బేరం పోగొట్టుకోడానికి యిష్టంలేక "అయ్యో బాబూ! మనదగ్గర లేనిదంటూ వుంటుందా? మీకెందు కన్నీ నేను చూచుకుంటాగా!" అంటాడు. మంచివాడైతే యలాగే యన్నీ తెచ్చు

కుంటాడు. కాని సాధారణంగా జరిగేసంగతి; తీరా నాటకం రోజున నాలుగు పంచలూ, రైదు చొక్కాలూ తక్కువ శేస్తాడు. దాంతో నావేషము ముందుగనుక యీ చమ్కా కోటు నేతొడుక్కుంటానంటే నే తొడుక్కుంటానని పోట్లాటలూ ఎం కొక్కుచ్చుడు కొందరు నటులు మాతులు బిగదీసుకుని కూర్చోటాలూ జరుగుతాయి ఇలాంటివి జరుగకుండా ముందు జాగ్రత్త పడటం మంచిది. మనకు కావలసిన దుస్తులన్నీ యొక కంపెనీలో దొరకపోతే మరోకంపెనీకి కూడా యార్డరివ్వటం మంచిది.

చారిత్రాత్మక నాటకాలలో దుస్తులరంగుల కలయిక చాలాముఖ్యం. కాగా యపభ్రంశపు సీనరీల ముందర నాటక మాడతూ దుస్తుల రంగుల్ని గురించి యాట్లే బాధపడ నక్కరలేదు. సీనరీలు (సెట్టింగులైతే మరీ మంచిది) దుస్తులు రంగుల కాంబినేషను చక్కని లైటింగు యెఫెక్ట్సులో చారిత్రాత్మక నాటకాలు ప్రదర్శిస్తే చాలా చక్కగా వుంటాయి. ఈ పీళ్లు మన రంగస్థలానికి లేవు. వీటికోసం ప్రయత్నించడం చాలా వ్యయప్రయాసలకులోనైనపని.

ఔత్సాహిక సమాజాలీ వ్యయాన్ని భరించే స్థితిలోలేవు. అంతగా భరించేస్థితిలోవున్న సమాజమున్టూ బైట్లేరితే నీ విషయమై సలహాలివ్వగల పెద్ద లనేకమంది వున్నారు. గొప్పగొప్ప పుస్తకాలున్నాయి.

ఇకపోతే మామూలు సాంఘిక నాటకాలకూ నాటికలకూ దుస్తుల విషయం, ఇది యెవరూ పట్టించుకోరు. సాంఘికం యనగానే యే దుస్తులైనా సరిపోతాయనే ధీమా.

నిర్మాత యీ విషయంలో కూడా తగు శ్రద్ధ వహించి యెవరెవరే యే విధంగా దుస్తులు ధరిస్తే బాగుంటుందో ముందుగానే నిర్ణయించాలి. ముందుగా చెప్పలేదు యంచాత ఓమారు ఓనటీమణి "దొంగాటకం" నాటికలో (ఇది యొక సామాన్య గృహస్థు యింట్లో రాత్రి 10-30 కి ప్రారంభించే నాటిక, భర్త పెట్రోలింగుకని బైటికిపోతుంటే భార్య నివారింపులతో ప్రారంభమవుతుంది ఈ నాటికలో స్త్రీ పాత్రకు సంసారపక్షపు స్త్రీ యింట్లో పడుకోబోయే ముందు కట్టుకునే వస్త్రాలు వాడాలి) తలకి వస్త్రమూ కళ్ళకి జోడూ. చేతిలో బాకూ పుచ్చుకుని గ్రీన్‌రూములోనుంచి బైటకు వచ్చింది. "ఇదేమిటమ్మా తల్లీ యీవేషం?" అంటే, వెంట వున్నాయన "ఆ- శాస్త్ర డాబుసరిగా కనిపించవద్దండీ?" యన్నాడు. ఆయన్ని యీవిడ్ని యొప్పించి ఆపటాటోపం యంతా వొలిపించేసరికి మూతాతలు దిగివచ్చారు. ప్రదర్శన పదినిముషా లాలస్యంగా ప్రారంభించాల్సి వచ్చింది.

ఇకపోతే యీ రోజుల్లో యన్ని వృత్తులవారూ, యన్ని మతాలవారూ యొకేవిధమైన దుస్తులు వేసుకుంటున్నారు. కానీ నాటకంలో యిలాధరిస్తే బాగుండదు.

"రాజు వెడలె సభకూ" (పాత్ర ప్రవేశించేటప్పు డతని పుట్టుపూర్వోత్తరాలు చెప్పటంలేక చెప్పించటం) రోజులు పోయాయి సంభాషణలలో కూడా యెప్పటికోగాని యీపాత్ర ఫలానా యని తెలియటంలేదు అందాక అనడం దుస్తులన్నా ప్రత్యేకించి ధరింపజేయుటం మంచిది. పాత్ర యొక్క స్వభావాన్ని బట్టికూడా దుస్తుల నిర్ణయం జరగాలి. దుస్తులరంగులు రంగస్థలం వెలుగులో కొట్టొచ్చినట్టు కనపడాలి. ప్రత్యేకసందర్భాలలో ఇందుకు వ్యతిరేకంగా వుండాలొస్తే తప్ప వెలా వెలా పోయే దుస్తులు ధరించిన పాత్రలు (సాంఘిక నాటకాలలోనైనా సరే) ప్రేక్షకులను ఆకర్షించలేవు

ఈ దుస్తులసమస్య ముందుగానే తేల్చుకుని నిర్ణయించు కోకపోతే తీరా నాటకం మొదలెట్టబోయేసరికి మూతి ముడుపులు ప్రారంభమవుతాయి. సాంఘికాలలో ఏపాత్రకాపాత్ర దుస్తులు తెచ్చుకోవల్సిందే. అతనివద్ద లభ్యంకానివి మరెవరి వద్దనైనా నడిగి ముందుగానే దగ్గిరపెట్టుకోవాలి. తీరా నాటకంరోజున రంగువేసుకుని "ఏరా హనుమంతరావ్, 'డాక్టరుకోటు' తెమ్మన్నానే ఏదీ యిలాపారెయ్" అంటే ఆ హనుమంతరావు నాలిక కరుచుకుని "అరెరె మర్చిపోయారా బ్రదర్" అంటాడు. పోనీ యిప్పుడు వెళ్ళి తీసుకు రమ్మందామంటే, అటేమో ముఖానికి రంగుపట్టించుకుని కనుబొమలు దిద్దుకుంటున్నాడాయె! ఎలా వెళ్ళమనడం? ఇక నీకు యేడుపువచ్చినంతపనౌతుంది. అక్కడికీ యిక్కడికీ అయిన

వాళ్ళనీ కానివాళ్ళనీ పరుగులెత్తించటం, రుసరుసలూ బుసబుస లూను. నీకునిర్ణయించిన దుస్తులూ పరికరాలూ సిసంచీలో లేకుండాఅసలు నువ్వు నాటకప్రదర్శనకు హాజరవటం పెద్ద పొరబాటు. ఔత్సాహిక నటుడుగా యిలాంటి పని యెప్పుడూ చెయ్యవద్దు.

## ఆ హా ర్యం

## (iii) రం గా లం క ర ణ.

మేకప్ చేసుకుని దుస్తులు ధరించటంతో ఆహార్యం పూర్తికాలేదు. రంగస్థలాలంకరణకూడా ఆహార్యంలో ఒక భాగమే.

ఈ రంగస్థలాలంకరణలోకూడా అనేక మార్పులు వచ్చాయి, వస్తున్నాయి. ఎన్ని మార్పులువస్తున్నప్పటికీ ముఖ్యంగా మనం గమనించాల్సింది, రంగస్థలంమీద మనం చేసిన ప్రతి అలంకరణా ప్రతి ప్రేక్షకుడికీ కనిపించాలి. అంతే గాక యీ రంగస్థలాలంకరణ పాత్రలనుగానీ వారి నటనను గానీ మరుగుపరచనిచోట్ల వుండటంకూడా ముఖ్యం.

రంగాలంకరణకు ముఖ్యంగా యీ రోజులలో తెరలే వాడుతున్నారు. సెట్టింగులు వాడుతున్నామని అనుకుంటూ వాటికికూడా తెరలే వాడుతున్నారు. సెట్టింగులకీ తెరలకీ భేదావుంది.మన రంగస్థలం యీ భేదాలను అంతగా పట్టించు

కోలేము. తెరల్నీ సెట్టింగుల్నీ కలగాపులగంగా నన్నీ సమా ... పొస్తున్నాయి.

తెరలమీద దుద్యానవనాలూ, వీధులూ, కొండలూ నదులూ వ్రాయించేసి క్రింద ఓ బలమైన కర్రదూర్చి పైకీ క్రిందకీ రోల్ (చుట్టుకునేలా) చేస్తే అవి తెరలూకావు సెట్టింగులు అంతకన్నా కావు ఈ రెండురకాలయొక్క అస్వాభావిక కలయిక అవుతుంది. తెరలమీద ముడతలుంటాయి. పీటి మీద వేసిన ... వంకర్లు పోతూంటాయి.

సెట్టింగుకు ముడతలుండరాదు. అది గాలిలో వూగ రాదు. పూర్తిగా ఫ్రేములో బిగించాలి. ఐతే ఇలా ఫ్రేములో బిగించబడినవాటితో బా టవుసరాన్ని బట్టి తెరలుకూడా వాడ్తూ టారు. అదంత మంచిపద్ధతికాదు. వాడితే పూర్తిగా తెరలన్నా (బొమ్మలు లేనివి) వాడాలి లేకుంటే పూర్తిగా సెట్టన్నానిర్మించాలి. ఒకవేళ తప్పనిసరిగా తెరలు సెట్టింగులో వాడాల్సివస్తే నవి ముడతలుపడకుండా నూగిస లాడకుండాను జాగ్రత్తపడాలి.

"ఈ దుర్భేద్యమయిన బందిఖానా నుంచి బైట పడ గలనా?" అనునొకపాత్ర జైయిల్లో నున్నట్ట భినయిస్తూం టాడు. జైలుగోడ; కటకటాలువున్న తలుపు పెయింట్ చేసిన తెర వెనుక కట్టారు. ఈ తెర వెనుక(ఎప్పుడూ ఎవరో యొకరు ఉండి తీర్తారు) నున్నవారు వెనుక నుంచి సరిగా ఈమాటలు అంటు న్నప్పుడే ఒక్క తోపు తోస్తారు ? తెర ముందుకు

వచ్చి అల్లల్లాడ్తుంది. ఎంత దుర్భేద్యమయిందీ బందిఖానా!! ఇలాంటి అపభ్రంశాలు చేసేకన్నా ఏదో ఒక రంగు తెర వేసేస్తే సరిపోతుంది. అదే జైలు, అదే ఉద్యానవనం అదే అన్నీను. నటులు చక్కగా అభినయం చేస్తుంటే, ఆదృశ్యాన్ని ప్రేక్షకులే తమ మనోవీథిలో చిత్రించుకుంటారు. అవకతవక దృశ్యాన్ని ప్రేక్షకుల మీద రుద్దటంకన్నా ఈ పద్ధతి మంచిది.

రంగు తెరలు వాడేవారు కూడ వాటికి లేనిపోని హంగులాడంబరాలూ పెడ్తున్నారు. రంగుతెరమీద దొక పటం ప్రేలాడదీస్తే అది ఓ గది గోడలా కనిపించదు. ఆ పటాన్ని ఎవరో తీస్తున్నట్టుంటుంది. అటూ యిటూ ఊగినప్పుడల్లా.

ఏదన్నా ప్రత్యేకావసరముంటే తప్ప తెరలకు అలంకరణలు చేయకూడదు.

తెరలు కూడా గుంభనగా నిలబడటానికీ చివరనుంచి యీ చివర వరకూ సంచి కుట్టించి అందులో ఇసుక నింపాలి.

తెర లేదో యొక రంగుని వాడవచ్చును. అయితే కొన్ని రంగులు వెలుగును మింగేస్తాయి. కొన్ని ఎక్కువ ప్రకాశింప జేస్తాయి. తెరల ముందు ప్రదర్శించే నాటకాలను నీలి తెర ముందు ప్రదర్శించే నాటకాలనటం పరిపాటయింది. ఇది సత్యదూరం. నీలి తెర నాటకానికి వాడకూడదు. నీలి రంగు వెలుగును మింగేస్తుంది. ఫాన్ (Fawn) లేతపసుపు లేతనీలం లేక లేత గ్రేరంగులు తెరలను బాగా పనికివస్తాయి.

తెరలకు వాడేగుడ్డ మందంగా ఉండి రంగును మెరవ జేసేదిగా ఉండాలి. వెల్వెట్ గుడ్డ ఖరీదెక్కువైనా చాలా బాగుంటుంది.

"పిండి కొద్దీ రొట్టె" అన్నట్లు రంగాలంకరణలో సమాజపు ఆర్థిక పరిస్థితిని బట్టి సామాగ్రి నిర్ణయం చేసుకో వచ్చు. కాగా పెద్దగా డబ్బు ఖర్చు చేయకుండానే యద్భుత ఫలితాలను సాధించవచ్చు.

మేడమెట్లమీద నుంచి దూసుకుంటూ రంగస్థలంమీద ఒకపాత్ర ప్రవేశించే దృశ్యాన్ని మేడమెట్లు సెట్టులేకుండానే యత్యద్భుతంగా ప్రదర్శించవచ్చు. నాలుగైదు కొయ్యమెట్లుగల బ్లాకులు (ఎత్తైన ప్లాటుఫారా లెక్కడానికి తయారుగా ఉం టాయి) ఒకటి సంపాదించి ఒకవైపు వింగుతో రెండుమెట్లు పైకు కనిపించేలా కోణంలో పెట్టాలి. దానివెనకో బల్ల (టేబిల్) వేయాలి. పాత్రధారి బల్లమీద నుంచుని రెండవ మెట్టుమీదికిదూకిపరుగెత్తుకుంటూ రంగంమీదికిప్రవేశిస్తాడు. ప్రేక్షకులు ఈ పాత్రధారి మేడమెట్లన్నీ దూకుతూ వచ్చా డని భ్రమిస్తారు. యాక్షను రియాక్షనూ సరిగా ఉంటే.

నాటకంలో ప్రేక్షకులను మీరు భ్రమింపచేసి నప్పుడు పొందేతృప్తి మీరు నిజం వస్తువులను ప్రదర్శించినప్పుడు పొందలేరు.

లేనిది వున్నట్లు భ్రమింప జెయ్యటమే నాటకానికి వున్న గొప్ప లక్షణం. ఈ భావం నాటకరచనలో కొట్టవచ్చి

నట్లు కనిపిస్తుంది. విశ్వేశ్వరాలయం సెట్టుకట్టాల్సిన అవసరం లేదు కనుకనే విశ్వేశ్వరాలయ వర్ణన ఒక పాత్రచేత చెప్పించడం. ద్వారకానగరాన్నీ ఆలమందల్నీ స్టేజిమీదకు తెచ్చి "అదిగో ద్వారక ఆలమందలవిగో" అని ఎలుగెత్తి అరిపించట మెందుకూ? చెప్పించడమో, చూపించటమో యేదో నొకటి చేస్తేచాలు.

ఔత్సాహిక నటులు ప్రదర్శన చేసే రంగస్థలం సర్వసాధారణంగా చాలా చిన్నదిగా యుంటుంది. ఇందుమీదిక్కి లేనిపోని సరంజామా అంతా చేరవేసి దీన్ని మరీచిన్నది చేసేస్తున్నారు. పాత్రధారులకు కాలూ చెయ్యీ కదుపుకునే చోటు లేకుండా కూడా పోతోంది.

ఒక పాత్ర ఇనప్పెట్టె తీయాల్సిన సన్నివేశ ముంటుందనుకోండి అప్పుడమాంతం యినప్పెట్టె మోసుకువచ్చి రంగం మీద పెట్టనక్కరలేదు. ఇది తేవటానికీ తొలగించటానికీ చాలమంది మనుష్యులు కావాలి అట్టుల్లోతడితే నసహ్యంగా ఉంటుంది. కాగా ప్రక్క తెరవద్దకుపోయి ఇనప్పెట్టె తీసినట్లు అభినయిస్తేచాలు. అభినయం బాగుంటేనిజంగా నీవినప్పెట్టె తీసావనే ప్రేక్షకు లనుకుంటారు. ఐతే యినప్పెట్టెకూడా ఒక పాత్రధారి అయితే మటుకు (అది వేరే సంగతి!) దాన్ని కూడా రంగ మెక్కించాల్సిందే.

ఓ నాటకంలో "యిదిగో యీయినప్పెట్టె ముట్టుకు ప్రమాణం చేస్తున్నాను. నామాటనమ్ము" యన్న మాటలు

సంభాషణ మధ్యలో వచ్చాయి. ఆ పాత్రను నేనే యభినయిస్తున్నాను. సంభాషణ యీ మాటలను సమీపిస్తున్నప్పుడు నేను యెప్పుడూ రంగస్థలంమధ్య వుండేవాడిని కాను. (ఇలా వున్నట్లైతే చాలా ప్రమాదం ఆ మాట చెప్పడానికి ముందు ప్రత్యేకం సహారా యెడారి దాటినంత వ్యవధి తీసుకోవాలి.) రంగానికి ఓ ప్రక్కకు మెల్లిగా చేరేవాణ్ని. ఆ ప్రత్యేక సంభాషణ చెప్పేముందు యెఫర్టులెస్ (Effort less) గా తెరలోకి వెళ్ళి స్వరస్థాయి హెచ్చించి "యిదిగో యీ యినప్పెట్టె పుచ్చుకు ప్రమాణం చేస్తున్నా" ననేవాణ్ణి. ప్రేక్షకులు నిజంగా నేను యినప్పెట్టె తలమీద చేయివేసి యీ ముక్కలు చెప్పినట్లనుభూతి పొందేవారు.

ఈ యెఫెక్టు నేనొక్కడ్నీ తీసుకు వచ్చినది కాదు. రంగంమీదున్న పాత్రనాతో బాగా సహకరించేది. నేచెబుతున్న మాటలకూ నాచేష్టల కతడు చక్కగా రియాక్టుచేసేవాడు. అతడి రియాక్షను ప్రేక్షకులలో ప్రతిబింబించేది. ఇతడు నేను యినప్పెట్టె తలమీద చేయివేయటం చూసినట్లు యభినయిస్తుంటే యితడ్ని చూస్తూ నామాటలు వింటున్న ప్రేక్షకులు తామూ తెరలోని దృశ్యము చూచినట్లే భ్రమించేవారు. ఇటువంటి రియాక్షనులేక పాడైపోయిన మరో యుదాహరణ చెప్తాను. ఒక పాత్ర యినప్పెట్టె తీసి మరో పాత్రకు డబ్బు యివ్వాలి. ఇనపెట్టె తెరవాల్సిన పాత్ర తెర ప్రక్కకిపోయి యినప్పెట్టె తెరచినట్లు యభినయిస్తుంది.

డబ్బుదీసుకునే పాత్రధారి అసలు చూడనేపే చూడకుండా "రోం మైదా రేవుందన్నావు?" యంటాడు. అంటే యంత కంటే యీ పెట్టెలో యెక్కువే వుందన్నమాట. అయితే కంఠస్థం చేసిన సంభాషణ మర్చిపోకుండా యితడా సమయా నికి చెప్పాడేగాని యినపెట్టెలోకి చూస్తున్నట్లు యభిన యించలేదు. ఆ కారణాన కనపడని యినప్పెట్టె వున్నట్లుగా ప్రేక్షకులకు యనుభూతి కలుగలేదు.

ఇంతకూ చెప్పవచ్చే దేమిటంటే పాత్రలన్నీ సహక రిస్తే లేని యస్తుతాలు యున్నట్లు భ్రమింప చెయ్యవచ్చు. విశ్వరూప సందర్శనం బొమ్మలతోనూ, మైరువర్కులతోను, చూపనక్కరలేదు. కృష్ణ పాత్రధారి చక్కని భంగిమలో నుంచుని విశ్వరూప వర్ణన చెబుతుంటే (కవివ్రాసినపద్యమే) దుష్ట చతుష్టయం భయకంపితులై గజగజ వణుకుతుంటే ధృతరాష్ట్ర గాంధారులు వొళ్ళంతా కళ్ళుచేసుకుని సంభ్ర మాశ్చర్యాలతో చూస్తుంటే, విదుర ద్రోణాదు లానంద భాష్పాలు రాలుస్తూ విశ్వరూపాన్ని యారాధిస్తున్నట్లు అభి నయిస్తుంటే 'విశ్వరూప సందర్శనానుభూతి' ప్రేక్షకులు పొందరూ? కాగా యీ దృశ్యానికి ప్రేక్షకులను కొంచెం ముందుగా తయారుచేసివుంచాలి సన్నివేశ కంటిన్యూటీ చేస్తూ అసలు దృశ్యం పతాక స్థాయితో ప్రదర్శించాలి.

నేటి యాంత్రిక సమాజాలలో రంగాలంకరణకు చూపాల్సినవన్నీ చూపించితీరాలనే యపోహాయొకటి కాగా

ప్రేక్షకుని పాతుకుపోతోంది. కాగా భావాన్ని విస్మరించి ప్రదర్శనలు చేసిన పూర్వ సమాజాలు కొన్ని రంగస్థలంమీద ముఖ్యాంశాలు, దృశ్యాలూ, (యభినయపూర్వకంగా) ప్రేక్షకుల మనోఫలకాలమీద హత్తలేక పోయి యిప్పి రంగాలంకరణ కార్యాభటాలు చేస్తున్న నేట సమాజాలు కొన్ని కూడా యీ విషయంలో (యసందర్భ యసంపూర్ణతల వల్ల) యంతకన్నా యెక్కువ పరాజయాన్నే పొందుతున్నాయి.

ఫుట్ లైట్సుకీ ప్రేక్షకులకీ మధ్య యొక జానెడు యెత్తున రంగస్థలం యీచివరనుంచి యీ చివరవరకూ యెత్తు గుడ్డకట్టాలి ఇది చాలా ముఖ్యం.

ఈ సందర్భంలో రంగస్థలం కొలతలు గురించి కొంత చర్చ యవుసరం.

రంగస్థలం పరిమాణా లేమిటి యనే ప్రశ్నకు తమకా విషయంలో బాగా యనుభవం వుందనుకున్నవారు 18 అంగుల వెడల్పూ, 9 అంగులలోతూ వున్న రంగస్థలం వుండాలనటం విన్నాను. నిజానికి యీ పరిణామాలు ఓమోస్తరుగా యున్న ప్రదర్శనలకూ దామాయిషా సరిపోవచ్చు. కానీ యీ కొలతలు తెలుసుకొనే ముందుగా గమనించాల్సిన ముఖ్యవిషయ మొకటివుంది. ఇద్దరుగాని యొకరుగాని రంగం మీద నిలబడియున్న దృశ్యానికి యింత పెద్ద వెడల్పుగల స్థల మనవుసరం. కాగా యిరవై లేక ముప్పై మంది

ప్రవేశించినపుడు యీ రంగస్థలం చాలదు. రంగస్థలాన్ని యవసరమైనట్లు కుంచించుకోవడమూ పెంచుకోవడమూ చేయగల యేర్పాట్లు ప్రవేశపెట్టడం మంచిది. ఇందుకుగాను తెరలు, లైటింగు వాడే నిపుణత్వం కావాలి. ఈ విషయాలు క్షుణ్ణంగా తెలుసుకోడానికి యనుభవజ్ఞులనూ, మంచి పుస్తకాలనూ సంప్రదించవచ్చు. గ్రంథవిస్తరణ భీతిచే యిక్కడ వివరాలు చర్చించదలచలేదు.

లైటింగు :

అగ్గిమీద గుగ్గిలం పొదలు పెట్రమాక్సు లైట్లు యెలక్ట్రిక్ లైట్లు ఆర్కు లైట్లు వరకూ వచ్చాం.

లైటింగు ప్రత్యేక శ్రద్ధతో నేర్పాటు చేసుకోవాలి. రంగస్థలమంతా ప్రేక్షకులకు కనపించేలా లైటింగు యేర్పాటు చేసుకోవాలి.

ఫుట్ లైట్సు, సైడ్ లైట్సుతో బాటు పై లైట్సు కూడా వుండాలి. లేకపోతే పిచ్చినీడలు పడ్తాయి. ఒకానొక పాత్ర స్టేజి ముందుకు వచ్చి నటించేటప్పుడు ఫుట్ లైట్సు ఆపాత్ర ముఖాన్ని క్రీనీడలో వుంచే విధంగా వుండకూడదు.

రంగు రంగుల లైట్లు, ఫోకసింగు వగైరాలు అత్యవసర పరిస్థితులలో మాత్రమే వాడాలి. అనుభవం లేకుండా అనవసరంగా వాడే యీ స్పెషల్ లైటింగు కావాల్సిన ఎఫెక్టు యివ్వకపోగా అసలు ప్రదర్శనకే ముప్పు తేవచ్చు. కాగా యీ ఫోకసింగులూ వగైరాలుకూడా చాలా చౌకలో ఏర్పాటు

చేసుకోవచ్చు ఏది ఏమైనప్పటికీ ఎలెక్ట్రీషియను నాటకాను భవం వుండి క్యూలు (సంకేతాలు) చక్కగా అనుసరించ గలవాడై తేనే ఇవి రాణిస్తాయి స్పాట్ లైట్ వగైరా ప్రత్యేక ఏర్పాట్లు అనుభవంలేకుండా చేస్తే రసాభాసమవుతుంది.

లైటింగును గురించిన సాంకేతికశాస్త్ర సుదీర్ఘ చర్చ చేసే అవకాశం యిక్కడలేదు. దీనివిషయమై తెలుసుకోడా నికి యీ విషయంలో ప్రత్యేకకృషి సల్పిన అనుభవజ్ఞులు విపులంగా వ్రాసిన పుస్తకాలున్నాయి లైటింగు ఓమాదిరిగా ఫరవాలేదనిపించేలా అమర్చగల సమాజాలుకూడా మనకు లేకపోలేదు వారినడిగి వివరాలు గ్రహించవచ్చు.

ఉన్నంతలో క్లుప్తంగానూ అందంగానూ రంగస్థలం మీద లైటింగు అమర్చుకోవాలి అన్ని పాత్రల అభినయాలూ బాగా కనిపించేలా లైటింగు ఏర్పర్చుకోవాలి.

## సౌండు :

ఈమధ్య ప్రతినాటకంలోనూ దూరశ్రవణయంత్రాలు వాడుతున్నారు. ఇవి సరిగా అమర్చకపోతే వికృతఫలితా లిస్తాయి. నటులు మైకును దృష్టిలో ఉంచుకుని ప్రవర్తిస్తారు. తాడు స్పీకర్లు సరిగా అమర్చకపోతే ప్రేక్షకులకు రెండు మూడు ధ్వనులు వినిపిస్తాయి. సౌండ్ సిస్టమ్ అనుభవజ్ఞులు అమర్చాలి.

సౌండును గూర్చిన చర్చ రంగస్థలంమీద అమర్చిన "మైకు" మూలంగా యీ విభాగంలో చోటుచేసుకుంది.

రంగస్థలంమీద యెక్కడనుంచి మాట్లాడినా స్పష్టంగా గ్రహించగల మైకు అమర్చాలి. కాగా యిలా ఎవరు ఎక్కువవున్న మైకు పెట్టినప్పుడు ప్రాంప్టింగూ తెరవెనుక వ్యక్తుల కలకలమూకూడా ప్రేక్షకులకు వినిపించే అవకాశం వుంటుంది. ఈ విషయం జాగ్రత్తవహించి, అనవుసరమైన గొడవలు తెరలో చేయకూడదు.

ఈ దూరశ్రవణ యంత్రాలు అమర్చని ప్రదర్శనలో నటులు గొంతులు చించుకు అరవాల్సివస్తుంది. స్వతస్సిద్ధంగా గంభీరమైన గొంతుకలవారికి దూరశ్రవణ యంత్రాలు లేక పోయినా ఫరవాలేదు. కానీ ధ్వని గాంభీర్యతలేనివారు మాత్రం కష్టపడాలి. ''ధ్వని''కి చూచుకుంటే భావమూ, మాధ్యులేపనూ, మార్దవమూ వుంటగలుస్తాయి. వీటివిష యం శ్రద్ధవహిస్తే ''బిగ్గరగా చెప్పండీ'' అని ప్రేక్షకులు అరుస్తారు.

మొత్తంమీద సౌండులోపంవల్ల నాటకం పాడుకాకుండా వుండేలాగున సౌండుసిస్టమ్ ఏర్పాటుచేసుకోవాలి.

## ఔత్సాహిక నాటక ప్రయోగం

### (f) ప్రదర్శన

ప్రదర్శన నిమిత్తం నాటకంతయారు చెయ్యటం ఒక ఎత్తూ దాని ప్రదర్శన మరొక ఎత్తూను. మనంఎంత పకడ్బంధీగా నాటకం ప్రాక్టీసుచేసి నప్పటికీ ఎన్ని హంగులతో ప్రద

ర్శిస్తున్నప్పటికీ యెన్నెన్ని క్రొత్తవిషయాలు ప్రదర్శింప తల పెట్టి నప్పటికీ "ఔనౌనని" తలలూపించుకో గలిగేది యీ ప్రదర్శన సరిగా జరిగితేనే. అందుచేత ప్రదర్శనలో మీరు మీ సర్వశక్తులూ ధారపోసి ప్రదర్శనమును విజయవంతం చేయాలి. ఎక్కడ జేమాత్రం తప్పటడుగు వేసిన చేసిన ప్రయత్నమంతా వృథాయిపోతుంది.

నాటకం ప్రకటించిన టైముకు ప్రదర్శింప లేకపోవటం ఒక పెద్దలోపం కాగా టైము నిర్ణయించుకోడంలో కూడా కొంత దూరదృష్టి వుండాలి.

సాయంత్రం 7-30, 8గంటలమధ్య నాటకం ఎప్పుడూ ప్రారంభించ కూడదు. (చిన్న నాటకం అయితే తప్ప) సాధారణంగా నాటక ప్రదర్శన 3గంటలు పట్టవచ్చు. సాయంత్రం 7-30 గంటలకు భోజనాలు చేసి బయల్దేరేందుకు సరైన టైము కాదు. కాగా భోజనాలు లేకుండా ప్రేక్షకులు రాత్రి 10-30 దాకా ఆగరు మీ ప్రదర్శన బాగున్న, ఆకలితట్టుకో లేక ప్రదర్శనమధ్యలో లేచి వెళ్ళిపోయే వార్ని చూస్తూ మీరు కించపడాల్సి వస్తుంది. ప్రారంభిస్తే సాయంత్రం 6, 6-30గంటల మధ్య ప్రారంభించండి, లేకుంటే రాత్రి 9-30, 10 గంటలమధ్య ప్రారంభి చండి

సభలూ, సమావేశాలా నంతరం ప్రదర్శన ఏర్పాటు చేసుకోటం అటు సభలు నిర్వహించే వారికీ ఇటు నాటకం నిర్వహించే వారికీ కూడా మంచిదికాదు. ఎంత గొప్ప

ఉపన్యాసం చెబుతున్నా నాటకంకోసం వచ్చిన సభికులు ఉపన్యాసాలకు విసుక్కుంటారు. ఉపన్యాసకుడ్ని వెళ్ళిపొమ్మని ఈలలూ చప్పట్లూ కొడ్తారు. ఇక నాటకసమాజం పాత్రధారణ పూర్తి చేసుకొని వేదికను రంగస్థలంగా ఎప్పుడు మారుద్దామా అని నోట్లో వేళ్ళేసుకొని కూర్చుంటుంది.

ఉపన్యాసాలకి జనాకర్షణకోసం నాటకాన్ని ఉపయోగించుకోటం చాలాచోట్ల ప్రారంభమయింది. కాగా అర్థనైజర్సు మీద భక్తిశ్రద్ధలున్న జనం అయితే ఉపన్యాసాలన్నీ అయేదాకా నోరుమూసుకొని కూర్చుంటారు. లేకపోతే ఉపన్యాసకుడికి భరతం పట్టిస్తారు.

నాటకం ముందు పెద్దపెద్ద వ్యక్తుల వుపన్యాసాలేర్పాటుచేసి వాళ్ళని చిన్నతనం చేయటం భావ్యంకాదు. ఈ విషయంలో భేదాభిప్రాయా లుండవచ్చు. కాదనను. కాని కొంతవరకూ యీ విషయంలో నా యభిప్రాయంతో నేకీభవిస్తారని నమ్ముతున్నాను.

కొన్ని కొన్ని సభలలో ననేక సమాజాల నాహ్వానించి యనేక తరహా ప్రదర్శన లొకేరాత్రి యేర్పరుస్తారు. ఇది మరీ దారుణం. ఇంచుమించు నాటకసమాజాల చిత్రవధ యని చెప్పవచ్చు. కార్యక్రమ మాలోచించి రచించని కారణాన యప్పటికప్పుడే సమాజం తయారుగా వుంటే వారికి రంగస్థల మెక్కే యవకాశం లభిస్తూంటుంది. ఈ యేర్పాటు వలన కొన్నికొన్ని మంచి ప్రదర్శనలు కూడా

బూడిదలో పోసిన పన్నీరౌతాయి. (ఫార్సు తరువాత గంభీర ప్రదర్శన రక్తికట్టదు). ఇటువంటి సందర్భాలలో సమాజా లన్నీ సమరసభావంతో ముందుగానే యొక ప్రోగ్రాము నిర్ణ యించుకుని యీ వరుసప్రకారం ప్రదర్శనలివ్వటం మంచిది.

నాటకం కొందరి ప్రేక్షకుల యానందం కోసం ప్రద ర్శిస్తున్నా మన్న విషయం మర్చిపోకూడదు. మీరు యెంత గొప్పనాటకం ప్రదర్శిస్తున్నా సరే! ప్రేక్షకులు దాన్ననుస రిస్తూ యానందించిననాడే మీ ప్రదర్శన సార్థకత నొందుతుంది.

'సభా సప్తాంగలక్షణం' మీ ప్రేక్షకులలో ననేక రకాల వారుంటారు. ఏరకం ప్రేక్షకుడయినా మంచిప్రదర్శన యేదో చెడ్డ ప్రదర్శనయేదో చెప్పగల్గె గలడు. కొన్ని కొన్ని మంచి ప్రదర్శన లతడ్ని "మళ్ళీయది చూడా"లన్నంత సంతోష పెట్టకపోవచ్చు. కాని ప్రదర్శన బాగుంటేమటుకు యసంతృప్తిగా యే ప్రేక్షకుడూ వెళ్ళిపోడు.

మీ ప్రదర్శనకు సరైన రెస్పాన్సు లేకపోతే లోపం ప్రేక్షకులమీద తోసెయ్యకండి. కారణాలను మరొకచోట కూడా వెతకండి.

ప్రదర్శన ప్రారంభించేముందు నటీ నటులంతా కలసి యిష్టదేవతా ప్రార్థన చేసుకోవచ్చు. అది తెరవెనకనైనా చేసుకోవచ్చు, తెర ముందుకు వచ్చియైనా చేసుకోవచ్చు, లేక యెవరిమనసులోవారైనా చేసుకోవచ్చు. అసలు ప్రార్థన

చేయని సమాజాలూ వున్నాయి. ఉన్నా ఫరవాలేదు. అది వారి వారి యిష్టానిష్టాలతో కూడుకున్నది.

అయితే ప్రార్థనను (తెరముందుగాని వెనుకగాని) చేసేటప్పుడు యీ గీతాన్ని యింతా కలసి చక్కగా ప్రాక్టీసు చేసినవారే పాడాలి. గాడిదలూ, గుఱ్ఱాలూ కలసి బండ్లు లాగినట్లుండకూడదు. మీ ప్రదర్శనలో ప్రేక్షకులు ముందుగా వినేది యిది. దీనిమీద మీరు శ్రద్ధవహించరు. అప్పటికప్పుడు నలుగురైదుగురుని ప్రోగుచేసి యిష్టంవచ్చిన వరుసలలో 'వందేమాతరం' యనో మరో ప్రార్థన గీతమో యెత్తుకుంటారు. మీ టీమ్ వర్కులోని లోపం ప్రేక్షకులకప్పుడే తెలిసిపోతుంది. సరిగా ప్రాక్టీసు లేకపోతే ప్రార్థన గీతం విరమించండి. అంతగా మీకు భగవంతునిమీద భక్తి వుంటే మనసులోనే ధ్యానం చేసుకోండి. కర్పూరం వెలిగించి కొబ్బరికాయలు కొట్టి ఓ దణ్ణం పెట్టండి చాలు.

తెర ఎత్తగానే అంతవరకూ రణగొణధ్వనిగా నున్న ప్రేక్షకలోకం నుంచి నిశ్శబ్దం పుట్టుకురావాలి.

ఇందుకు గాను మీ ప్రారంభం తమాషా పంథాలో వుంటే మంచిది. కానీ అన్ని ప్రదర్శనలలోనూ వినూత్నంగా ప్రారంభించే అవకాశం వుండదు. గారడీవాడు కనికట్టుచేసే విధంగా మీరు నాటకం ప్రారంభించ లేకపోతే సాధ్యమైనంత త్వరలో ప్రేక్షకుల గోల యణగి పోయేలా ప్రయత్నించాలి. ప్రారంభంలో మీరు సంభాషణలు మెల్లగా చెబితే 'యేమ

న్నాడు' అని ప్రక్కవారిని యడిగే ప్రేక్షకుల మాటలూ 'అబ్బ వినవయ్యా! యని విసుక్కునేవారిగోలా యిదివరకటి గోలని యెక్కువ చేస్తుంది. అరగంట దాకా మీరేం మాట్లాడుతున్నదీ ప్రేక్షకులకు (వినిపించక) యర్థంకాదు.

రంగస్థలంమీద మీరు చేసే ప్రతి యంగ విన్యాసమూ ప్రేక్షకులకు కనిపించాలి. మీరు చెప్పే ప్రతిమాటా (జనాంతికమైనాసరే) వినిపించాలి. ప్రేక్షకుల కనుమరుగయ్యే దృశ్యంగాని వినిపించకూడని మాటగాని నాటక ప్రదర్శనలో యెక్కడా యుండ కూడదు. ఉంటే యది నాటకం కాదు.

ముఖ్య దృశ్యాలేవీ రంగస్థల మూల మూలల యేర్పాటు చేయకూడదు. ప్రేక్షకులలో యివి కనుపించని యొక వర్గం నిక్కి నిక్కి చూస్తారు. వెనకవాళ్ళు 'కూచో కూచో' మని గోల చేస్తారు. ఈ గోలలో మనదృశ్యం, అనుకున్న స్థాయికి రాదు.

తెరకూ తెరకూ, దృశ్యానికి దృశ్యానికీ మధ్య కాల విలంబన వుండకూడదు ఇందుకుగాను యీ మధ్య వచ్చే నాటకాలు ఒకే దృశ్యం (సెట్టు) మీద నాటకం ముగిసేలా రచింప బడుతున్నాయి కాని పూర్వ పద్ధతి నాటకాలలో యంకాలూ, రంగాలూ యుండి, తెరదించి యెత్తే సరికి దృశ్యం (సెట్టింగు) మ రే యేర్పాట్లుండేవి. ఇలాంటి నాటకాలకు రివాల్వింగు స్టేజి యవుసరం.

మన పాత నాటకాలలో యొకదృశ్యమూ మరొక దృశ్యము మార్చబోయేముందు వీధి దృశ్య మొకటిపెట్టి తెర వెనుక (దృశ్యం మార్చ వలసిన) యేర్పాటుల కవకాశం కల్పించిన రీతి యొకటివుంది.

ఏది యేమైనా తెరదించి యెత్తే సరికి కాలవిలంబన జరుగకుండా కట్టుదిట్టం చేసుకునే యేర్పాటు సమాజానిది.

నాటక ప్రదర్శనలో తెర ముందు ప్రదర్శనలిచ్చే వ్యక్తు లెంతముఖ్యులో తెర వెనుక నున్నవారు కూడా యంతముఖ్యులే. తెర వెనుక వ్యక్తులు సరియైనవారు కాక పోతే 'రామునితోక పివరుండిట్లనియె' లాగుంటుందిప్రదర్శన!

ఈ తెరచాటు వ్యక్తులలో ప్రాంప్టరతిముఖ్యుడు. తెరలు లాగేవారుకూడా నాటకంతో పరిచయమున్నవారై యుండాలి. లేకపోతే తెరలే యభినయం ప్రారంభిస్తాయి వెనక్కు-పోయి ముందుకు వచ్చేను. ఇక యీరోజుల్లో స్పాట్ లైట్లనీ, పిస్టల్స్ పేల్చాలనీ తుఫానురావలనీ యనేక ప్రయోగాలు జరుగుతున్నాయి వీటన్నిటికీ కూడా సరియైన టైమింగు లేకపోతే మంచి యెఫెక్టురావటం మాటటుంచి యభాసయ్యే యవకాశాలు యెక్కువ.

రంగస్థలంమీద ప్రవేశనిష్క్రమణలు ముందుగా నిర్ణయించుకోవడ మతిముఖ్యం. ఒకవైపు బయటనుంచి మరొక వైపు లోపలనుంచి యని నిర్ణయంచేసుకోవాలి. రంగస్థలం మధ్యలో గుమ్మం యేర్పాటు చేసుకుంటే యది బైటనుంచి

యని నిర్ణయం చేసుకోవచ్చు ఏయే నటుడు ఏయే సందర్భాలలో యెటువైపునుంచి రావాలి, యెటుపోవా లనే నిర్ణయం చేసుకుని యామాదిరిగా చేయాలి లేకపోతే ‘అరే గోపాల మొస్తున్నాడే’ యని రంగస్థలంమీది నటుడు కుడివైపుకు చూస్తుంటే యా గోపాలం హాస్తా యెడంవైపునుంచి నడిచి చక్కా వస్తాడు. ముందునిర్ణయం జరగక యెటువైపో యటు వైపునుంచి రావాలసి వస్తే రంగంమీది వ్యక్తి ముందు దటగా యిటూ కూడా చూసి గోపాలంవచ్చిన యెటువైపు వున్నాడో చూడవలసివాల్సి వస్తుంది.

ప్రదర్శనకు కావలసిన పరికరాలన్నీ ముందే లిస్టు రాసుకు జాగ్రత్త చేసుకోవాలి. ఇలా సేకరించిన వస్తు సముదాయానికి ఒకమనిషి కాపలాయుండి యవసరమయి నప్పుడాయా వస్తువుల నందిస్తూండాలి. ఈ యేర్పాటు లేన ప్పుడు నటుల పాట్లు వర్ణనాతీతం! స్టేజిమీద యనవసరపు వ్యక్తులెక్కువగా నున్నప్పు డిలాంటివి జాగ్రత్త పెట్టు కోవడం మరీకష్టం.

ఒక దృశ్యంలో మిఠాయి, పళ్ళూ కావాలి. అవి తెచ్చి బల్లమీద సర్దాం. వాటిమీదే దృష్టిపెట్టుకు నేవడు కాపలా కాస్తాడు? రంగంమీది దృశ్యంలో ‘యిదిగో యీ పళ్ళూ మిఠాయీ యారగించం’ డని వాటివంక చూస్తే యేముంది? ఖాళీ ప్లేట్లు ప్రత్యక్షం! అప్పుడా నటులపాట్లు యిక చూడగాలా? ఓమారు ఫ్లాస్కులోని కాఫీకాస్తా తాగేసి

ఖాళీ ఫ్లాస్కు మూత తిప్పేసి జాగ్రత్తగా బల్లమీంద పెట్టారు 'కాఫియాస్పిరిన్ లేదుగాని ఫ్లాస్కులో వేడివేడి కాఫివుందని ఫ్లాస్కు యెత్తేసరికి యేముంది, ఖాళీ! ఓమూరు తమల పాకులు వక్కలు మాయమైపోయినాయి. ఇలా నీటిని కైంకర్యం చేసేవారికి యిదేమంత పెద్ద తప్పుగా కనపడదు. నిజంగా మరోటప్పైతే కాదు కూడాను. అతిథులుతమంత తాము యారగించటం కంటె కావల్సిందేముంది? కాని యిక్కడీ యవుసరం వేరు. ఒక్కొక్కప్పుడిలా యవుసర వస్తువులు మాయమవుతుంటే మహాచెడ్డకోపం వస్తుంది.

ప్రదర్శనకోసమే యిదవుతామా, వీళ్ళందరికీ కాప లాలే కాస్తామా ?

ఏదియేమైనా రంగస్థలంమీద యభినయించే నటుల నీలోపాలు యతిప్రమాదావస్థలో పెడ్తాయి.

ఒక్కొక్కప్పుడు సమయస్ఫూర్తితో ఏదైనా వస్తువు లేని లోటు సవరించుకోవచ్చు.

"ఈ శాలువ కప్పుకు జైలుకు వెళ్ళు" అని ఓసంభాష ణున్నప్పుడు శాలువ తెచ్చుకోడం మర్చిపోయారనుకోండి. "శాలువకు" బదులు "దుప్పటి" అని చెప్పేస్తే సరిపోతుంది. కానీ యెప్పుడూ యిలాటి సమయస్ఫూర్తులు పనిచెయ్యావు. ఒకో వస్తువు తప్పక కావలసివస్తుంది. అందుచేత అన్నివస్తు వులూ జాగ్రత్తచేసుకోడం ఆ వస్తువులు సందర్భానుసారంగా వందించడానికి ప్రత్యేకంగా యొకమనిషి వుండటం అవుసరం.

ప్రదర్శనలో నటుని వాచికం స్పష్టంగా వుండాలి. అప శబ్దాలు రాకూడదు. తడబాటుండకూడదు. కంఠం బాగుండటానికని కషాయాలూ వగైరాలు నములమని యెవరో యిచ్చిన సలహాపట్టుకుని నటి స్టేజిమీద నములుతూ నెమర్లు వేయకూడదు. ఆ నమిలేవేవో అంతకుముందే నమిలి ఖాళీ నోటితో రంగస్థలం ప్రవేశించాలి.

వాచికంవిషయం రానేవచ్చింది కనుక మాడ్యులేషను ఏక్సెంటులమీద రెండు ముక్కలు చెప్తాను. ఈ రెండూ అలవడనివాడసలు నటుడే కాడు. ఇవి చక్కగా సాధించి నేర్చుకోవాలి. "నిన్న నువ్వు తెనాలి వెళ్ళావా?" అన్న వాక్యంలో ఒక్కొక్కమాటను నొక్కి ఒక్కొక్కమారు చెప్పిచూడండి, అర్థంలో ఎంత తేడావస్తుందో. నిన్న అనే మాటను నొక్కితే నిన్నకాక మరెప్పుడో వెళ్ళావా లేక ఖచ్చితంగా నిన్ననే వెళ్ళావా? అన్న అర్థంవస్తుంది. నువ్వు అన్నమాటను నొక్కితే నువ్వే వెళ్ళావా లేక మరొకడు వెళ్ళారా అనిగాని లేక స్వతంత్రించి నువ్వు తెనాలి వెళ్ళొచ్చావా యనిగాని అర్థంవస్తుంది. తెనాలి నొక్కితే తెనాలే వెళ్ళావాయనిగాని తెనాలివంటియూరు వెళ్ళావా అనిగాని అర్థం అవుతుంది. వెళ్ళావా అనే పదం నొక్కితే అసలు వెళ్ళావా లేదా అన్న అర్థం వస్తుంది.

మాడ్యులేషను లేని సంభాషణ కంఠపాటంగా పాఠం అప్పచెప్పినట్లుంటుంది. వినేవారికి విసుగుపుడ్తుంది.

ప్రేక్షకులసంఖ్యనుబట్టి స్థాయి హెచ్చుతగ్గులు నిర్ణయించుకుని ఒకే స్థాయిలో మాట్లాడాలి. ప్రేక్షకులు ఒక పాత్ర చెప్పినదానికి నవ్వుతున్నప్పుడు వెంటనే యేపాత్రా మరోసంభాషణ ఎత్తుకోకూడదు. అదినవ్వులో కలిసివినిపించదు. బాగా పాజ్ తీసుకుని మరీ చెప్పాలి.

ప్రేక్షకులస్థాయినిబట్టీ వారి రియాక్షనుబట్టీ అప్పటి కప్పుడు నటనవ్యాపారాలలో మార్పులుచేయాలనే సిద్ధాంతం ఒకటి వుంది. ఇది వృత్తి నటులకు కావలసిననేర్పు. దీని బాగోగుల విషయం తర్కించేముందు యీవిధంగా ఎవరన్నా చెయ్యగలుగుతున్నారా అంటే లేదనేచెప్పవచ్చు. ప్రేక్షకు లభిరుచులనుబట్టి నటించటం అంటే వారు ఏదో నాటకంలో ఏదో పాడమంటే అది పాడెయ్యటమా "వన్సుమోర్" అనీ అనగానే చచ్చిపోయినవాడు అమాంతం లేచి మళ్ళా ఆపద్యం పాడటమూ కాదు. నటనలో కొన్ని రకా లభినయా లున్నాయి. స్థూలాభినయమూ సూక్ష్మాభినయం అని రెండు రకాలు. సూక్ష్మాభినయ మన్నది చాలావరకు అంగాలు వ్యాపారాల కదలిక లేకుండా వాచికంద్వారానూ ముఖభంగిమల లోనూ నేత్ర విన్యాసాలతోనూ చేస్తారు స్థూలాభినయం అంటే యీ చెయ్యి యిటూ ఆ చెయ్యి అటూ తిప్పుతూ ఇంచు మించు భరతనాట్యపు ముద్రలూ తాళాలూ పాటిస్తూ ఆంగిక చలనంతో ప్రదర్శించేది. ఉదా: "ఆకాశంబునడాగనీ" అన్నచోట చెయ్యిపైకెత్తి ఆకాశాన్ని చూపటం అన్నమాట (ఒకొక్కప్పుడు క్రిందికికూడా చూపుతాడు!)

ఈ రెండు తరహాలలో మొదటితరహా కొందరి ప్రేక్షకులకు కనిపించకా, సరిగా యర్థం యవకా, నచ్చకా వారు మూలుగులు ప్రారంభించవచ్చు. అప్పుడు యున్నట్లుండి స్థూలాభినయం ప్రారంభించడం, ప్రేక్షకుల రియాక్షను బట్టి నటన మార్చటం "అనే శీర్షిక క్రిందికి వస్తుంది. ఇది యీ విధంగా మార్చట మొక్కొక్కప్పుడు యవసరం. ప్రేక్షకులలో కొంతమందన్నా మనసూక్ష్మాభినయానికిది యాక్షన్ చూపుతుంటే యీనటన మార్చనక్కరలేదు కాగా యెవరూ మన నటన మెచ్చుకోనట్లు కనిపిస్తే మార్చాలి. ఇది చాలా యనుభవంమీదగాని తెలిసిరాదు. అయితే యిలా మార్పు చేసుకునేటప్పుడు ప్రక్కపాత్రలు కంగారుపడకుండా వారికి రిహార్సల్సులో ప్రాక్టీసు యయినవిధంగా (Cue) 'క్యూ' లు యందిస్తూండాలి. కదలికలు (Movements) చేస్తూండాలి. అంతా యీవిద్యలో ప్రవీణులే యయితే ఫరవాయేలేదు. మరోనాటకమే ఆడేస్తారు!

స్పెషల్ ఎఫెక్ట్సు :— ఇటీవల నాటకాలలో స్పెషల్ ఎఫెక్ట్సు చాలా చూపిస్తున్నారు. ఒక్కొక్కరి వ్యూహాను బట్టి యొక్కొక్కవిధంగా వినూత్నపోకడలతో సీన్ని యాలోచించుకుని నిర్దుష్టంగా ప్రదర్శించాలి.

ఈ స్పెషల్ ఎఫెక్ట్సు పెట్టుకునేవారు చాలా సుశిక్షితులై యుండాలి. ప్రతి విషయమూ క్షుణ్ణంగా తెలిసి యుండాలి. ఉయ్యాలలో పసిపిల్లలను పెట్టి లేప్ రికార్డరు పిల్ల

యేడుపు ప్రసారం చేస్తుంది. పిల్ల యేడుపు యథాతథంగా రికార్డు చేస్తే యది రెండుపిల్లులు పోట్లాడుకున్నట్లుంటుంది. వాల్ట్ డిస్నీ ఈ విధమైన స్పెషల్ ఎఫెక్ట్సులోనిది, చాలా కృషి చేసాడు. అతని యనుభవాలు చదివి తెల్సుకోడం చాలా మంచిది. తలుపుమూత శబ్దానికి యతను డ్రాయరు లాగి కొట్టిన ఉదాహరణలున్నాయి. బ్రిటిష్ బ్రాడ్ కాస్టింగ్ కార్పొరేషనులో స్పెషల్ ఎఫెక్ట్సు నిపుణులున్నారు. వారు కూడా జగద్విఖ్యాతి సందినవారే. మనిషి యడుగుల చప్పుడు రికార్డు చెయ్యడానికి మనిషిని నడిపించి రికార్డుచెయ్యరు. కొబ్బరిచిప్పలవంటివి నాలుగైదు పెట్టిపిడికిళ్ళతో వాటినికొంచెం శబ్దమయేలా కొడ్తూంటే మనిషి యడుగుల చప్పుడు రికార్డు యవుతుంది. తలుపులు బడాబడా బాది యవి పగుల కొట్టిన ఎఫెక్టును నేను యొక మేజాబల్లను బాది దానిమీద నొక విరిగిన కుర్చీ చేతికర్రను నిలబెట్టి (వదలి) పడేసి ఎఫెక్టు సాధించాను. నిజంగా తలుపులు బాది పడకొడ్తే యసలు ఎఫెక్టు రాదు.

Flash back లూ మనస్సుతో మాట్లాడ్డాలూ వగైరా ఎఫెక్ట్సులోకూడా చాలా లోపాలు కనిపిస్తున్నాయి. పిల్లి కళ్ళుమూసుకు పాలుత్రాగుతున్నవిధంగా ప్రవర్తిస్తే సరిపోదు. తెరవెనుక (ఫ్లాష్ వేయించుకునేవారు) పుస్తకం పుచ్చుకు పోర్షను చదివితే వారితోబాటు పుస్తకం కూడా తెరమీది బొమ్మలో పడ్తుందనే జ్ఞానం యుండాలి. కనీసం యిది రిహార్సల్సులోనన్నా గమనించుకోవాలి. ఇక తుఫాను

వగైరాలు-చాలా యసందర్భంగా ప్రదర్శిస్తున్నారు. శబ్దం వోమారు యిసుక వోమారూ మనిషి నటన మరోమారూ.

ఈనాటి సమాజాలు స్పెషల్ ఎఫెక్ట్సు విషయాలలో చాలా యసందర్భంగా ప్రవర్తిస్తున్నాయి యని చెప్పడానికి చాలా విచారిస్తున్నాను ఇది ప్రదర్శనలో సొప్పించాలన్న సరదాలో వాట్ని నిర్దుష్టంగా నేర్చుకుని ప్రదర్శిస్తామన్న జిజ్ఞాస కనిపించటం లేదు. ఇది లేనినాడు యిటువంటి దృశ్యాలను ప్రేక్షకులూహకే వదలివేయడం మంచిది. ప్రేక్షకులూహించుకునే "స్పెషల్ ఎఫెక్ట్సుకు" నిజాని కేవీ చాలవు! వార్ని సరైన లైనులోకి తీసుకువెళ్ళనదిత్తే స్వర్గాన్నే నూహించేసుకుంటారు!! మనకి అది సృష్టించాల్సిన బాధ తప్పుతుంది!!!

సంగీతవాయిద్యాలు :— సంగీతవాయిద్యా లవసరమున్నవీ లేనివీ డాబుసరికోస మేర్పర్చట మనవసరవ్యయం. పాటలూ పద్యాలూ వున్నా నాటకాలకైతే హార్మనీ తబలాలు తప్పనిసరికదా! ఇక క్లారినెట్టూ, ఫిడేలూ, సారంగీ, బుల్ బుల్, కొబ్బరిచిప్పలూ, కుండలూ, బిందెలూ ఒకటేమిటి ఎక్కడెక్కడివీ తెచ్చిపెడ్తుంటారు. ప్రాక్టీసు తక్కువైన యీనాటి ప్రదర్శనల కివన్నీ అనవసరం. అందులోనూ పాటలూ పద్యాలూ కట్టుగా నభ్యసించనివారి నివన్నీ కంగారు చేస్తాయి.

ఈ వాయిద్యాలకు కొందరు రంగస్థలానికి ముందు (pit)లో కోర్చో పెడ్తారు. కొందరు రంగస్థలం ప్రక్కను తెరమరుగున కూర్చోబెడ్తారు.

పాటలూ పద్యాలూ వున్న ప్రదర్శనకైతే ముందు కూర్చో పెట్టడమే మంచిది. ప్రక్కకూర్చున్న వాయిద్యాలు పాడేవారిని సరిగా ననుసరించలేవు. ఎఫెక్టుకోసంమటుకు సంగీత వాయిద్యాలు వుపయోగించే ప్రదర్శనలో, ప్రక్క కూర్చో బెట్టడం మంచిది. స్వరాలు తేలిగ్గా అందించవచ్చు. ఎఫెక్టు కోసం వాడే వాయిద్యాలలో హార్మనీ తబలాలు లేకపోయినా ఫరవాలేదుగాని క్లారియోనెట్టూ, ఫిడేలు, దొరికితే సారంగీ లేక వీణా చాలా అవసరం. వీటితో అద్భుతఫలితాలు సాధించవచ్చు. తబలాకన్నా ఢోలక్ గాని మృదంగంగాని వుంటే మంచిది.

## ఆఖరి తెర

నాటకప్రారంభం, దానిగమనం, దానిపరిసమాప్తి ఈ మూడూ ప్రదర్శనలో నిర్దుష్టమైనభాగాలు! ఈ మూడూ చాలా చక్కగా నిర్వర్తించాలి. నాటకం ప్రారంభంలో ప్రేక్షకులపై ప్రయోగించిన కనుకట్టు నాటకాంతంవరకూ పనిచేసేలా ప్రదర్శనసాగించాలి. నాటకాంతంలో కనుకట్టు తీసేసి ప్రేక్షకులు ఇంటికెళ్ళినాకకూడా నాటకాన్ని గురించి ఆలోచించే "మంత్రం మరోటి వెయ్యాలి. కాని నేటి ప్రద

ర్శన లిందుకు భిన్నంగా వుంటున్నాయి. నాటకాంతాన సభికులమూ వెలావున్నా సామాజికులుమటుకు నీరస మనుభ విస్తున్నారు. నాటక మయేటప్పటికి షడ్రసోపేతంగా భోజనం చేసిన తృప్తి ప్రేక్షకులకూ యిలాటిభోజనంపెట్టిన తృప్తి సామాజికులకూ వుండాలి.

ప్రసంగాలూ బహుమతి ప్రదానాలూ, యేమన్నా వుంటే ఆఖరిదృశ్యం ముందు తెర పడ్డప్పుడే చేసుకోవాలి. నాటక మయిపోయినాక లడ్డూలుపెడతామని ప్రాధేయపడ్డా జనం కూర్చోరు. (అయితే యీ నాటకాలు కొన్ని యింత మయిందీ లేనిదీ తెలీని సందిగ్ధావస్థలో ప్రేక్షకులనుయుంచి నాటక మయిపోయిందనీ, యిక వెళ్ళవచ్చనీ చెప్పేదాకా తెలిసేస్థితిలో వుండటంలేదు. ఇది రచనాలోప మనియనను. వెనుక భరతనాట్యంలాటి వాటితో ముగించేవారు. సినిమాలలో 'The end' యన్నా యనకపోయినా లైట్లన్నీ వెలిగించి తలుపులు తీసేస్తారు. (మరికొందరు ఫాన్లన్నీ యాపేస్తారు కూడాను) పాత నాటకాలెందుకూ పనికిరావనుకుంటున్న యీనాటి నవ్యనట సమాజాలు ప్రేక్షకుల మనసులను దృష్టిలో నుంచుకోవడం లేదు. తమకు ప్రదర్శన యెప్పుడైపోతుందో తెల్సునుకదా, ప్రేక్షకులకు మటుకెందుకు తెలీదనే యభిప్రాయంలో నున్నట్టు కనిపిస్తోంది. నాటక మయిపోయిన సూచన ప్రేక్షకులకు తెలియబర్చాల్సిన విధి సమాజం వారిది. నాటక మయినాకూడా ప్రేక్షకు లింకా

కదలకుండా కూర్చున్నారంటే యిదేదో మన నాటక ప్రద ర్శన వాళ్ళని చైతన్యహీనుల్ని చేసేసిందని పొంగకూడదు. నాటక ప్రయోజన మిసుమంతయినా సాధించలేదని కించ పడాలి.

బహుమతీ ప్రదానాలూ ప్రసంగాలూ క్లుప్తంగా యుండాలి. ఆనాడు పాత్ర సరిగా నటించక చెడగొట్టిన నటు డెవరన్నా వుంటే యితడ్ని (ముందు నిర్ణయించుకున్నాం గనుక) రంగస్థలంమీదకు వచ్చి బహుమతి నందుకోమని బల వంతం చెయ్యకూడదు. అందరు నవ్వులపాలు కావలసి యుండుట మేటుంచియసలు బహుమానాలకే విలువ యుండదు.

మనం చేసిన ప్రయత్నమూ, పడ్డశ్రమా రాణింపుకు రావలసింది ప్రదర్శనలోనే. మన సమాజ మెంత కష్టపడి పనిచేసిందీ, యెంత శాస్త్రోక్తంగా వ్యవహరించింది వూరికే చెప్పుకుంటే ప్రయోజనం లేదు. ప్రదర్శనలో యివన్నీ కని పించాలి. ప్రదర్శననాడు సామాజికులందరూ వొళ్లుదాచుకో కుండా మనస్పర్థలు లేకుండా కలిసికట్టుగా పనిచేసి ప్రదర్శన దిగ్విజయమయేలాచూడాలి. ఏవిషయంలోనూ ప్రదర్శన దెబ్బ తినకుండా అంతా వెయ్యికళ్ళ కనిపెట్టివుండాలి. నాటకంలో పాల్గొంటూ రంగస్థలం మీద పనిచేసేవారికన్నా పదింత లెక్కువగా తెరమరుగున నున్నవారు శ్రమించాలి.

మనమిచ్చే ప్రదర్శన యాహ్వానితులకూ, అభిమాను లకూను. (ఔత్సాహిక నాటక ప్రదర్శన) అందుచేత ప్రేక్షక

స్థానంలో తగు యేర్పాట్లు చేయాలి. ప్రేక్షకులనాహ్వానించి వారికి తగుయాసనాలు చూపించేందుకు ప్రత్యేకించి కొందరు తప్పక యుండాలి. ఈ విషయంలో యశ్రద్ధ జరిగితే మన మెంత చక్కని ప్రదర్శన లిచ్చినా కొంద రభిమానులను మన సమాజం పోగొట్టుకునే యవకాశం కలుగవచ్చు. అలా గని వారికడుగులకు మడుగులొత్తాలనికాదుగాని మామూలు సభ మర్యాదనైనా పాటించాల్సిన యవసరం, యందులోను ప్రత్యేకాహ్వానాలంటూ యున్నప్పుడు వున్నదికదా!



# నాటకశిల్పం

## V. నాటకానంతరం

నేటి వృత్తినటులు తమపాత్ర ఐపోగానే (ఒక్కొక్కప్పుడు ఐపోకుండానే!) రంగుకడిగేసుకుని పైపంచ బుజానేసుకుని రైలుస్టేషనుకు దారి తీస్తారు.

ఔత్సాహిక నటులకు నాటకం యయిన యరగంటదాకా యసలు నాటకం యయిపోయిందన్నట్లే యనిపించదు, ప్రదర్శననుగురించి తీయతీయని కలలుకంటూ యుంటాడు ప్రతివాడూ తననూ తనపాత్రనూ యభినందించాలని యాశిస్తూంటాడు. వీ రీ యభినందనలకు యర్హులుకూడాను.
నాటకం యయిపోంగానే వీలులేకపోయినా యా మర్నాటి సాయంకాలమైనా యొకచిన్న సమావేశం యేర్పర్చాలి. ఈసమావేశానికి ప్రేక్షకులలోని కొందఱుపెద్దలను, నాటకాభిమానులనూ యాహ్వానించి వీలైతే ఓచిన్న టీపార్టీ, ఫోటో కూడా యేర్పాటుచేసుకోవచ్చు.

ఈ సమావేశంలో యభినందనలూ వగైరా యయిపోయినాక నాటకాభిమానులు (సమాజేతరులు) చెప్పిన మంచి సలహాలు ముందుముందు పాటించాలి,

సాధారణంగా మీరు యూరికే నాటకం చూపించి ఓచిన్న టీపార్టీకూడా యిచ్చిన పెద్దమనిషీ నిర్మొహమా

టంగా మీ ప్రదర్శనలోని చెడ్డవిషయాలు ముఖాముఖి చెప్పడు యెవరన్నా నాబోటివాడు చెప్పాడంటే వారిని మీ సన్నిహిత బంధువులుగా యెంచుకోండి! యంతేగాని వారు చెడ్డసంగతులు చెప్పారని వాడికేం తెల్సు పోమా యని చప్ప రించకండి.

కాగా కొందరు కొందరికి యెంతమంచి ప్రదర్శనైనా నచ్చదు. (అసలిలాంటివారికి యేమీనచ్చవు) వారు యెక్క డికివెళ్ళినా చెడుతప్ప మంచినిచూడలేరు. చూసినా మెచ్చు కోలేరు. అలాంటివారిని యొకటిరెండుతడవలుచూచి మూనో మాటు వెలిగానుంచండి.

మీరు ప్రదర్శన యెంత చెడగొట్టినా యెక్కడో అక్కడ యెవరో యొకరు కాస్తో కూస్తో బాగానే చేసి యుంటారు. చెడగొట్టినచోట్ల మాత్రం చెప్పి బాగాచేసిన విషయాలు చెప్పకపోతే మీకు కష్టంగానే యుంటుంది.

సరైన విమర్శకుడు మంచిచెడ్డలను సమానదృష్టితో పరిశీలించి తగు సలహాల రూపంలో విమర్శచేస్తాడు. అలాంటి వారిని మీరు యెంతమాత్రమూ మీ సమాజానికి దూరం కానియ్యవద్దు. అతను మీకు కొన్ని చేదుమాత్రలు యిచ్చినా సరే.

సమాజేతరుల విమర్శ యయినాక వారిని వెళ్ళనిచ్చి మీకు మీరు విమర్శచేసుకోండి. మీలో యొకరిద్దరు ప్రదర్శ నను ప్రేక్షకస్థానంనుండి చూసినవారుంటారు. ముందువారిని

చెప్పనివ్వండి, ప్రదర్శన యెలాగున్నదీ ప్రేక్షకులు దాన్ని యెలా ఆస్వాదించారు వగైరావగైరాలను. తరువాత రంగ స్థలం ప్రక్కనుంచి చూసినవారూ ప్రక్కనటులూ చెప్పండి.

ఓ సమాజంలో యిలాటిసమావేశానికి నేను హాజరైనాను. వారిలో ప్రేక్షకులలోనుంచి చూచిన యొక సభ్యుడు చెప్పినది "ఫలానివాడు పైగుడ్డ పొరుగింట్లోకుర్చీమీద వదిలేసి వెళ్ళి పోయాడు"

"ఫలానివాడు మీసం మాటిమాటికి (వూడ్తుందనే భ్రమతో) తడుముకున్నాడు" ఇలాంటివేవో యరడజను ఓపిగ్గా నోటుచేసుకుని యేకరువుపెట్టాడు. ఇలాంటి విమర్శలు కావలసినవేకానీ యిక్కడ మనకు వీటివల్ల ప్రయోజనం సూన్యం.

విమర్శ చేయబడిన విషయాలు చర్చనీయాంశాలై ముందుముందు మన సమాజం ఉత్తమ తరగతికి చెందిన ప్రదర్శన లిచ్చేందుకు యుపకరించేవిగా యుండాలి.

పై చెప్పినలాటి స్వల్పతప్పిదాలు ప్రతిప్రదర్శనలోనూ యుంటూంటాయి. ఈవాళ పైగుడ్డ పొరుగింటి కుర్చీమీద మర్చిపోయిన ఆసామీ మీరు చెప్పినందువల్ల (చెప్పకపోయినా యిది యతను తెల్సుకుంటాడు) రేపు మరో ప్రదర్శనలో ఆతప్పు చేయక పోవచ్చు. కానీయిలాంటిదో యంతకన్నా యెక్కువదో మరోటి చెయ్యవచ్చు. ఇలాటివి జరక్కుండా చూచుకోడం చాలామంచిదే. కానీ జరిగిపోయాక వీట్ని

గురించి విమర్శ యంతగా యవసరం. అలాగని యీమాదిరి తప్పులు చెయ్యమని కాదుగాని ఆ తప్పులుచేసిన నటునకు తనుచేసినతప్పు మీరు చెప్పకుండానే తెలిసిపోయినప్పుడు మళ్ళీ మీరదే పదేపదే యతనికి చెప్పాల్సిన యవుసరంలేదు.

అతనికి ఉపయోగపడే విమర్శ కావాలి! అంటే ఇత రులు చెప్పకుండా తను తెలుసుకోలేని తప్పు లతనికి చెప్ప టమే మంచి విమర్శ. అతను ఒకవిధంగా నటిస్తే ప్రేక్షకులు మరొకవిధంగా అర్థంచేసుకున్న సందర్భాలూ, అసలుభావం అందనటువంటి ఘట్టాలు చెప్పాలి. వాచికంలో అంగవిన్యాసంలో దోషాలుగా కనిపించినవి చెప్పాలి అంతేగాని పత్రికలో పేరు పడటానికని కొందరు సినిమావిమర్శలు చేస్తున్నట్టు చేస్తే ప్రయోజనంలేదు.

ఏదన్నా వ్యతిరేకాభిప్రాయంవస్తే ఓ చిన్న వాదనను కూడా లేవదీసి ఏది తప్పో ఏది రైటో నిర్ణయించడానికి ప్రయత్నంకూడా చేయాలి

నాటకప్రయోగం మొత్తంమీద ఫలించిందీ లేందీ తెలుసుకోవాలి. ప్రదర్శన బాగుండకపోతే ప్రయోగలోపమో మరేలోపమో తెల్సుకోవాలి. వీలైతే లోట్లన్నీ మరో ప్రద ర్శనలో సవరించుకోవాలి నాటక మెందుకూ పనికిరానిదైతే ఓదణ్ణంపెట్టి యిక దానిజోలికి పోకూడదు.

కానీ సాధారణంగా మీరానాటకాన్ని మరొకళ్ళు బాగా ప్రదర్శించారని ఎత్తుకునివుంటారు. అటువంటప్పుడు

మీచేతుల్లో ప్రదర్శన చెడిందంటే లోపం ఎక్కడవుందో తీవ్రంగా ఆలోచించందే ఆనాటకాన్ని వదలవద్దు.

వేరొకచోటు ప్రదర్శన బాగుండి మీరు చేసిన ప్రదర్శన చెడిపోవటం బహుశా మీలోటు కాకపోవచ్చు! ఆ ప్రదర్శన చేసినవారికి కొన్ని ప్రత్యేకహంగులు (ప్రేక్షకులతోసహా) ఉండి వుండవచ్చు. అందుకే ముందు చెప్పాను. ఎవరో వేసిన నాటకము బాగుందని మీరూ దాన్నే ఎత్తుకోవద్దని. పరిషత్తుల్లో మొదటి బహుమతి సంపాదించిన నాటక మనేక సమాజాలెత్తుకుని దాన్ని సహ్యాంచేసి వదలిపెడ్తున్నాయి. ఇది అంటువ్యాధిలా వ్యాపించి నాటకాన్ని హరించివేయక ముందే జాగ్రత్తపడాలి.

ప్రదర్శన బాగుంటే క్లుప్తంగా వివరాలు వ్రాస్తూ రచయితకు తెలియబర్చటం సమాజపు కనీసవిధి. తన రచనను మీరు చక్కగా ప్రదర్శించినందుకు సంతోషిస్తాడు వీలుంటే మీ మొదటి ప్రదర్శనకు ఆయనను ఆహ్వానించటం మంచిది. నాటకప్రదర్శనకు ముందూ చివరాకూడా ఆయన సలహాలు పొందటం అభిలషణీయం. మీ ప్రదర్శనవల్ల ఆయనకూడా కొన్నికొన్ని కొత్తసంగతులు తెలుసుకుంటాడు. ఉన్న నాటకాన్ని సంస్కరించడానికీ మరో క్రొత్తరచన చేయడానికీ యీ మాదిరి అనుభవాలు రచయితకు అవుసరం.

## మరో ప్రదర్శన

వేసిన నాటక ప్రదర్శన బాగుంటే దాన్నే మరోమా రావృాళ్ళోనేగాని లేక మరో వూళ్ళోగాని ప్రదర్శించవచ్చు.

మరో ప్రదర్శన సాధారణంగా మొదటి ప్రదర్శన కన్నా బాగుండాల్సిందిపోయి పేలవంగా వుంటోంది! దీనికి ప్రబలకారణం మీ రొత్సాహికు లవటమే! ఒక ప్రద ర్శనలో పతాకస్థాయి నందుకొన్న పాత్రలూ సన్నివేశాలూ మరో ప్రదర్శనలో దిగజారి పోతున్నాయి. మీ పాత్రను గురించిన యహంభావ మేర్పడుతుంది. ఇదివరక ద్భుతంగా నటించిం దేగా యనే నలసత్వం పొడసూపుతుంది.

నాటకమూ నటుడూ యెల్లప్పుడూ నవ్యతతో విక సిస్తూండాలి. ప్రాతకొత్తలు (పాత్రలుగాని, నటులుగాని) **ఒకే విధమైన నుత్సాహంతో** ప్రదర్శించాలి. ఒకదానికన్న మరో ప్రదర్శన బాగుండాలి. మీరే యలసత్వం ప్రదర్శిస్తే చూచే ప్రేక్షకుల కెలాగుంటుంది?

మీరు చేసిన మంచి ప్రదర్శన చూచి యౌత్సాహి కులు మరికొందరు మీసమాజంలో చేరనిచ్ఛగించి మీవద్దకు రావచ్చు. వారిని నిరుత్సాహ పడకుండా వీలువెంబడిని నుపయోగించుకోండి.

మరో రచయిత మీకో నాటకంప్రదర్శన నిమిత్తం ఇవ్వవచ్చు. తృణీకరించకుండా నాటకం పరిశీలించి ఏమాత్రం

బాగున్నా రచయిత అనుమతితో కావలసినమార్పులు చేసు కని ప్రదర్శించండి.

సాధారణంగా ప్రదర్శన చెడిపోతే మరోప్రదర్శనకు ప్రయత్నించే ఉత్సాహం సామాజికులలో ఉండదు. కాగా మరే సమాజమన్నా మరోనాటకం ప్రదర్శించేటప్పటికి ఎక్కడ లేని ఉత్సాహమూ వీరికికూడా తిరిగి వస్తుంది.

ఇక మళ్ళీ ప్రారంభం : నాటకం ఎన్నిక నటుల ఎన్నిక, రిహార్సల్సు, ప్రదర్శన వగైరాలు.

ఒకమారు నాటకసమాజంలో జొరబడినవారు ఎన్ని అపజయాలుపొందినప్పటికీ, ఎన్నెన్నిమాటలు పడినప్పటికీ, యెన్నిచిక్కులు యెదుర్కొన్నప్పటికీ, యీ రంగస్థలాన్ని వదలరు. అపజయాలు పొందినకొద్దీ ద్విగుణీకృతోత్సాహంతో పనిచేస్తారు. వుత్సాహమూ పట్టుదలా ప్రజ్ఞా వున్నవారు యేనాటికైనా 'ఉత్తమనటు' లనిపించుకొంటారు. మంచి నాటకాలు ప్రదర్శించిన సమాజంపేరు చిరస్థాయిగా వుంటుంది.

ఈనాడు దేశం నలుమూలలా నాటకాలకూ నాటిక లకూ పోటీలు నిర్వహించేసంస్థలు వెలిశాయి. కొద్ది సంవత్స రాలక్రిందట పోటీకార్యక్రమాలు ప్రారంభించిన ఆంధ్రనాటక కళాపరిషత్తూ యీ పోటీలనింకా నిర్వహిస్తూనేవున్నది. యీ పోటీలకుగాను తయారుచేసుకునే నాటకాలుకూడా మళ్ళీమళ్ళీ ప్రదర్శనలకునోచుకోడంలేదు. పోటీలకుకూడా ఒక Standard అనేది ఏర్పడలేదు.

ఈ పోటీలనూ వివిధ సమాజాలనూ పరిశీలించి ఔత్సాహిక సమాజాలు తాము తయారుచేసిన నాటకానికి అనేక ప్రదర్శనలుకలిగే భాగ్యం కలిగించుకునే పథకం ఒకటి తయారు చెయ్యాల్సిన అవసరం కనిపిస్తోంది.

ఔత్సాహిక నాటక ప్రదర్శన యన్నంత మాత్రం చేత యేదో వుబుసుపోకకు కాసేపు చూచి వద్దాంలే యనే తలంపు ప్రేక్షకులకు మాన్పించాలి. ఔత్సాహిక ప్రదర్శనకు కూడా డబ్బు ఖర్చవుతుందనే విషయం మరువరాదు. కనీసం ఖర్చుచేసిన డబ్బునా ప్రేక్షకులనుంచి రాబట్టగలిగే స్తోమత యౌత్సాహిక సమాజాలు సంపాదించాలి. ఎల్లప్పుడూ కాన్వాసింగుమీదా 'నాటక కళ'ను ప్రోత్సహించు డనే Slogan తోనూ యీ రంగ మభివృద్ధి చెందదు. ఊరూరా తిరిగి ప్రదర్శన లివ్వలేకపోయినా కనీసం తమ యూళ్లోనన్నా నాటక మంటూ వేస్తే పదిమంది కది చూడాలనే కోరిక కలిగేలా తమ ప్రదర్శనల స్థాయిని పెంచుకోవాలి. నాటకం యెడ్వర్ టైజ్ చెయ్యగానే యదెప్పుడా యెప్పుడా యనే తహతహ ప్రేక్షకులకు కలగాలి. అంతేగాని దసరామామూళ్ళకు తిరిగినట్లు టిక్కట్ పుస్తకాలు పుచ్చుకుని ప్రతిప్రదర్శనకూ ప్రేక్షకుల కాన్వాసింగుకు బయల్దేరే యలవాటు మెల్లి మెల్లిగానన్నా తప్పించాలి. ఇది చెప్పినంత తేలికకాదు. నిజమే. కాని కొంత సాహసముంటే యిది సాధించడము కూడా యేమంత కష్టమైన పనికాదు. టిక్కట్లంటూ యేర్పాటు చేయకపోయినా ప్రదర్శనకు వచ్చినవారంతా

విధిగా యెంతో కొంతడబ్బు యిచ్చే యేర్పాటును శ్రీ సోమంచి యజ్ఞన్న శాస్త్రిగారు ఏలూరులో తామున్న రోజుల్లో నేర్పాటు చేశారు. ఈ పద్ధతిలో నెల నెలా ఒక నాటకం ప్రదర్శించే యవకాశం సులువుగా యేర్పడింది.

ఏది యేమైనా యీనాటి తెలుగునాటకరంగం కొందరు పెద్దలు యనుకున్నంత యధ్వాన్న స్థితిలో లేదు. వృత్తి నాటకాలాయా ప్రేక్షకుల కీనాటికీ యానందాన్ని సమకూరుస్తూనే వున్నాయి. ఔత్సాహిక నాటకాలు క్రొత్త క్రొత్త ప్రయోగాలు చేస్తూనే వున్నాయి. వృత్తి నాటకాలలోనూ, యౌత్సాహిక నాటకాలలోనూ కూడా వెనుకటి తరంవారి ప్రతిభకు తీసిపోని నటులున్నారు. నాటక ప్రయోగంలో దిట్టలైన చేతులున్నాయి. ఎటొచ్చి వీరందర్నీ సమీకరించి ఒక పద్ధతిలో నాటకాలను ప్రదర్శించ గలిగిన వ్యక్తులూ, సంస్థలే కరవుగా కనిపిస్తున్నాయి. పోటీలు నిర్వహించే సంస్థలు కొంతవరకూ చక్కని నాటక ప్రదర్శనలకు బాధ్యత వహించవచ్చు. కాని కారణాంతరాలచేత మొన్ని ప్రదర్శనలు చెడితే యెంతమంచిదనే మనస్తత్వంతో యిప్పటికూడా వ్యవహరిస్తున్నాయి. మొదట్నుంచీ చివరిదాకా నిర్వాహకులకూ పోటీదార్లకూ పోటీస్పిరిట్ తప్ప చక్కని ప్రదర్శన నేర్పాటు చేసే దృష్టి కరువౌతున్నది. ఈ పోటీలలో సంపాదించాల్సిన Standards కోసం పోటీలు నిర్వహించే సంస్థలూ యందు పాల్గొనే సమాజాలుకూడా ప్రయత్నించాలి. కేవలం బహుమతికోసం, ఇతరులెవరెన్ని తప్పులు చేస్తారా మనమెన్ని లోపాలు చూపగలమా యనే భావన మానుకోవాలి.

పోటీలు నిర్వహించేసంస్థలు క్రమక్రమంగానన్న బహుమతీ విధానంతో ఒక క్రమపద్ధతి ప్రారంభిస్తే కొన్ని Standards ఏర్పడ్తాయి. బహుమతీ నిర్ణయవిధానం జడ్జీలతో బాటు మారేదిగా యుండకూడదు.

కొంతవ్యయప్రయాసలతో కూడుకున్న పనే యయినా ఆంధ్రప్రదేశ సంగీత నాటక అకాడమీ యిటువంటి Standards సృష్టింపబడటానికి చర్చావేదికలూ, సమావేశాలూ, ప్రదర్శనలూ, ఏర్పాటుచెయ్యవచ్చు. కేవలం పోటీలతోనే కాక యితర త్రోవగూడా యివి సాధింపవచ్చు.

నాటకం, నటుడూ, బిషాందేహీ అని ఒకరిపం ఆనుబడి యాశ్రయించకుండా తన కాళ్ళమీద తను నిలబడ గలిగి తనంత తాను ఒకరికి పెట్టగలిగే స్థితిలోకి తీసుకురావా ల్సిన బాధ్యత నేటి నటులమీదా నాటకాభిమానులమీ దవ్వతో చేసేవారిమీదా నాటకకళాభివృద్ధి కార్యకలాపాలు సాగిస్తున్న సంస్థలమీదా యున్నది.

ఈ బాధ్యత సక్రమంగా నిర్వహింపబడుతుందనీ, చేబట్టిన నాటకం తిరిగితిరిగి ప్రదర్శనల నందుకుంటుందనీ, ఆంధ్రనాటక రంగంకూడా ఏ యితర నాటకరంగాలకూ తీసిపోదనిపించు కుంటుందనీ మనఃపూర్వకంగా నమ్ముతున్నాను.

సమాప్తం

---

శ్రీ కొండపల్లి ముద్రాశాల, రాజమంద్రి.

